శ్రీ

# భక్తమందారము

(వచనము)

శ్రీ మహావిష్ణువును సేవించి చరితార్థులైన
కొందఱు మహాభక్తుల కథలు.





రచయిత:

కవిశేఖర కొండేపూడి సుబ్బారావు

శ్రీరస్తు

# భక్తమందారము

(వచనము)

శ్రీవిష్ణువును సేవించి చరితార్థులైన కొందఱు మహాభక్తుల కథలు



రచయిత:

కవిశేఖర కొండేపూడి సుబ్బారావు

మొదటి ప్రచురణ 1000 ప్రతులు

నవంబరు 1986

అక్షయనామ సం॥ర కార్తికము



వెల రు. 10-00 లు



ప్రాప్తిస్థానము :
శ్రీ కొండేపూడి సుబ్బారావు
47-10-5 ద్వారకానగరు
విశాఖపట్టణము - 530 016

ముద్రణ :
శ్రీ పతి ప్రెస్,
సుభాష్ రోడ్డు, కాకినాడ



## కృతజ్ఞత

This book is Published with the
Financial Assistance of
**Sri Tirumala - Tirupati Devasthanams**
under their scheme
Aid to Publish Religious Books.

---

ఏవిభుకృపచే నీకృతి
కావిష్కృతి భాగ్యమబ్బె నా జగదీశున్
శ్రీ వేంకటగిరినాథుని
భావంబుననిల్పి కొల్తు భక్తితలిర్పన్.

---

ఈ గ్రంథము
శ్రీ శ్రీ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ద్రవ్యసహాయమున ముద్రితము.
వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.



# సమర్పణము

శ్రీ ఆంధ్రమహాభాగవతరచనతో
ఆంధ్రావనియందు
శ్రీవిష్ణుగాథామధురామృతవర్షము కురిపించిన
మహాకవి బమ్మెర పోతనార్యుని
పవిత్ర సంస్మరణ చిహ్నముగ
ఈ భక్తమందారము అనుగ్రంథము సమర్పితము.

* * *

# పూజాంజలి

అది మహోదయమ్మతులశుభాస్పదమ్ము
కవివరుఁడు పోతనార్యుని గంటమందు
సరస భాగవత స్వాదుసాహితీ సు
ధాస్రవంతి పొంగిన అమృతక్షణమ్ము. 1

సహజపాండిత్య కవితా ప్రసాదగుణమొ
పోతనార్య పూజాఫలమ్మొ మఱేమొ
ఎపుడువ్రాసిన పద్యమ్ము లపుడె తెల్లు
నేలవ్యాపించె పండువెన్నెలల పగిది. 2

మృదుల మనోజ్ఞ శబ్దలహరీమధువాహిను లెన్ని యెన్ని గా
పదిలము లయ్యెనో యతనిస్వాంతమునందున భావతీవ్రతన్
కదలిన గంట మూగినది కానము మానితవిశ్వభారతీ
సదనమునందు మా తెలుగుసాహితి కింక మహోదయంబ కే. 3
విమల వియన్నదీ సలిల వేగము నందన నవ్యవల్లరీ
సుమమకరందమాధురియు సుందరవర్ణ తటిత్ప్రరోచియున్
అమరినవోయి పోతనమహాకవి! నీకవితావిధమ్మునన్
గమనము శైలియున్ మధురకావ్యకళాంచితశబ్దశిల్పమై. 4
బమ్మెరపోతనార్యుఁడట భాగవతామల భక్తిభావనా
ర్థమ్ములు విష్ణుకీర్తిచరితమ్ములు కోమలపల్లవార్ద్రర
మ్యమ్ములు సత్కవిత్వమహిమమ్ములు కమ్మని తేటతెల్గువా
క్యమ్ములలోన తీయకలకండలు పోతలు పోసినాడ కే. 5
అని యూరూరను మ్రోగిపోయినవి సర్వాంధ్రప్రదేశాన పో
తన కావ్యప్రతిభాసముజ్జ్వల కవిత్వస్తోత్రపాఠమ్ములో
వినుత ప్రేమమయైక జీవనకళావిజ్ఞాత బృందావనీ
వనితా గోపకిశోరు రాసనటనా వ్యాలోల లీలాధ్వనుల్. 6
లేరే పూర్వము సత్కవుల్ మధురశైలిన్ కావ్యముల్ వ్రాయ కే
వారల్ వ్రాసిన సత్కవిత్వములు శశ్వత్కీర్తి నార్జింపవే
ఏరీ భాగవతప్రబంధకవితాహృద్యోజ్జ్వలన్మాధురీ
పారమ్యమ్మును చూపగల్గినకవుల్ వాణీపదోపాసకుల్. 7
మాకొక దివ్యనందనసమంచిత నిత్యవసంతకాంతి కా
డా కలకాల మోయికవితాపస! నీకవితాకళాశరత్

శ్రీకమనీయచంద్రికలు చేతములందున పూలతీవలై
ప్రాకినవోయి నవ్యమధురమ్ములు స్వాదుసుధాఝురమ్ములై. 7
ఒకకృష్ణుండునుగాదు గోపికలుకాదో సత్కవీంద్రప్రభూ !
అకలంకాకృతు లందఱున్ తెలుగువారై నట్లు
కాన్పింత్రు మా
మకనేత్రమ్ములలో నటన్మధుసుధామానోజ్ఞ్యముల్
తోఁచి తా
వక పాండిత్య మృదూక్తి సుందర కవిత్వశ్రీవచోరేఖలన్. 9
దైవతకార్యసిద్ధిచరితాత్ముఁడు వ్యాసునివాణిలో జగ
త్పావనమైన భాగవత భవ్యకథాకమనీయసాహితీ
శ్రీవిభవమ్ములన్ తెలుఁగుసీమలనెల్ల కళాతపస్వియై
ప్రోవులుగాగ పంచియిడు పోతన మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్. 10
నిలిపిన వాంధ్రభాగవత నిస్తులదివ్యకవిత్వ దీపికా
సలలితకాంతు లీతెలుగుసాహితికిన్ మహానీయకీర్తులా
పలుకుల తీయతేనెవినువాకల వాచవి క్రొత్తచల్వలన్
పులకితమానసుండ నయి పోతన కేను నమస్కరించెదన్. 11
నూతనసాహితీవ్రతమనోహరదీక్ష ధనప్రలోభవాం
ఛాతతులన్ జయించి కవిసంతతి కొక్కస్వతంత్రమార్గవి
ఖ్యాతి గడింపఁజాలిన మహాకవి కావ్యకళామహత్వసం
పూత యశోవిభాసితుఁడు పోతనకున్ విజయాభిషేకముల్.

—

# భక్తమందారము

## తొలిపలుకు

శ్రీమహావిష్ణువును సేవించి చరితార్థులైన కొందఱు పరమభాగవతుల కథ లీగ్రంథమున రచింపఁబడినవి. ఈకథ లన్నియును మహాభాగవతమునుండి గైకొనఁబడినవే. మహా భక్తుల జీవితములు మానవజాతి ఇహపరసౌఖ్యము లందుట కెట్లు మార్గదర్శకములు కాగలవో చూపుటయే లక్ష్యము గాగల రచన లీకథలు. మున్ముందుగ శ్రీమహాభాగవత మును గూర్చి రెండుమాటలు అవసరము.

మన భారతదేశము కర్మభూమి; మనమతము వైదిక మతము. దుఃఖభాజనములను జననమరణములనుండి విముక్తి నంది పరమాత్మసాయుజ్యమందుటయే శ్రీకైవల్యపద ప్రాప్తి. అదియే జీవితగమ్యస్థానమగు మోక్షము, శాశ్వతా నందప్రదమగు బ్రహ్మభావము. అట్టి పరమపదప్రాప్తికి అనువైన కర్మములను ఉపాసనావిధానములను ఉపదేశించు గ్రంథములు వేదోపనిషత్తులు. ఆ వైదికధర్మములు ప్రజ లకు సులభగ్రాహ్యములుగా నుండుటకొఱకు శ్రీమద్రామా యణ మహాభారత మహాభాగవతములను మన పూర్వ ఋషులు రచించిరి. మానవజాతికి లభ్యమైన అనర్ఘరత్న ఖను లాపురాణములు. శోధించినకొలఁదియు మానవజీవన

ధర్మసూత్రములు నిత్యనూతనములై అందుండి వెలువడు చునే యుండును.

ఈమూడు పురాణపుణ్యగ్రంథములందును పరమాత్మ నెఱుఁగు జ్ఞానసముపార్జనకు భక్తిమార్గ ముత్తమమైనదని బోధించు గ్రంథము మహాభాగవతము. భగవంతుని ప్రేమించి ధ్యానించి సేవించుటయే భక్తి; అదియే మోక్షసాధనకు బ్రహ్మము నుపాసించు సులభమార్గము. ఎందఱో మహాత్ములు వివిధభక్తిమార్గములలో శ్రీహరి నుపాసించి మహాభక్తులై, ఆదర్శజీవనులై, చరితార్థులైరి. భగవదనుగ్రహమునకు పాత్రులైన ఆ మహనీయుల చరిత్రము లెన్నియో మహాభాగవతమున కలవు.

భగవానుడు భక్తసులభుఁడు. "నాభక్తులు నా కతి ప్రియులు, నాభక్తుల యోగక్షేమములను నేనే చూచెదను, నాభక్తున కెన్నఁటికిని నాశము లే"దని శ్రీకృష్ణపరమాత్మ తనగీతాప్రబోధమున స్పష్టముగ చెప్పెను. చూడుడు భగవద్గీత అధ్యా. 12 శ్లో. 20, అధ్యా. 9 శ్లో. 22, అధ్యా. 9 శ్లో. 31 మొ॥వి.

భగవద్భక్తుల కిట్టి పవిత్రమార్గమును చూపఁగలిగినది వ్యాసమహర్షి కృతసంస్కృత మహాభాగవతము. దీనిని తెనిఁగించిన ఆంధ్రమహాకవి బమ్మెర పోతనార్యుఁడు. పోతనార్యుని రచనలో మధురాతిమధురములై ఆంధ్రభాగవత కథామృతరసప్రవాహములు ఆంధ్రావనియం దెల్లెడల పొంగి

పొరలినవి. తెలుఁగుసీమలో అత్యధిక ప్రజాదరణమునందిన గ్రంథము పోతనార్యుని ఆంధ్రమహాభాగవతము.

ఈ భక్తమందారమున రచింపఁబడిన కథలన్నియు ఆంధ్రమహాభాగవతము నాధారముగాఁగొని రచించినవే. పుష్పమకరందమాధుర్యము నెఱిఁగిన మధుపము వేఱొక చోటికిపోదు; అట్లే భగవన్మహిమనుగ్రహింపగలిగిన భక్తుని చిత్తము భగవచ్చరణారవిందములయందే లగ్నమైయుండును. భగవద్భక్తి ఒకరిసొమ్ముకాదు. అందఱును భగవానుని సేవించుట కర్హులే. ఎవరిమార్గము వారిది. ఎవరిసాధన వారిది.

మహాభాగవత సప్తమగ్రంథమునఁగల ప్రహ్లాదచరిత్రము సుప్రసిద్ధమైనది. తన కుమారుఁడైన ప్రహ్లాదుఁడు శ్రీహరిభక్తుఁడగుట సహించలేని రాక్షసపతి హిరణ్యకశిపుఁడు ఆపసిబాలుని నానావిధముల హింసించి చంపింపఁజూచును. ప్రహ్లాదుఁడు నిర్భయుఁడై తనతండ్రికి దైవభక్తి మహిమ నుపదేశించుచు వివిధ భక్తిమార్గముల నిట్లు వర్ణించెను.

"తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు ఆత్మలోనెఱుకయున్ సంకీర్తనల్ చింతనం

బను నీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్
నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁదలఁతున్ సత్యంబు
దైత్యోత్తమా.''

పోతనార్యుని ఈ తెలుఁగుపద్యము సంస్కృతమున గల ఈక్రింది శ్లోకము ననుసరించి వ్రాయబడినదే.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥''

ఆపై పద్యమునం దుదహరింపఁబడిన తొమ్మిది భక్తి మార్గములలో సఖ్యము, శ్రవణము మున్నగు ఒక్కొక మార్గమునకు ఒక్కొక మహాభక్తుని చరితము నుదాహరణముగా తీసికొని తొమ్మిది భాగములుగ ఈ భక్తమందారము రచింపఁబడినది. ఈభక్తుల కథలన్నియు ఆంధ్రమహాభాగవతములోనివే. ఏభక్తునిగూర్చియయినను ఈభక్తునియందు గల భక్తిమార్గ మిదియేయని వింగడించి ఒకేగుణమును చెప్పుట వీలుకాదు. ఆభక్తునియం దేభక్తిమార్గము ప్రస్ఫుటముగ తోచునో దానినే ప్రధానముగ సూచించుచు వ్రాసిన కథలివి.

రచన నొకింత ఆకర్షణీయ మొనర్చుటకై అందందు కొన్ని వర్ణనలను జేర్చితిని. సందర్భానుసారముగ పోతనార్యుని పద్యములఁ జేర్చితిని. ఈకథలయం దుదహరింపఁ

బడిన పద్యములన్నియు ఆంధ్రమహాభాగవతములోని ఆయా ఘట్టములనుండి యెత్తి వ్రాయబడినవే.

శ్రీహరిని గూర్చిన కథలన్నియు ఇహపరసౌఖ్యప్రదములు, హర్షదాయకములే.

"ఏకథలయందు పుణ్య
శ్లోకుఁడు హరిసెప్పఁబడును సూరిజనముచే
ఆకథలు పుణ్యకథలని
ఆకర్ణించెదరు పెద్దలతి హర్షమునన్."

అనికదా పోతనార్యుని వాక్యము

ఈ మహాభక్తుల కథలనుండి చదువరులకు కొన్ని సత్యములు తెల్లముకాకపోవు. దైవభక్తులగుటకు ఎక్కువ తక్కువ భేదములులేక అందఱును అర్హులే. సర్వాంతర్యామియు సర్వభూతమహేశ్వరుఁడైన శ్రీహరి కందఱును సమానులె. విప్రోత్తముఁడైన కుచేలుని, ఆప్తుఁడైన అక్రూరుని, మహాజ్ఞానియగు భీష్ముని, శ్రీకృష్ణభగవానుఁ డెట్లను గ్రహించెనో, కేవలము పూవులమ్ముకొని జీవించు సుదామునికూడ అట్లే ప్రేమించి ఆదరించెను. నిశ్చలము నిర్మలమైన భక్తి అలవడవలయునే కాని తరతమభేదములులేక భగవద్భక్తు లందఱికి ధ్యేయము గమ్యస్థానము ఒక్కటియే. వారందఱియందు భగవదనుగ్రహ మొకరీతిగనే ప్రసరించును.

ఈకథనుండి మహాభక్తుల జీవనవిధానములు సార్వ జనీనములగు మానవశ్రేయోమార్గములని కూడ స్పష్టముగ తెలియనగును. భక్తుని ముఖ్యలక్షణములు కరుణ, భూత దయ, స్నేహాభావము, సత్సాంగత్యము, ద్వేషము లేకుం డుట, నిర్భయము, శుచిత్వము, కార్యదక్షత, నిస్స్వార్థము, కష్టసుఖములయందు సమబుద్ధి మున్నగునవి. మానవాభ్యు దయమునకు విశ్వశాంతి సౌఖ్యములకు అనువైన మార్గము లివియేకదా. ఇట్టి పవిత్రవర్తనము కలవారగుటచేతనే "సర్వేజనాః సుఖినోభవన్తు" అను భారతసనాతన ధర్మ సూత్రసాధనకు మహాభక్తులు మార్గదర్శకులైరి.

ఈ సత్యములను నిర్వచించుటయే ఈ భక్తమందార గ్రంథలక్ష్యము. ఈ గ్రంథమువలన భగవన్మహిమను భగవ ద్భక్తిఫలితములను చదువరు లేమాత్రము గ్రహింపఁగలిగి నను నా ప్రయత్నము సఫలమని భావించుచు ఆంధ్రప్రజా నీకమున కీగ్రంథము నందించుచున్నాను.

నా కోరికను మన్నించి ఈ గ్రంథమునకు భూమికగా సుప్రసిద్ధులు మహాపండితులు మహాపౌరాణికులు పూజ్యులు అయిన శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులవారు ఆమోదము అనుపేరున పరిచయవాక్యములు వ్రాసియిచ్చి నందులకు నేను వారికి బహుధా కృతజ్ఞుఁడను, వారికి నా హృదయపూర్వక వందనములు.

అక్షయ సం॥ర కార్తికము
నవంబరు 1986.

గ్రంథకర్త.

# ఆమోదము

వ్యాకరణవిద్యాప్రవీణ, భాషాప్రవీణ,
శ్రీ భాష్యం అప్పలాచార్యులు M. A.

కవిశేఖర శ్రీ కొండేపూడి సుబ్బారావుగారి భక్తమందారమకరంద రసామోదమునఁదేలి ధన్యుఁడనైతిని. శ్రీమద్భాగవతము భక్తమందారవనము. అందెందరో భక్తులు తమభక్తిప్రసూనములతో నలరింతురు. శ్రీమద్భాగవతము శ్రీకృష్ణావతారము. శ్రీమద్భాగవతము భక్త్యుత్పాదకము- భక్తివర్ధకము. వాసుదేవపాదారవింద భక్తియే మానవజీవితమునకు చరితార్థత గల్గించును. భగవంతుని స్వరూపరూపగుణములను విని ఎఱింగి స్మరించి అవిచ్ఛిన్నభావనతో దర్శనసమానమైన అనుభూతినందుటయే భక్తి. "ప్రీతి పూర్వమనుధ్యానం భక్తిరిత్యభిధీయతే" పరమప్రేమయే భక్తి. ఆ భక్తియొక్క అవస్థలు తొమ్మిది విధములుగ నుండును.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం సఖ్యం దాస్యమాత్మనివేదనమ్ ॥"

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, సఖ్యము, దాస్యము, ఆత్మనివేదనము అను తొమ్మిది భేదములు గలిగిన ప్రీతిరూపమైన దర్శన సమానమైన తైలధారవలె సాగు అవిచ్ఛిన్న స్మృతిసంతతి

భక్తి. దాస్యము సఖ్యము వాత్సల్యము శాంతము మధురము అని భక్తి అయిదు విధములుగా నుండును. అన్నిటను స్థాయిభావము భగవద్రతియే. ఆలంబనము భగవానుడు. ఉద్దీపనము బృందావన గోగోపికామురళీరవాదులు. ఆరతి అవిచ్ఛిన్నముగ విజాతీయభావనలేక సాగునపుడు కల్గు అవస్థలే శ్రవణాదులు. అందు దాస్యభక్తి ఉద్ధవాక్రూరవరాలాకారులది. వాత్సల్యభక్తి నందయశోదలది. సఖ్యభక్తి కుచేల గోపాలురది. శాంతభక్తి భీష్మాదులది. మధురభక్తి గోపికలది. ఈ అయిదువిధములయిన భక్తులందును పై తొమ్మిది అవస్థాభేదము లుండును. అందు ఒక్కొక్కరియందు ఒకొక్క అవస్థ ప్రస్ఫుటముగా గోచరించును. దానిని భావించి శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు తొమ్మిదిమంది భక్తుల చరితములను అందించినారు. సంస్కృతభాగవతమున నున్న క్రమమును మార్చి పోతనామాత్యులు సఖ్యము, శ్రవణము, దాసత్వము, వందనము, అర్చనము, సేవ, ఆత్మలో నెఱుక, సంకీర్తనము, చింతనము అను క్రమమును నిర్దేశించిరి. అదేక్రమమున తొమ్మండుగురు భక్తుల చరితములను వచనమున శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు రచించిరి.

శ్రీ సుబ్బారావుగారి పద్యశైలి పరమరమణీయము. పోతన పద్యముల బోలియుండు మధుర గంభీర పదగుంఫనము కలది. వచనమునగూడ కేవల కథాప్రతిపాదనమే

కాక కావ్యత్వమును సంతరించిరి. అందమైన సన్నివేశము లతో దృశ్యముగ సాగినది. జరిగినది కండ్లయెదుట దర్శన మిచ్చునట్లున్నది. మధ్యమధ్య పోతన పద్యములను పొందు పరచినారు. శ్రీకృష్ణకుచేలుల పరస్పరమైత్రిని ఎంతో అంద ముగ వర్ణించిరి.

కుచేలుడు శ్రీకృష్ణుని దర్శించిన సన్నివేశము, అక్రూరుడు భగవానుని దర్శించిన సన్నివేశమూ- భీష్ముడు శ్రీకృష్ణుని దర్శనమున అనుభవించిన అనుభూతి- గోపికలు వెదకి వెదకి శ్రీకృష్ణుని దర్శించి అనుభవించిన అనుభూతి- పరమసుందరములు, మధురాతిమధురములు. చదువుచున్న పుడు ఏదో చెప్పలేని అలౌకికానుభూతిని కల్గించుచున్నవి. కవిహృదయము భక్తిరసభరితము- భావన తన్మయీభావ ముతో తాదాత్మ్యదశాసంపన్నము- భావములు శ్రీకృష్ణ మాధుర్యసంతరితములు - పదగుంఫనము ఓజఃప్రసాద మాధుర్యసమిశ్రితము.

వచనరచన చాల కష్టము. "గద్యం కవీనాం నికషం వదంతి'' అని పెద్దలసూక్తి. అట్టి వచనమునుగూడ కావ్య ముగ రచింపగల మహాకవులు శ్రీ కొండేపూడి సుబ్బారావు గారు. నాచేత భక్తమందారము ననుభవింపజేసిన మహో దారులు. ఈ మహాకావ్యమునందలి ఆమోదమును సహృ దయులెల్లరు ఆస్వదింతురుగాక.

ఇతి నివేదయితా

— శ్రీభాష్యం అప్పలాచార్యః

# భక్తమందారము

## విషయసూచిక







శ్రీ ర స్తు

# భ క్త మం దా ర ము

## 1. స ఖ్య ము - కు చే లుఁ డు

కం. దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ బాయనిభక్తిం
గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగని యేను భుజింతున్.

నాయందు భక్తిఁగల జను లర్పించిన పత్రము పుష్పము ఫలము ఏదైనను, లేశమాత్రంబైనఁ బదివేలుగా నంగీకరింతు నట్లుగాక నాయందు భక్తిలేని దుష్టాత్ముండు మేరుగిరియంతటి బంగార మిచ్చినను నాకది సమ్మతంబు గాదు; అని భగవద్వచనము. కుచేలుడు నిరుపేదయే కావచ్చును కాని పరమాత్మయందు నిరంతరము నిశ్చలమైన భక్తిగలవాడు. ఆతడు స్నేహభక్తి పూర్వకముగ తెచ్చిన అటుకలనే శ్రీకృష్ణుఁడు పరమానందముతో స్వీకరించి సకల సంపదలు భవమోక్షము నొసఁగినాఁడు. ఇది క్లుప్తముగ కుచేలుని కథ.

శ్రీకాశీపట్టణమున గంగానది ఉత్తరవాహినియై నేత్ర పర్వముగ ప్రవహించును. ఆ పుణ్యక్షేత్రమున కొంకింత దూరమున సాందీపముని ఆశ్రమ మున్నది. అది ఆముని వర్యుని తపోవాటికయేకాక, నిత్యము ఆ మహాసీయుఁడు

శిష్యులకు వేదవేదాంగములు, సకల శాస్త్రములు బోధించు గురుకులము కూడను. అది యెల్లపుడును పలుచోట్లనుండి వచ్చు అనేక విద్యార్థులకు నెలవు.

ఆనాఁడు సాందీపుని గురుకులము కడు రమణీయమై విరాజిల్లుచున్నది. ప్రాతస్సమయ శీతలానిలములు సుమసుగంధములను నలుదెసలకు పంచుచున్నవి. బాలభానుని కిరణములు చెట్ల ఆకుల సందులనుండి బంగరు కాంతులను విరజిమ్ముచు ఆ యాశ్రమస్థలమున కొక నూతనశోభ నిచ్చుచున్నవి. ఆ ప్రదేశమంతయు ఆదినమున మఱింత రమ్యము ఆహ్లాదకరముగ నున్నది.

శిష్యులకు వేదపాఠములతో సాందీపుని ప్రబోధ మారంభమైనది. ఆతఁడొక ఋక్కు స్వరయుక్తముగ చదువును. వెనువెంటనే శిష్యులందఱు ఆ వేదపాఠమును సస్వరముగ వల్లెవేయుదురు. సోదాహరణముగ గురు వాపాఠమునకు వ్యాఖ్యానము నుడివి మఱియొకదాని నందుకొనును. ఛాత్రుల కాప్రవచన మంతటితో కంఠస్థము కావలసినదే. సాందీపుని వేదస్వరము లాప్రాతఃకాల పవనవీచికలందు మధువు లొలుకుచున్నవి. ఇంతలో ఆజానుబాహుఁడయిన ఒక తేజస్వి ఇద్దఱు బాలకులను చెరియొక చేతితో తీసికొని వచ్చి సాందీపున కభివాదన మొనర్చి నిలుచుండెను. ఆ బాలురును లేతచిగురులవంటి తమ చిఱుచేతులతో సాందీపుని చరణారవిందములంటి ప్రణామము లర్పించి నిలుచుం

డిరి. వారిరువురిలో ఒకఁడు కొంచెవము పెద్ద అనిపించును. బంగారు మేనిచాయతో మిసమిస లాడుచున్నాడు. రెండవ బాలుఁడు నీలమేఘశ్యాముఁడు. చేతిలో మురళి, శిరమున నెమలిపింఛము, గజ్జెల మొలత్రాడుఁ గలిగి చాల ఆకర్ష ణీయముగ నుండెను. ఇద్దఱును క్రొత్తగ ఉపనయనమైన వటువులు మందహాససుందరాననులు. వారిని తీసికొనివచ్చిన మహాపురుషుఁడు వారితండ్రి వసుదేవుడు. సాందీపునిఁజూచి "గురుదేవా! వీఁడు నా పెద్దకొమరుఁడు బలరాముఁడు. ఇతడు రెండవవాడు కృష్ణుఁడు. మొన్న నే వీరికి వడుగులు చేసితిని. గురుశిక్షణ వీరి కీవఱకును లేదు. తమ విద్వత్కీర్తి జగత్ప్రసిద్ధము. తమ అనుగ్రహమున కీపసిబిడ్డలను పాత్రుల నొనర్చి దిద్దితీర్చుడు" అని మఱియొకసారి వందన మాచ రించెను. వారిని చూచుటతోడనే సాందీపుడు హర్షపులకాం కితుడై "వసుదేవా, ఈబిడ్డల విద్యాభ్యాసమునకై నీవు చింతవలదు. నా శక్తి కొలఁది వీరిని విద్యావంతులఁజేసి పంపె దను. నీ కొమరులు కుశాగ్రబుద్ధులని వారి మోములే తెల్లము చేయుచున్నవి. త్వరలోనే సకలవిద్యాపారం గతులు కాగల"రని ధైర్యము చెప్పి పంపెను. బలరామ కృష్ణుల ప్రసిద్ధి అప్పటికే రాష్ట్రవ్యాప్తమైనది. మొన మొన్ననే మహాదుష్టుఁడగు కంసుని, అతని అనుచరులైన ఇతర దుష్టులను బలసాహసులై వధించి ప్రజల కపార

మోదము కలుగఁజేసిన బాలవీరులు వారు. ఆకథల నన్ని టిని సాందీపుఁ డెఱుఁగును.

అచ్చటనున్న విద్యార్థుల దృష్టియంతయు క్రొత్తగా వచ్చిన ఆ బాలకులపైననే యున్నది. ముందు బలరాముని చూతురు. వెంటనే ఆచూపులు కృష్ణునిపై ప్రసరించి అచ టనే నిలిచిపోవును. దేశికు నానతిని బలరామకృష్ణులు గంగాజలముల కాళ్ళేతులు కడుగుకొని, విష్ణుపాదోద్భవి హరజటాజూటోద్గతయైన గంగానది జలములు శిరసులపైఁ జల్లుకొని, సంకల్పము కావించి సంధ్యావందనము సరస్వతీ ప్రార్థనము ముగించి తిరిగివచ్చి చివరివరుసలో కూరుచుండిరి. ఆ వరుసలో కృష్ణుని ప్రక్కన ఉపవిష్టుఁడైన బాలుడు కుచే లుఁడు. అతని చినుగుబట్టలను బట్టియే ఆపేరతనికి పెట్టి రేమో. సాందీపుఁడు ప్రేమాదరములతో శాస్త్రబోధ కావించుచుండెను. ప్రతిభావంతులైన శిష్యులు లభించి నపుడు గురుని హృదయోల్లాసమునకు మేర యుండదు కదా.

కృష్ణుని చూడఁగనే కుచేలునకు ఆతడెవరో మహా నీయుడు భాగ్యవంతుల బిడ్డయని తోచినది. ఆతడు ధరించి నవి తెల్లని దుకూలవస్త్రములు. తాను కట్టుకొనినవి చినుగు లున్న సామాన్యపు వలువలు. తనప్రక్కనే కృష్ణుఁడు కూరుచుండుట గమనించి కుచేలు డొకింతదూరము జరిగెను. కృష్ణు డదిచూచి చిఱునవ్వి మఱింత దగ్గరకు జరిగి కుచే

లుని రాసుకొనుచు కూరుచుండెను. మఱి జరుగుటకు చోటు లేదు కుచేలునకు. ప్రతిదినము కృష్ణుఁ డట్లేచేయును. కుచేలుఁ డొకింత సందియపడుచుండును. పేదబాలుఁడైననేమి కుచేలుని వదనములో ఒక విధమగు జ్ఞానతేజము దీపించుచుండును. నలువురిలో అతనికి అదియొక ప్రత్యేకత. తీరిక సమయములో విద్యార్థు లందఱు ఆదినము పాఠములు వల్లె వేసుకొని ఒకరినొకరు ప్రశ్నించుకొనుచుందురు. కృష్ణుఁడు మాత్రము, దేశికుఁ డటు మొగము త్రిప్పగనే ఇటు ఆటలకు దిగును. కుచేలుని తనతో బలవంతముగా లాగుకొనిపోవును. కృష్ణునకు కొంచెము దూరముగా కుచేలుఁడుండ ప్రయత్నించిన కొలఁదియు కృష్ణుఁ డాతనిని మఱింత దగ్గరకు లాగుకొనును. వారి సఖ్యము ఆరీతిగ దినదినప్రవర్ధమానమైనది. భోజనసమయమప్పుడు కృష్ణుడు చాల అల్లరిచేయును. కృష్ణుని చిలిపిపనులు చూచినకొలఁదియు కుచేలున కానందము పట్టరానిదిగా ఉండును. అందఱితో కలసి కృష్ణుఁడును భిక్షాభ్యర్థిగా నేగును. దొరకిన వస్తువులు గురువుగారింటిలో ఇచ్చును. ఒకనాడు విద్యార్థులకు విందు జరుగుచున్నది. "కుచేలా నీ విస్తరిలో అపూపము చిదిపి ఒకముక్క కృష్ణుఁడు తీసికొనెనురా, చూచితివా" అని ప్రక్కవాడు చెప్పెను. కుచేలుఁడు మిగిలినదానిలో మఱొక పెద్దముక్క విరిచి కృష్ణున కీయబోయెను. కృష్ణుడు నవ్వుచు ఊరకుండెను. కుచేలు డిటుతిరిగి చూచునంతలో కుచేలుని విస్తరిలో

ఘుమఘుమలాడు సువాసనతో రెండు అపూపములు పడి యున్నవి. ఎచ్చటినుండి వచ్చినవి అని అందఱికి ఆశ్చర్య మయ్యెను. మఱియొకనాడు కృష్ణుఁడు కుచేలుని జూచి "ప్రతిదినము ఈ చినుఁగుబట్టలేనా, నావి ఒకజత నీకిచ్చెదను అనెను". 'వద్దులే కృష్ణా నాకివి చాలవా, ఒకటి కట్టుకుం టిని, ఒకజత ఉతికి ఆరవేసితిని, ఒకటి వేఱే చూరులో మడత పెట్టి ఉంచినాను. ఇంతకు మిక్కిలి అనవసరము' అని కుచే లుడు ఉత్తరమిచ్చెను. 'పోనీ ముందుముందు నీ పిల్లలకు పనికివచ్చును. నీవిప్పుడే విరాగివలె నున్నావే, చదువు పూర్తి అయినతరువాత ఎట్లుందువో మఱి' అని కృష్ణుఁడు పరిహాసము చేయును. "అప్పటిమాట ఇప్పుడేల, నీవే ఉం దువు కదా అన్నిటికి" అని కుచేలుని సమాధానము. ఇట్లే పరిహాసపు మాటలతో ఆటపాటలతో వారిరువురు ప్రొద్దు పుచ్చుచుందురు. ఆ బాల్యస్నేహములోని మాధుర్యము వారికే తెలియును. ఎచ్చటి కేగినను వారిద్దఱు పోవలసి నదే. జంట విడువరు.

ఒకనాఁడు తెల్లవారకుండగనే సాందీపునిభార్య కుచే లుని లేపి 'ఈనా డగ్నిహోత్రమునకు సమిధలు తక్కువగా నున్నది. ప్రొద్దు పొడిచిన మీ చదువులతోడనే సమయము సరిపోవును" అనినది. కుచేలుడు లేచి కాలకృత్యములు తీర్చు కొని సమీపముననున్న అడవిలోనికి బయలుదేరి తమ ఆశ్ర మము దాటి పదిబారలు పోయెనోలేదో, తన వెనుకనే

కృష్ణుఁడును వచ్చుచుండుట చూచి ఆశ్చర్యముగ నవ్వెను. "నీ వొక్కడవే అడవికి పోయెదవేల, నీకు భయములేదా, నేను సాయము వచ్చెదనుగదా" అని కుచేలునితో కలిసి కృష్ణుడును అడవికి వచ్చెను. వా రడవిని సమీపించినంతలో నలువైపులనుండి కారుమబ్బులు క్రమ్మి చీకటి భూనభోంతరము నిండిపోయినది. కన్ను మిన్ను కనబడుట లేదు. ఝంఝానిలము ప్రబలవేగమున వీచుచు మహావృక్షములను పడగొట్టుచున్నది. మెఱపులతో ఉరుములతో పిడుగులతో ధారాపాతముగా కుంభవృష్టి పడుచున్నది. కృష్ణకుచేలులు ఒకరి నొకరు ఎలుగెత్తి పిలుచుచు ఒకరిచేయి నొకరూతగాగొని ఒక రాతిబండ ప్రక్కగా బిక్కుబిక్కుమని కూరుచుండిరి. క్రమక్రమముగా ఆ గాలివాన తగ్గినది. సమిధలకేగిన ఆ యిరువురు బాలురు రాలేదు. వర్షపాతము మహాభీకరముగా నున్నది. సాందీపుఁడు స్వయముగా ఆ యరణ్యమున కేగి వారు క్షేమముగా నుండుట చూచి సంతసించి "మీరిరువు రిటులే ఒకరికొకరు తోడుగా నుందురుగాక, మీ రీనాఁడు పడినశ్రమ మీ గురుభక్తికి నిదర్శనము. ఈభక్తియే మీకు సకలసంపదలు, ధారాపుత్రుల సౌఖ్యము, విజయాయురున్నతులు కలుగజేయునుగాక" అని దీవించి అచట లభ్యమైన సమిధలనేరి ఆ బాలుర నింటికి గొంపోయెను.

కృష్ణబలరాములు సునిశితబుద్ధులు, అతి ప్రతిభావంతులు. అరువదినాల్గు దినములలో అరువదినాల్గు విద్యలను

సంపూర్ణముగా నేర్చి ధీశాలులైరి. సాందీపుని పుత్రుడు ప్రవాసతీర్థముకడ జలమునందు మునిఁగి చనిపోయెను. గురువర్యుని కోరికపై బలరామకృష్ణులేగి ఆబాలుని సజీవునిగ తీసికొనివచ్చి గురుదక్షిణగ నిచ్చిరి. సకలవిద్యా పరిపూర్ణులై బలరామకృష్ణులు గురువునకు ప్రణతు లర్పించి, గురుదీవన లంది తిరిగి తమ తల్లిదండ్రులవద్దకు ప్రయాణమైరి. ఒకని కొకరు వీడుకోలు తెలుపుచు కృష్ణకుచేలులు ఒకరినొకరు కౌగలించుకొనిరి. ఒకరి ఆనందభాష్పములు మఱియొకరి భుజములపై కాల్వలై పారినవి. ఆ సంయోగప్రాముఖ్యము భావనాతీతము. సాందీపుఁ డాదృశ్యమును జూచి "ఆహా! ఒకరు నిజముగ పరమాత్మ, ఒక రచ్చమైన పరమాత్మ భావము" అనుకొని కనులు చెమ్మగిలగా వారినెయ్య మిట్లే వర్ధిల్లి సఫలమగుగాక" అని దీవించెను. ఆ యాశీస్సునందు గల రహస్యము సాందీపునకే తెలియును.

పెరిగి పెద్దవాడయి మహాద్భుతకార్యము లెన్నో చేసి శ్రీకృష్ణుఁడు తన మేనమామ దేవేరులతో ద్వారకయందు మహావైభవముగ నుండెను. దుష్టులను శిక్షించెను; శిష్టులను రక్షించెను. ఆశ్రితశరణ్యుఁడు. కరుణామయుఁడు. దీన బాంధవుఁడు భక్తసులభుఁడు నని కృష్ణునికీర్తి దేశమంతయు ప్రాకినది. శ్రీకృష్ణుని కేవల నారాయణునిగా భావించి ప్రజలు కీర్తించుచుండిరి.

విద్యాపరిపూర్ణుఁడై సకలశాస్త్రజ్ఞుఁడై కుచేలుఁడును తన గ్రామము చేరుకొనెను. వివాహమైనది. పుత్రసంతతియు కల్గుచున్నది. తనకున్న కొలఁదిపాటి భూమిలో లభ్యమైన ధాన్యాదులతో తృప్తిపడి కుచేలుఁడచ్చటనే ఒకచిన్న కుటీరమునందు నివసించును.

ధనసముపార్జన లేదుగాని కుచేలునకు సంతానాభివృద్ధి మిక్కుటముగనే యుండెను. అంతకంతకు సంసారబాధ యెక్కువగుచుండెను. కుచేలునిభార్య మహాపతివ్రత. తనకు లేకున్నను కలిగినంతలో పిల్లలకు, భర్తకు, వేళకు అన్నపానాదులు సమకూర్చుచుండెడిది. కాలక్రమమున అదికూడ కష్టమయ్యెను. తనకు లేదనుబాధగాని, ఇదికావలయును అని ఇతరుల నర్థించువాంఛగాని కుచేలునకు లేవు. తాను భార్యయు పస్తులుండవలసి వచ్చుచున్నది. నిరంతర భగవచ్చింతన తత్పరుఁడైన నిర్వికారుఁడు కుచేలుఁడు. మానధనుడు జితేంద్రియుఁడు. రాగాదివిషయవిరహితస్వాంతుడు శాంతుడు గంభీరుడు బ్రహ్మవేత్త. ఆతని ధర్మతత్పరతయు భగవద్ధ్యానము నెఱిఁగిన యాతని భార్యకు భూదేవికిగల సహనమున్నది.

ఒకదినమున ఇంట పొయ్యి వెలుగనేలేదు. పిల్లలందఱు అమ్మా ఆకలి, అమ్మా ఆకలి అని గోలుగోలున ఏడ్చుచున్నారు. ఆమెకడుపు చెరువైపోయినది. ఇక పిల్లల బాధ

సహించలేక పోయినది. ఆకలి కాగలేని పిల్లల మృతికూడ చూడవలసి వచ్చునేమోయని కంటనీరు గార్చుచు నాథునికి నమస్కరించి చెప్పినది. "ప్రాణేశ్వరా! మీ జపతపముల కంతరాయము కల్గించుచున్నందులకు క్షమింపుడు. నిన్నటి నుండి పిల్లలకు తిండిలేదు. ఏవో దోసెడు అటుకులు నీళ్లలో నానబెట్టి నిన్న మధ్యాహ్నము అందఱికి ఒక్కొక్క ముద్ద మాత్రము పెట్టితిని. ఈపూట త్రాగుటకు గంజియులేదు. ఏదోరీతిని ఎవరినైన అర్థించి తెచ్చుకొనుటకన్న వేఱొక గతిలేదు. ఇంకొకరివద్దకు మీరు పోనంటిరిగదా. పోనిండు, ద్వారకనున్న శ్రీకృష్ణుడు మీ బాల్యసఖుఁడని ఎన్నియో మార్లు చెప్పితిరి. ఆయన దీనదయాళుఁడని ప్రసిద్ధి. మీరడిగినచో కాదనరు. నామాటను త్రోసిపుచ్చకుడు.

వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు దయాపయోధి భగవంతుడు కృష్ణుడు దాఁ గుశస్థలీ
పురమున యాదవప్రకరమున్ భజియింపగనున్నవాడు నీ
వరిగిన నిన్నుఁజూచి విభుఁడప్పుడయిచ్చు ననూనసంపదల్.

అనిచెప్పి "అదిగో చూడుము. పిల్లలు ఎట్లేడ్చుచున్నారో. పసిపిల్లలెన్నాళ్లు పస్తుండగలరు" అని చెప్పుచు పిల్లలను చేతిలోనికి తీసికొని బావురుమని విలపించిన దామహాసాధ్వి.

ఎచ్చటో ఊర్ధ్వలోకములలోనున్న కుచేలుని దృష్టి కొంత క్రిందకు దిగినది. తన సంతతిని పోషించుటలో తాను

నిర్లక్ష్యము చూపుచున్నట్లు తలచి భార్య చెప్పిన మాటకు ఆలోచించి ఆలోచించి తలయూచినాడు- ఆనాఁడు గురుకులమున కృష్ణకుచేలులను చూచి మీ రిరువురు సఖ్యము వీడకుడు అని సాందీపుడు దీవించెను. ఆశ్రమము వీడు సమయమున కుచేలా! నన్ను మఱవకుసుమీ అని శ్రీకృష్ణుడనెను- గురుదేవుని దీవెనలు కృష్ణుని పలుకులు కుచేలుని గుండెలలో మ్రోగినవి. ఆ చిన్నికృష్ణుఁడు ఆ సహపాఠి ఆ బాల్యసఖుఁడు మఱియొకసారి తన కన్నులలో మెఱసినట్లు కుచేలునకు తోచినది. శ్రీకృష్ణుని తలఁచుకొని మనసార నమస్కరించి ద్వారకకు బయలుదేరినాడు. ఎన్నఁటిమాట కొన్ని దశాబ్దములు గడచినది. తన బాల్యమిత్రుని కలసికొని, ఆతనికేదైన ఉపాయనము గొనిపోవుట యోగ్యము. రిక్తహస్తములతో బోవుటకన్న అని యోచించుచున్న కుచేలుని చూచి భార్య ఎన్నఁడో దాచియుంచిన రెండు గుప్పెడుల అటుకులను కుచేలుని అంగవస్త్రము కొంగున మూట కట్టినది. ఇల్లు నలుమూలల వెదకినను మఱేమియు లేదు.

కుచేలుని మనసులో దారిపొడుగునను శ్రీకృష్ణుని గూర్చిన ఆలోచనలే. 'నడచినడచి యెట్లో ద్వారకకు చేరుదును, ఆమహాత్ముఁ డేసౌధాంతఃపురములలో నుండునో ద్వారపాలకులు లోనికి రానిచ్చెదరా, శ్రీకృష్ణుఁడు నన్ను గుర్తించునా, గుర్తించిన ఆదరించునా' ఇవియే ఆలోచనలు. ఇదియే ఆందోళన. తానెందుల కచటికేగుచున్నాఁ

డనినమాట అడుగునపడినది. తలఁపులన్నియు కృష్ణమయమై భాసించినవి. ఒక్కసారి నా చిన్ననాఁటి స్నేహితుఁడు కృష్ణుని చూచిన చాలు, నాకదియే మహాభాగ్యము అని కుచేలుఁడు తృప్తిపడెను.

చివరికెట్లో కుచేలుఁడు ద్వారకకు చేరినాఁడు. ఆతని మనమునన్న భయములు నిజమయినట్లే తోఁచినది. వైకుంఠమే వసుధకు దిగిన వైభవమంతయు అచటనే యున్నది. ప్రాకారములు గోపురములు సౌధములు కొలనులు ఉద్యానవనములు క్రీడాశైలములు– ఆమధ్య శ్రీకృష్ణుని సౌధము రమ్యాతిరమ్యముగ ప్రకాశించుచున్నది. ఎవరితో తనరాక చెప్పుట. ఎవరు విని శ్రీకృష్ణునకు తెలియజేయుదురు. అంతయు అగమ్యము. శ్రీకృష్ణుడుండు సౌధప్రాకార ముఖద్వారమున వాడిశూలములు ధరించిన ద్వారపాలకులున్నారు. ఆజాను దీర్ఘ బాహులు. మహావీరులు. కుచేలునకు కాళ్ళు వణకుచున్నవి. తిరిగి వెనుకకు బోవుచో తన యత్నమంతయు వ్యర్థమగును. అడుగు లీడ్చుకొనుచు ద్వారపాలకుల కడ కేగి వినయముగఁ బ్రార్థించినాడు. “అయ్యా! నాపేరు కుచేలుఁడు, శ్రీకృష్ణులకు బాల్యమిత్రుఁడను. వారి దర్శనార్థము వచ్చితిని, లోనికి దయయుంచి పోనిండు” అని. చినిగిన బట్టలతో, ఎండిపోయి బెరడువారిన రావికొమ్మవలె నున్నాఁడు కుచేలుఁడు. ఆ పేదబాపని ఆపాదమస్తకము ద్వారపాలకులు పరికించి పెదవి విరచి యూరకుండిరి గాని

కుచేలుని ప్రవేశము నిరోధింప లేదు. కుచేలుఁడు లోనికేగి కక్ష్యాంతరములు గడచి శ్రీకృష్ణుఁడున్న ప్రాసాదద్వారము చేరుసరికి, బహిర్ద్వారమునుండియే లోన రుక్మిణీసహితుఁడై యున్న శ్రీకృష్ణుని ఆకృతి దృగ్గోచరమైనది. ఇందీవర శ్యాముఁడు, కరుణాలవాలుఁడు, సర్వలోకారాధ్యుఁడు, భక్త శరణ్యుఁడు, దుకూలవస్త్రుఁడు, కౌస్తుభాది భూషణభూషిత సురుచిరలావణ్యుఁడైన తన బాల్యమిత్రుని చూచుటే తడ వుగ కుచేలుడు తన్మయుఁడై ఆ లీలామానుషవిగ్రహుని-

కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డప్పేదవి
ప్రుని, నశ్రాంతదరిద్రపీడితుఁ గృశీభూతాంగు, జీర్ణాంబరున్
ఘనతృష్ణాతురచిత్తు, హాస్యనిలయున్, ఖండోత్తరీయుం గుచే
లుని నల్లంతనె చూచి సంభ్రమవిలోలుండై దిగెం దల్పమున్.

నిర్మలమగు భక్తి పవిత్రవర్తనము కావలయును. అది చాలును. భగవానుఁడే భక్తుని వెదకుకొనుచు వచ్చి కాపాడును. ఆనాఁడెచ్చటనో ఒక కాసారమున భీకరమగు మకరముచే బంధింపబడిన గజేంద్రుని దీనాలాపములు, అల వైకుంఠ పురంబులో నగరిలో ఆ మూలసౌధంబులోనున్న శ్రీమన్నారాయణునకు వినిపించినవి. పరుగెత్తుకొని వచ్చి ఆ గజరాజును రక్షించినాడు. ఈనాడు నిజసౌధ ప్రాకార ద్వారమున కుచేలుఁడు ద్వారపాలకులతోననిన మాటలు సౌధాంతఃపురములోనున్న శ్రీకృష్ణుని కర్ణములలో మాఱు మ్రోగినవి. ఒక నిమిషము పట్టలేదు. రుక్మిణి అర్ఘ్యపా

ద్యాది పూజావస్తువులు తీసికొనివచ్చుచుండ శ్రీకృష్ణుడు కుచేలుని కెదురేగినాడు. బాల్యమిత్రుని చూచినంతనే శ్రీకృష్ణుని వదనము అరుణరాగము సోకిన పద్మమువలె సంఫుల్లమైనది. ఆదరగౌరవ కౌముదులా సుందరవదనమున వెల్లివిరిసినవి. మందహాస మధురమూర్తియై శ్రీకృష్ణుండు "ఆహా ఎన్నాళ్ళకెన్నాళ్ళకోయీ బాల్యమిత్రమా! నిన్ను జూచుట" అని తనబాహువల్లరులతో కౌగలించుకొని శిరము మూర్కొని తన హస్తముతో కుచేలుని చేయిపట్టుకొని తిన్నగ తన శయనాగారమునకు తీసికొనిపోయినాడు.

కుచేలునకచ్చట ఒక క్రొత్తలోకమునకు చేరినట్లున్నది. తానెక్కడ! నవరత్నమయములైన ఆసౌధాంగణ సోపానములు, కనకమయకుడ్యములు, దీపాలంకృతమంటపములు, ముక్తాజాలవిలసిత కక్ష్యాంతరములు ఎక్కడ. ఆ కాంతిమయ ప్రదేశమున శ్రీకృష్ణునితో ప్రక్క ప్రక్కల నడచుచున్న తన జన్మము ధన్యమైనట్లు కుచేలుండు తలంచి ముగ్ధుండయ్యెను. పరమాత్మచింతనకగు ఫలసిద్ధి అది. భక్తి పారమ్యము బడయగలిగినవిరాగి కుచేలునకు భగవత్ సాన్నిధ్యభాగ్యము లభించినవి.

కుచేలుని తన శయ్యాతల్పమునందే ఉపవిష్టునిజేసి అర్ఘ్యపాద్యాది విధులు షోడశోపచారములతో శ్రీకృష్ణుండర్చించెను. నూతన వస్త్రములిచ్చెను. గోదానమొసగెను.

రుక్మిణీదేవి కుచేలునకు వింజామర వీచుచున్నది. శ్రీకృష్ణుడు తన మిత్రునిఁజూచి "కుచేలా, ఆనాడు గురుకులమునఁ నే నీయఁబోయిన దుస్తులను నీవు గైకొనలేదు. ఈనాడు తీసికొనకతప్ప"దని బలవంతపెట్టెను. కుచేలున కూపిరి తిరుగుటలేదు. శ్రీకృష్ణుని స్నేహాభావము, మర్యాదలు తల మున్కలై తోచినవి. చెమ్మగిలిన కన్నులతో అన్నిఁటిని స్వీకరించుచున్నాడు. శ్రీకృష్ణుడు కుచేలుని బుజముపై చేయివేసి కుశలప్రశ్న లడుగుచున్నాడు. సాందీపుని ఆశ్రమమున కుచేలునితో గడపిన దినములు, సాంద్రారణ్యమున వారిరువురు ఒక పెనుగాలి వానలో చిక్కుపడిన సంఘటన, అన్నియు ఒకటొకటే జ్ఞప్తికిఁ దెచ్చినాడు. వారిరువురకును మరల వారా గురుకులమున నున్నట్లు, సాందీపుడు వారి ముందుండి దీవించుచున్నట్లనిపించినది.

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్న వన్నియు కుచేలుడు కౌతుకముతో వినుచున్నాడు. ఏమనగలడు, అయినను "శ్రీకృష్ణా! నీవు జగద్గురుఁడవు, పరిపూర్ణుఁడవు, నీతో కలసి గురుకుల వాసముచేయు మహాభాగ్యము నాకు కలిగినది. నా జన్మ కదియే పదివేలు" అని ఊరకొనెను.

కుచేలుని రాకకు కారణము శ్రీకృష్ణుడు గ్రహించినాడు. ఇతడు పూర్వభవమున భక్తుఁడయ్యు భోగభాగ్యము లాశించినవాడుగాదు. నేడు దారాపుత్రులను పోషింపలేని

దరిద్ర బాధతో, భార్యావాంఛానుసారము ఇట్లరుదెంచి నాఁడు. ఈతని కోర్కె తీర్పవలయును అని తలఁచి—

"అయితే కుచేలా! ఇన్నాళ్ళకు వచ్చితివి, ఊరకనే వచ్చితివా నా కొఱకేదైన బహూకృతి తెచ్చితివా లేదా" అని శ్రీకృష్ణుఁ డడుగగనే కుచేలుని గుండెలు గతుకుమని ఈ మహాత్ముని యెదుట నా ఈ పేదవాని అటుకుల మూట విప్పుట అను సందియంతో తన బుజముమీఁదనున్న మూటను దాచ యత్నింపఁబోయెను. "ఆహా ఇదిగో ఏదో మధుర పదార్థము తెచ్చితివే నేను అనుకొనినట్లు, ఏదీ విప్పుము" అనుచునే శ్రీకృష్ణుఁ డా మూటనందుకొని తానే విడదీసి ఒక గుప్పెడు అటుకులు పరమానందముతో తీసికొని నమిలి తినుచు మఱియొక గుప్పెడు తీయబోవుసరికి రుక్మిణీదేవి అడ్డువచ్చి "దేవా అవి చాలును, నీ యనుగ్రహా భక్త శేఖరునకు సంపూర్ణంగ కలిగినది" అని చిఱునవ్వుచు కుచేలునిజూచి "అన్నగారూ ఇంటివద్ద సౌభాగ్యవతి మా వదినె గారు పిల్లలందరు క్షేమమేగదా! పరమభాగవతులు శ్రీకృష్ణభక్తులు అయిన మిమ్ము పతిగాబడసిన ఆయనకు కేమిలోటగును?" అని ప్రసన్నవదనయై పలికినది. శ్రీకృష్ణుఁ డామె వంకజూచి తానును చిఱునవ్వెను. ఈ సుందరదృశ్యమేదో ఆకర్షణీయముగ గన్పట్టెనే గాని అందలి యర్థము కుచేలున కాక్షణమున తోచనేలేదు.

కుచేలుని ఆనాటికి తన సౌధమునందే ఆపి శ్రీకృష్ణుడు సకల సౌకర్యములు కల్పించెను; రాత్రి చాల ప్రొద్దుపోవువఱకు ఆమాటలు ఈమాటలు చెప్పుచు కుచేలునిచే చెప్పించుచు ఆనందముగ గడపెను. మాటల నడుమ 'కుచేలా! నీ ప్రవర్తనము జూడ ప్రాపంచిక విషయములందు అచంచల విరాగివయినట్లు తోఁచుచున్నది. ఉత్తముల వర్తనము లట్లే యుండును, మఱియు బ్రహ్మభావుఁడు సత్కర్మనిరతుఁడైన గురువర్యుడు సాందీపునివద్ద జ్ఞానమార్గంబుల నేర్చితిమి. ఆ ప్రబోధములందలి సత్యమును నీవు చక్కఁగా గ్రహించితివి. నన్ను పరమాత్మ స్వరూపునిగ భావించుచున్నావు. అది సముచితమే. అంతమాత్రమున నేను నిన్ను మఱచువాడనుగాను. నాభక్తు లెప్పుడును నాకు ప్రియులే. వా రెన్నటికి చెడిపోరు. నేను జగద్గురుండను, సకల వంద్యుఁడ నయినప్పటికి లోకకళ్యాణార్థము కర్మ లొనరించుచు, పరమధర్మంబని లోకమున తెలుకపరచుటకే సామాన్యునివలె గురుసేవ నొనర్చితిని. సకల భూతాత్మకుఁడ నయిన నాకు శమ దమ దాన తపో వ్రత యజ్ఞాది కార్యముల కన్న నాయందు అచంచల భక్తి విశ్వాసములను చిత్తశుద్ధితో చూపఁగలిగిన వారియందే ఇష్ట మెక్కువ. మఱియు మత్పదాంబుజధ్యానపరులే భవజలధి సులభముగ తరింపగలరని కొంతవడి తత్త్వచర్చ జరిపి నిదుర కేగెను. కుచేలుడు

తనకై అమరింపఁబడిన మృదుతూలికా శయ్యను విడచి పుడమిపై ఒక ముతకవసనము పఱచి పరుండెను. పరుండెనేకాని నిదురయే రాలేదు. ఆరేయిరేయెల్ల కుచేలుని మనసులో శ్రీకృష్ణదేవుని విగ్రహమే శ్రీకృష్ణభావమే. ఆతాదాత్మ్యములో కుచేలుఁడు బ్రహ్మానందరసాస్వాదన సౌఖ్యమున నోలలాడుచుండెను.

ఎచ్చటనుండియో వచ్చిన ఒకపేద బాపనికి శ్రీకృష్ణుని మందిరమున ఇంత సత్కారమా! శ్రీకృష్ణుఁడే స్వయముగ అతిథిమర్యాద లొనర్చుటయా! ఆహా! ఈతఁ డెంతటి మహాత్ముడో!

"ఏమితపంబుసేసెనొకో ఈధరణీదివిజోత్తముండు తొల్
బాముల యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించియున్నవాఁ
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

తనమృదుతల్పమందు వనితామణియైన రమాలలామ పొం
దును నెఱఁగాదలంపక యదుప్రవరుండెదురేగి మోదముం
దనుకఁగఁ గౌగిలించి యుచితక్రియలన్ బరితుష్టిఁజేయుచున్
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటిభాగ్యవంతుడో

అని యెన్నియో విధముల ఆ సౌధమునన్న పరిచారకులు, శుద్ధాంతకాంతాజనము, తమలోతామే తర్కించుకొని యద్భుతం బందుచుండిరి.

భక్తశరణ్యుఁడు దీనజనావనుఁడైన శ్రీకృష్ణ భగవానుఁడు కుచేలుని కెఱుకలేకయే కుచేలుని పూరియిల్లొక సుందరసౌధముగ మార్చి అశేషధనధాన్యభోగభాగ్యములను తన తలంపుతోడనే సమకూర్చెను. మఱునాఁడు మరల దక్షిణతాంబూలాది సర్వసత్కారములతో కుచేలుని సమ్మానించి ప్రాకారద్వారమువఱకు వచ్చి శ్రీకృష్ణుఁడు సాగనంపెను.

శ్రీకృష్ణుని సన్నిధిని విడువలేక విడువలేక విడచి కుచేలు డింటిదారి పట్టెను. కనుపడినంతవఱకు శ్రీకృష్ణుని సౌధప్రాకారము మాటిమాటికి వెనుదిరిగి చూచుచు, అది కనుమఱుగైన పిదప ద్వారకానగరమును జూచుచు తిరుగు ప్రయాణము సాగించెను. కుచేలుని మనసున మెఱపువలె ఇంటివద్దనున్న భార్యాపుత్రుల విషయము జ్ఞప్తికి వచ్చినది. అయ్యో! వారెట్లున్నారో, నేను ద్వారకకేగిన దెందులకు? ఏదేని సాయముకొఱకు శ్రీకృష్ణు నర్థింపవలయునని కదా. అచట నున్నంతవఱకు నాకీవిషయము మనసునకే తట్టలేదు. ఎంతటి జడుఁడనైతిని అని తనలో తానే విమర్శించుకొని, పోనిమ్ము నా పేదతనము గమనించిన శ్రీకృష్ణుఁడైన తనకుతానయి ఏమయిన ఈయవచ్చునుగదా అని వితర్కించి— 'ఓహో! నాకు భోగభాగ్యము లలవడుచో శ్రీకృష్ణ చింతనము స్వాంతమున విస్మరింతునేమో'యని శ్రీకృష్ణపరమాత్మయే ఇట్లు చేసెను. ఇదియు మేలే.

శ్రీకృష్ణచింతనము నే నెన్నఁటికిని విడువఁజాలను. నాకు తినుట కున్నను లేకపోయినను సరియే. శ్రీకృష్ణభగవానుఁడే నాకు సర్వశరణ్యమని సంతృప్తిపడి కుచేలుఁడు తన గ్రామము చేరెను.

తనయింటి పరిసరములు చేరుసరికి కుచేలున కాన వాలు పట్టజాలని దృశ్యములు గోచరమయ్యెను. తనగృహ మొక మహాసౌధరాజముగ మారిపోయినది. ప్రాంగణము శశికాంతవేదికలతో, పుష్పవనములతో విరాజిల్లుచున్నది. ఇంతలో వివిధసుందరవర్ణముల నూతనవస్త్ర భూషణముల ధరించి ఉల్లాసముతో నున్న పుత్రులందఱు వెంట వచ్చు చుండగా భార్య బంగరు పళ్ళెమున నీరాజనముతో కుచే లున కెదురేగి అర్ఘ్యపాద్యాదులతో పూజించి భవనము లోనికి తీసికొనిపోయినది. కుచేలుని గృహము సమస్తభోగ భాగ్యములతో ప్రకాశించుచున్నది. ఏయెడ జూచినను మహేంద్రభాగ్యతుల్యములైన సంపదలే. ఇదియంతయు శ్రీకృష్ణుని అనుగ్రహఫలమని కుచేలుఁడు భార్యయు ఆనాఁ డంతయు శ్రీకృష్ణునే తలఁచుచు పూజ లొనర్చిరి.

నిజదారసుతాదుల కిక శ్రీకృష్ణుని యనుగ్రహమున ఏలోటు కలుగదను ధైర్యము కుచేలునకు కలిగినది. తన కుటుంబసభ్యుల కెల్లరకు వేదశాస్త్రములు బోధించి జ్ఞాన మార్గ ముపదేశించెను. జిజ్ఞాసువులై వచ్చిన శిష్యలోకము నకు సాందీపునివలెనే కుచేలుఁడు కూడ సకలవిద్యలు

బోధించు పండితులను జేయును. ఇంటనున్న భోగభాగ్యములతో కుచేలున కవసరములేదు, వానియం దిచ్ఛయును లేదు. యథాపూర్వము తన పెరటి చెట్టుక్రిందనున్న వేదికపై నిరంతరభగవద్ధ్యానమునందే తన కాలము నంతయు గడపును. దేహపోషణకు భగవత్ప్రసాదము రెండు మూఁడు కబళముల అన్నము చాలును.

కుచేలుఁడు నిర్మల సఖ్యభావమున శ్రీకృష్ణుని ప్రేమించిన సుహృద్వరుఁడు. శ్రీకృష్ణపరమాత్మను అకలంకభావమున స్మరించుచు శ్రీకృష్ణ చింతనమునందే తన జీవితకాలమంతమునంతయు గడపిన మహాభక్తుఁడు. అనన్యచింతనుఁడై పరమాత్మునియందు తాదాత్మ్యము నందగలిగిన బ్రహ్మభావుఁడు. భవముక్తిసంపదను చూఱగొని తుదకు శ్రీమన్నారాయణుని పాదారవిందముల చేరగలిగిన మహాభాగవతుఁడు. సకల భక్తలోకమునకు మేల్బంతి. ఆతని తపస్సు సఫలమై ఆత్మానందుఁడై యలరెను.

మానవజన్మ ధన్యమై సాఫల్యమంది గమ్యస్థానము చేరుటకు ధనధాన్యసంపదలతోగాని వైభవోపేతమగు యజ్ఞయాగాది కార్యములతోగాని పనిలేదు. కావలసినవి భగవానునియెడ చిత్తశుద్ధి గలిగిన అచంచల భక్తివిశ్వాసములు; నిష్కామసిద్ధిగల హృదయార్పణము. ఆలుబిడ్డలను పోషించుటకుగూడ లేని నిరుపేద కుచేలుఁడు. భగవదనుగ్రహమునకు పాత్రుఁడైన భక్తశిఖామణి యయ్యెను. నిరుపేదయని

గాని, ధనవంతుఁడనిగాని భగవానునకు విచక్షణ లేదు. భక్తుఁడు సమర్పించిన పత్రమైన, ఫలమైన, చివరకింత జలమైనను ప్రీతితో స్వీకరించును. తన భక్తుని భగవానుఁ డెన్నడును మఱవడు. భక్తుని యోగక్షేమములు తానే చూచుచు అవసరమైనప్పుడు తప్పక సాయపడును.

భక్తుఁడు భగవానుఁడు అనుమాట 'అటులుండ కృష్ణ కుచేలుల మధ్యఁగల సఖ్య మెట్టిది ? శ్రీకృష్ణుఁడు జగత్ప్రసిద్ధుఁడైన యదుప్రముఖుఁడు. తన బాల్యమిత్రుఁడే గదా యను తేలికభావము కుచేలు డెప్పుడును చూపక శ్రీకృష్ణునియెడ సముచితమగు గౌరవమర్యాదలతో ప్రవర్తించెను. కుచేలుఁ డేమియులేని నిరుపేద'యని శ్రీకృష్ణుఁ డెఱుఁగును; అయినను తాను ఐశ్వర్యవంతుఁడనను గర్వభావము లేశమైనను లేక తనతో సమానముగ కుచేలుని భావించి ఆదరించెను. చేయవలసిన సాహాయ్య మొనర్చెను. ఉత్తమోత్తముల సఖ్యము లిట్లే యలరారును. వీరిరువురి సఖ్యము మానవజాతికి మార్గదర్శకము.

కుచేలుని కథయందు ప్రస్ఫుటముగ ద్యోతకమగు పరమార్థము లివి.



## 2. శ్రవణము - పరీక్షిత్తు

కం॥ భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములు హృ
త్తోషణములు కల్యాణవి
శేషణములు హరిగుణోపచితభాషణముల్.

ఆం.భాగ. 1_46.

కం॥ విష్ణుకథారతుఁడగు నరు
విష్ణుకథల్ చెప్ప నరుని వినుచుండునరున్
విష్ణుకథాసంప్రశ్నము
విష్ణుపదీజలముభంగి విమలులఁ జేయున్.

ఆం.భాగ. 10_13.

అని శ్రీమదాంధ్ర భాగవతవచనము. లోకోత్తరము లగు ఈ పద్యములలో చెప్పినట్లు, ఇహపరసౌఖ్యప్రదములగు విష్ణుకథలందాసక్తి కలిగి విష్ణుకథాసర్వస్వమును భక్తి శ్రద్ధలతో విని భవముక్తిభాగ్యము నొందిన నరవరుఁడు పరీక్షిన్మహారాజు. ఈ మహనీయునకు భాగవతరూపమున విష్ణు గాథ లన్నియు బోధించిన దేశికుఁడు శుకయోగి. పరమ పావనమగు పాండవవంశ సంజాతుఁడై, మహావీరుఁడగు పార్థునికి మనుమఁడు, యోధాగ్రేసరుఁడగు అభిమన్యుని పుత్రుఁడై జనించిన మహాపురుషుఁడు పరీక్షిత్తు. ప్రజల

శ్రేయమెఱిఁగి పరిపాలించుటలో తాతయగు ధర్మరాజును మఱపించిన మహారాజు పరీక్షిత్తు. జననసమయమునందే పురుషోత్తముఁడగు శ్రీకృష్ణభగవానుని చక్రపరిరక్షితుఁడై జన్మించిన భాగ్యశాలి. ఈ రాజలలాముని చరిత మెంత శ్లాఘ్యమైనదో ఈతని జన్మకథయు అంత విశిష్టమైనది.

కౌరవపాండవ మహాసంగ్రామము సమాప్తమయి పాండురాజపుత్రులగు ధర్మజాదులకు విజయలక్ష్మి లభించు సమయము వచ్చినది. ఇరువాగులందును ఎందఱెందఱో మృతినందిరి. కౌరవనాయకుఁడైన దుర్యోధనుఁడు తానెవరిని నమ్మి పాండవులతో భండనమునకు దిగెనో ఆ మహాయోధులు భీష్మ ద్రోణ కర్ణ శల్యాదులాలమున గూలిరి. నిరాశాహతుఁడు, నిస్సహాయుఁడైన దుర్యోధనుఁ డొకకొలనులో డాగియున్న ఒక నిశీథసమయమున ద్రోణపుత్రుఁడగు అశ్వత్థామ దుర్యోధను నోదార్చి ఆతని యానతిఁగొని రణభారము తన భుజములపై వైచికొని, పాండవులేవ్వరును లేని సమయమున పాండవ శిబిరములందు నిద్రాసక్తులగు పిన్న పాపలను, ద్రౌపదేయులను దయాశూన్యుఁడై వధించెను. అంతతో విడువక పాండవవంశీయు లెచటనున్నను అపాండవ మగుగాక యని ఒక దివ్యాస్త్రమును మంత్రించి వదలెను. ఆ దివ్యాస్త్ర నిర్గతదుర్భరబాణాగ్ని అభిమన్యుని భార్యయగు ఉత్తరాగర్భాంతర్గత పిండమును ధ్వంసమొనర్ప నేతెంచుచున్నంత, వేఱొక దిక్కులేక ఉత్తర ఆక్రోశించుచు

శ్రీకృష్ణుని పాదములపైఁబడి ప్రార్థించినది. దేవా! నీవు జగద్రక్షకుఁడవు, నీ చెల్లెలి కోడలను. నీ మేనల్లుఁ డభిమన్యుఁడు శత్రువులచే హతుఁడయ్యెను. నా గర్భమున నున్న శిశువును దహింప ఈ మారణమార్గణాగ్ని వచ్చుచున్నది. ఈ శిశువునైన రక్షింపు రక్షింపుమని దీనాలాపయై వేడుచున్నంత ఆశ్రితవత్సలుఁడగు శ్రీకృష్ణుఁడు తన చక్రముచే అశ్వత్థామ అస్త్రమును నివారించి ఆ శిశువును రక్షించెను. పుట్టకమునుపే శ్రీకృష్ణభగవానుని కృపకు పాత్రుఁడైన మహాత్ముఁ డాశిశువు. ఆతఁడే పరీక్షిత్తు.

తన వంశమును నిలపఁగల మగబిడ్డ జన్మించినందులకు ధర్మరాజు చాల ఆనందమునంది, ధనధాన్యములు, గోవులు, భూములు, గజతురగములు, వాహనములు బ్రాహ్మణులకు విరివిగ దానము చేసెను. వారందఱు చాల సంతృప్తులైరి. దైవజ్ఞు లాశిశువు జాతకమును చూచి ఇతఁడు ధార్మికుఁడు ధాత క్రతుకర్త కీర్తిశాలి వీరుఁడు చక్రవర్తి కాఁగలఁడని పలికిరి. కాని విప్రశాపమున ఇతనికి మరణము సంభవించును. అయినను అంత్యకాలమున విరాగియు, జ్ఞానియునై హరిపాదపద్మముల జేసుకొను మహాభక్తుఁ డగునని కూడ వచించిరి. శ్రీవిష్ణువు అవతారమగు కృష్ణుని దయవలన రక్షింపఁబడుటచే ఆ శిశువునకు విష్ణురాతుఁడను నామమిడిరి.

ఉత్తరాగర్భస్థుఁడై యున్న విష్ణురాతుఁడు తనమీదకు అశ్వత్థామ ప్రయోగించిన నారాయణాస్త్రము అగ్నిజ్వాలలతో వచ్చుచుండగా, శ్యామలవర్ణుఁడు, కిరీటధారి, మహాతేజస్వి యయిన పురుషు డొకఁడు అంగుష్ఠమాత్రుడయ్యు గధను ధరించి ఆ యస్త్రమును తిరుగగొట్టి తనను రక్షించుట చూచెను. జన్మించిన తరువాత విష్ణురాతుఁడు తల్లిగర్భము నం దున్నపుడు తాను చూచిన తేజస్వికొరకు ప్రతిపురుషుని పరీక్షగ చూచుచుండుటవలన 'పరీక్షిత్తు' అను నామమును బడసెను.

భారతసంగ్రామమున విజయుఁడై ధర్మరాజు తన సోదరులు నలువురి సాయముతో హస్తినాపుర సామ్రాజ్యమేలుచుండెను. కొంతకాలము గడచినది. పెద్దలందఱు ఒకరొకర్రే గతించిరి. శ్రీకృష్ణుఁడు పరమపదమున కేగెను. తల్లి కుంతి మరణించినది. గాంధారీ ధృతరాష్ట్రులు తనువులు చాలించిరి. విదురుఁడును దివంగతుఁ డయ్యెను. తానిక చేయవలసినది లేదని ధర్మజునకు తోచినది. పరీక్షిత్తు పెరిగి పెద్దవాఁ డయ్యెను. తాతయగు అర్జునునివద్ద బాణవిద్యయు, పెదతాతయగు ధర్మజునికడ రాజనీతితోబాటు సకలశాస్త్రములను అభ్యసించెను. ధర్మజుఁడు పరీక్షిత్తునకు హస్తినాపుర సామ్రాజ్యము పట్టముకట్టి, భార్య సోదరసహితుఁడై మహాప్రస్థానమున కేగెను.

పరీక్షిత్తునకు యౌవన ప్రాప్తితో హస్తినాపుర సామ్రాజ్యప్రాప్తియు గలిగినది. మేనమామయగు ఉత్తరుని పుత్రికయగు ఇరావతిని పెండ్లాడి జనమేజయాది ప్రముఖుల నలువురిని పుత్రులుగాఁ బడసి పరమధార్మికుఁడై ధరాపాలనము సాగించుచు, కృపాచార్యుల గురుత్వమున మూడశ్వమేధముల నిర్విఘ్నముగ నెఱవేర్చి, దేవతలఁ దృప్తిగావించి గోభూధనధాన్యవస్త్ర దానముల విరివిగ నొనర్చి అర్థులై వచ్చినవారి కనంతప్రమోదము గూర్చెను.

అశ్వమేధయాగ సమయమ్మున దిగ్విజయార్థంబు సశరశరాసనుండయి చతురంగబలంబులు వెంట నడువ జంబూద్వీపమంతయు విజయశీలియై విహరించుచు కురుజాంగల దేశమున పాపాత్ముఁడగు కలి ప్రవేశించుట విని కలిని నిగ్రహించు కౌతూహలమున నరుగు పరీక్షితున కొక విషాద దృశ్యము గోచరించినది.

తపశ్శౌచదయాసత్యమ్ములను నాలుగు పాదముల నడచు ధర్మదేవుడు వృషభరూపమున ఏకపాదమున తిరుగుచు, ఆచెంత లేగలేని లేగఁటి ఆవురూపమున భూదేవి కన్నుల నశ్రులు కాల్వలుగట్ట దుఃఖించుచుండుట చూచి, దేవీ! నీకేల ఈ దుఃఖము? శ్రీకృష్ణుఁడులేని యీ క్షితితలమున నింక సకలధర్మములు సజ్జనత్వము లుడిగ పాపమే పాలించు ననియా నీ భయమని ప్రశ్నింపగా గోరూపయగు భూదేవి యిట్లు మొఱవెట్టినది. అయ్యా! ఆశ్రితవత్సలుఁ

డును, సాధుజన సంరక్షకుఁడును, సకల సద్గుణ శోభితుఁడు నగు శ్రీకృష్ణదేవుఁడు వైకుంఠమున కేగెను. భూఖండమున నేమి మిగిలినది? అశుభప్రతిపాదకమగు కలియుగమేతెంచినది. నాలుగు పాదములుగల ధర్మరూపుఁడవగు నీకు నేఁడొక పాదమేగద నిలిచినది. కలి ప్రభావమున వర్ణాశ్రమ ధర్మము లడుగంటును. సురలకు, మునులకు, పితృదేవతలకు, సజ్జనులకు, నాకు, నీకును, గోగణమ్మునకు నానాబాధ లుప్పతిల్లునని కుందుచుంటి. శ్రీకరుఁడగు శ్రీకృష్ణుఁడు నాపై నడుగిడిన చోటులెల్ల సకల సస్యసంపత్కరములై శోభిల్లుచుండినవిగదా! ఆ రమణీయ విగ్రహుని వర్ణింపఁదరమా!

ఉ. ఆమధురోక్తు లానయము లాదరహాసము లాదయారసం
 బామురిపంబు లాతగవు లాగమనక్రియ లామనోహర
 ప్రేమకరావలోకనము ప్రీతికనుంగొనలేమి మాధవుం
 గామినులేల నిర్దళితకర్ములు యోగులు బాయనేర్తురే.

అని కీర్తించుచున్న సమయమ్మున ధనుర్బాణతూణీరసంయుతుఁడగు పరీక్షిన్నరపాలుఁ డచ్చటి కేతెంచి యా గోమిధునమ్మును జూచి యబ్బురపడుచుండ, సర్వాలోన్నతుఁడు, మహాదండధరుఁడు, చండాలాకృతినున్న నృపాలాకారుఁ డొకడు నిర్దాక్షిణ్యమున నా ధేనువృషభంబుల రెంటిని కఠినముగ కాలఁదన్ని నేలఁబడగొట్టెను. ఆ మహాఘోరదృశ్యమును చూచినంతనె పరీక్షిత్తునకు మోమునగల

ఆనందమంతయు అదృశ్యమై ఆగ్రహావేశములు తాండవించి నవి. ప్రసన్నవచనములతో ఆధేనువృషభంబుల నోదార్చి కన్నుల నిప్పులురాలు మహోగ్రరూపుఁడై యాభీకరా కారుని జూచి ఓరీ! పాపాత్మా! నీ వెవ్వఁడవు? ఈ సాధు జీవుల నకారణముగ హింసించు పాపకార్యంబున కొడగట్టి తివి? ధర్మజార్జునుల మనుమఁడు పరిక్షిత్తు పాలించు కాల మున నీ కంటకములు సాగవని, ధగధగాయిత ప్రభామండి తమ్మగు ఖడ్గంబెత్తి-

నిన్నుం గొమ్మలఁ జిమ్మెనో కదిసెనో నిర్భీతివై గోవులం
దన్నం గారణమేమి మద్భుజసనాథక్షోణి నే వేళలం
దు న్నేరంబులు సేయరాదెఱుఁగవా ధూర్తత్వమున్ భూమిభృ
త్సన్నాహంబు నొనర్చి తెవ్వఁడవు నిన్ శాసించెదన్ దుర్మతీ!

I-415.

అని మృగముపై లంఘించు మృగరాజుపగిది తనపైకి దుర్వారుఁడై వచ్చు పరీక్షితుం గని, కలి భయభ్రాంతుం డయి ఆకంపితాంగుడయి రాజరూపమును విడనాడి రక్షింపు మని పరీక్షిన్నరపాలుని పాదంబులపైఁబడి ప్రార్థింపసాగెను. మహాపాపముల కన్నిఁటికి కలి ఆశ్రయమని యెఱిఁగియు, భయాకులితులను ఆశ్రితులను చంపనొల్లని సాధుమూర్తి యగు పరీక్షిత్తు ఓయీ, నీవు పాపరూపుఁడవు. నిన్ను అసత్య లోభ చౌర్య దౌర్జన్య దురాచార మాయా కలహ కలు

షమ్మూ లాశ్రయించు గావున సత్యధర్మములకు నివాసమగు ఈ బ్రహ్మావర్తదేశమ్మున నుండఁదగవు. అసత్య మద కామ హింసా వైరంబులు గల ప్రదేశంబులే నీ నివాసంబులగుం గావున కదలి పొమ్మని శాసించెను. పరీక్షిన్నరువరుచే నట్లు నిగ్రహింపఁబడి నిర్జితుఁడైన కలి దూరుఁడై యేగినంత పరీక్షిత్తు ఆ ధేనువృషభంబుల జూచి, దుష్టనిగ్రహమ్మునకు శిష్ట జనానుగ్రహమ్మునకు సాధువులగు జంతువులకు బాధలు లేకుండ జేయుటకుగవా రాజన్యుల నా రాజీవభవుడు సృష్టించినది. నా శక్తి కొలఁది నేనా ధర్మమును నిర్వహింతును. ధర్మదేవ భూదేవ్యాకారులైన మీరిక నిర్భయముగ నుండుడని సమ్మోదితులఁజేసి బంపెను.

పరీక్షిన్మహారాజు ధర్మపరిపాలనము సర్వజనసమ్మోదకరముగ సాగుచున్నది. ఏకడఁజూచినను ఆ రాజవర్యుని పేరు చెప్పుకొనువారే. వర్ణాశ్రమధర్మము లకుంఠితమ్ముగ నెఱవేరుచున్నవి. ఋషుల తపోవ్రతవిధులన్నియు నిరాటంకముగ సాగుచున్నవి. ఎవరికే బాధ కలిగినను చారుల వలన తెలిసికొని తన్నివారణ కార్యమును వెనువెంటనే ఆ రాజు నిర్వర్తించును. తండ్రి తాతల పరాక్రమ సాహసములును, పెదతాతయగు ధర్మజుని రాజనీతియు ధర్మబుద్ధియు రూపుదాల్చిన మూర్తి యతఁడు. కాలమిట్లు నడచుచున్నది.

పరీక్షిన్నరపాలుని కొలువుకూటమున కొకనాఁ డరణ్యప్రాంతముల వసించు జనులు పెక్కుమం దేతెంచి "మహారాజా! అరణ్యములందు వరాహ వ్యాఘ్ర భల్లూక వేదండాది వన్యమృగము లసంఖ్యముగ పెచ్చు పెరిగిపోయి నవి. ఆ జంతుసమూహములు పంటభూములు ఫలవృక్షము లపై బడి పాడుచేయుటయేగాక ప్రాణిహింసనుగూడ పాల్పడు చున్నవి. కరుణించి తమరీబాధను నిరోధింపవలయు"నని ప్రార్థించి చనిరి. మఱునాఁడే పరీక్షిత్తు బాణాయుధపాణియై పరివారపరివృతుండయి అరణ్యములకు వేటకేగి క్రూర మృగముల నెన్నిఁటినో కూల్చి కూల్చి తృప్తిపడక దుర్గ మంబులగు నడవులకు దానొక్కఁ డరిగి క్రూరజంతువుల వేటాడి వేటాడి ప్రొద్దు వాటారుసరికి దప్పిగొని యాపరి సరమ్ముల జలము లభించునేమోనని తిరిగితిరిగి నిష్ఫలుఁడై ఒకింత దూరముననున్న మున్యాశ్రమమ్మున కేగుదెంచి యచ్చట ధ్యానముద్రలోనున్న శమీకుఁడను మునిని దప్పి తీర్చుకొనుటకు జలమిమ్మని వినయముగ నడిగెను. మరల మరల ఆమునిని మేల్కొల్పఁ జూచెను. సమాధిస్థితుఁడైన యా శమీకమునీంద్రుఁ డీప్రపంచమునందే లేడు. పిలచిన పలుకడు, కనులువిప్పి కదలడు. పిపాసాతురుఁడైన పృథ్వీశు నకు విసువెత్తినది. దాపుననున్న ఒక మృతసర్పమును వింటి కొప్పున నెత్తి ఆముని గళమున వ్రేలవైచి వెనుదిరిగెను.

హస్తినాపుర మహాసామ్రాజ్యాధిపుఁడైన పరీక్షిత్తున కాసమయమున త్రాగుటకు గ్రుక్కెడు నీరము నిచ్చువారు లేరు.

ఆ తరుణమున నచ్చటనున్న బాలకులు కొందఱు పరువెత్తి యీ వార్తను శమీకుని పుత్త్రుఁడగు శృంగితో నుడివిరి. ఆతఁడు తండ్రిని జూచి భీతిల్లి యీ నీచపుకార్య మొనరించిన నృపునిపై మహోగ్రహుఁడై -

ఓడక వింటికోపున మృతోరగముంగొనివచ్చి మాఱుమా
టాడక యున్న మజ్జనకు నంసతలమ్మున బెట్టి దుర్మద
క్రీడ చరించు రాజు నార కేశవులోడ్డినఁ గావఁ జచ్చుబో
నేడవనాఁడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహతిన్.

అని దారుణ మారణ వాక్యమ్ముల శపించి, రాజులైనవారు భోగభాగ్యముల కుడుతురు గట్టుదురు గాని సాధువులైన మునుల నిట్లు సేయుదురే యని పల్కుచున్నంతలో శమీకమహాముని యు మేల్కాంచి కంఠసీమనున్న సర్పమును దీసి పాఱవైచి, పరీక్షిన్నరపతికి తన తనయుఁ డిచ్చిన శాపమును విని కుమారుని కార్యమున కేమాత్ర మును సంతసింపక విచారమగ్నుఁడై "అయ్యో! ధార్మికుడు. ప్రజలను మునులను కన్నబిడ్డలవలె గాపాడు పుణ్యకాంతుడు పరీక్షిన్మహారాజునకా యీ శాపము" అని దుఃఖించెను. శృంగి శాపమునకు తిరుగులేదు. క్షితిపాలునకు మృతితప్పదు. అనాలోచితమునఁ జేసిన యిట్టి యకార్యమునకు శమీకు

డాత్మజుఁజూచి. "పుత్రా! పుణ్యచారిత్రుఁడగు భూపుని మరణమునకు కారకుఁడ వైతివిగదా. బలవంతుడు ధర్మ పరిపాలకుఁడైన పరీక్షిన్నరవరునివంటి ధరణీశుఁడు లేని పుడ మిని పుణ్యము లడుగంటి పాప కార్యము్మలె ప్రబలునని యెఱుగవా-

ఉ॥ భారతవంశజుం పరమభాగవతున్ హయమేధయాజి నా
చారవరున్ మహానయవిశారదు రాజకులైకభూషణున్
నీరముగోరి నేఁడు మననేలకువచ్చినయర్థి భక్తి స
త్కారముజేసి పంపఁజనుగాక శపింపగ నీకు ధర్మమే.

యని నిందించి. శాపము గ్రహింపలేని నిస్సహాయుండై, కొడుకు చేసిన పాపంబునకు సంతాపంబు నొంది, యేత ద్వార్తను మఱునాడే తన శిష్యులనంపి రాజున కెఱిం గించెను.

తనకుఁ గలిగిన శాపవార్తను నిశ్చలచిత్తుఁడై పరీ క్షిత్తు వినినాడు. ఆహా, యెంతలో యెంత వాటిల్లినది. వేట కేల పగితిని. పగినవాడను వేగముగ వెనుదిరిగి రాక ఆ ముని యాశ్రమమున కేగి ధ్యాన సమాధియం దా తాపసవరుఁ డుండుట చూచియు చచ్చిన పామును దెచ్చి సంయమీం ద్రుని మెడకేల చుట్టితిని. ఈ వైపరీత్యమున కిది ఫలముకదా.

కం. గోవులకును బ్రాహ్మణులకు
దేవతలకు నెల్లప్రొద్దుఁ దెంపునఁ బీడల్

కావించు పాపమానస
మేవిధమున బుట్టకుండ నే వారింతున్.

అని పశ్చాత్తప్తుండై పరీక్షిత్తు మునికుమారునకు ప్రతిశాప మిన్నయ సర్వసమర్థుం డయ్యును, వాక్సిద్ధి భాజనుడయ్యు కించిత్తైనను కినుక వహింపక తన కరణీయము నాలోచింపం దొడగెను. పరమ భాగవతు లెపుడును యెట్టి యప్రియము లైనను అపచారములైనను సహింతురే గాని మాఱుసేయ నేరరు. అందునను పరీక్షిత్తు ప్రజలకు మేలొనరించు మేది నీశుండే గాని యెగ్గుందలపోసి యెఱుంగని యేలిక -

నేనొక రాజననుచు రాజగర్వమున ముని రాడ్వాటిక కేగి, మునివరునకు అపచార మొనరింప, మునిసుతుండు నన్నేల దిట్టకయుండునని యా శాపశిక్ష కర్హుండై, హరి చరణ భక్తి పరత్వమున నరిషడ్వర్గంబుల గెలిచినవాడుగా వున, తనకీ శాపఫలము విరక్తి బీజము గావలెననుచు పరీ క్షిన్మహామనస్వి ఒక్క త్రుటికాల మాత్రమున సర్వ సంగ పరిత్యాగియయ్యె. రాజ్యభోగములు, భూలోక స్వర్గలోక సౌఖ్యములు తన ప్రాణములు యా మహానీయుని తలపున తృణమాత్రముగూడ విలువలేనివయ్యెను. హరికథా శ్రవణ హరిరూపచింతనా చరణములకంటె వేఱొక కరణీయము శరణమ్మునాదని, నిరశన దీక్షా నియతుండై, కలి దోషం బులంబాపగల్గిన గంగాప్రవాహము లోపలికింజని చిత్తము గోవింద పదాయత్త మొనర్చి ప్రాయోపవేశముం బూనెను.

ఆ మహనీయుని మనోవాక్కాయ కర్మములు శ్రీహరి భావ భావితములై, సర్వము శ్రీహరి మయమై భాసించెను. ఆ క్షణమున తనయందు అఖిల భూతములందు అఖిల భూతాత్మకుఁడైన హరినిగాంచిన పరమానందమయుండు పరీక్షిత్తు పరమఋషులకుగూడఁ బడయరాని బ్రహ్మభావమది-

పరీక్షిత్తుని ప్రాయోపవేశవార్త నలుదిశలకు ప్రాకినది. కలనైనను తలఁపరాని యీ సంఘటనము ప్రజలను దిగ్భ్రమయందు ముంచివైచినది. శిరమున పిడుగులే పడినట్లు యెచ్చటివారచ్చట నిశ్చేష్టులైరి. ఈ వార్త చెవులబడినంత నారద అత్రి వసిష్ట విశ్వామిత్ర మైత్రేయ భృగు పరాశర వ్యాసాది దేవర్షి బ్రహ్మర్షి రాజర్షి వర్యులు శిష్య ప్రశిష్య గణములతో ప్రాయోపవిష్టుఁడైన యీ మహారాజును జూడవచ్చిరి. పవిత్ర తీర్థ ప్రదేశంబులకైనను పావిత్ర్య మాపాదింపగల మహత్వముగల వారా మహర్షులందఱును- వారిని చూడఁగనే ప్రఫుల్లవదనుఁడై ప్రణామ సత్కారము లాచరించి పరీక్షిత్తు నిర్మల హృదయుఁడై ఇట్లు ముక్తకంఠమున ప్రార్థించినాఁడు.

ఉ॥ ఓపిక లేక చచ్చిన మహోరగముంగొనివచ్చి కోపినై
తాపసుమూపుపై నిడిన దారుణచిత్తుఁడమత్తుఁడన్ మహా
పాపుఁడ మీరుపాపత్రణపావను లుత్తము లయ్యలార నా
పాపము వాయుమార్గము కృపాపరులార విధించిచెప్పరే.

అయ్యా! సంసార వ్యాకులతతో చీకాకుపడుచున్న నా చిత్తమున కేడు దినములలో ననుదాకి మృతినొందింపనున్న తక్షక కాకోదరవిషము ముక్తి కారణమైనది. ఈ యేడు దినములలోన నను ముక్తిపదమునఁ జేర్చగల ముకుందు పుణ్యగాధలను చదువుడు వినిపింపుఁడని వినయుఁడై వేడు పుడమిరేని నా మునిరాజులు ప్రసన్న ముఖారవిందులై వీక్షించి రాజా ! నీవు ఉత్తములలో ఉత్తముడవు, పావన వంశీయుడవు. మీ తాతలందరు పరమపదమును వాంఛించి సామ్రాజ్య భోగములను వర్జింపగలిగిన వరిష్ఠులు. నిరంతర నారాయణ ధ్యానపారీణుఁడవైన నీవు బ్రహ్మపదమును జేరునంతదనుక మేమిందేయుండి దివ్యతేజః ప్రభావుఁడ వైన నిన్ను వీక్షించుచుండెదమని మాధుర్య ధుర్యంబులైన గంభీర భాషణంబుల నుడివి ఆ రాజముఖ్యునికి ముదమొద వించిరి.

అంతలో నచటికి బ్రహ్మతేజస్వియగు బాల సన్యాసి శ్రీశుకయోగి అరుదెంచెను. ఆ మహానీయుని ప్రభావము నెఱుగుదురు. గాన అచ్చటనున్న యతివరులంద రేగిఎదు రకుని తీసికొని వచ్చిరి. అవధూతాకారుఁడు, నిరంతరా ధ్యాత్మ చింతనుఁడు నయిన శుకయోగికూడ ఆసమయమున నచటి కేతెంచుట తన భాగ్యముగ పరీక్షిత్తు భావించి దండ ప్రణామమ్ము లాచరించి అతిథి సత్కారమ్ము లొసఁగి, శ్రీశుకయోగీంద్రా! నీరాక చే నేను ధన్యుఁడనైతి, ముని

కుమారుని శాపమున నాకేడు దినములలో మృతి సంభవిం
చుట తప్పదు. నా మనస్సు సర్వ రక్షకుండైన శ్రీహరి
చరణారవిందములయందే లగ్నమై యున్నది. దేహధారి
యేమి చింతించిన, యేమి సేవించిన, యేమి వినిన భవమో
క్షము బడయఁగల్గునో, గురుదేవా! ఆ పవిత్ర వాక్యములు
నాకు వినిపించి నన్ను చరితార్థుని జేయగదే, అని వేడెను. ఆ
మహారాజుకోరిక వినగనే శుకయోగి కమితానందము గలిగి
నది. అంత్య దశలో మానవుని కెట్టి దైవచింతనాభిలాష
కలుగవలెనో అది పరీక్షిత్తునకు గలిగినది. అమలము అచం
చలము అపవర్గ సాధనము అయిన హరిభక్తిభావము నాటు
కొనుటకు ఆరాజు మనస్సు సిద్ధముగా నున్నది. వినయుఁడై
శ్రద్ధాళువై వినుచున్నాడు.

ప్రాయోపవిష్టుడై భగవచ్చింతనుడైన పరిక్షిన్నరేం
ద్రునికి శుకయోగి తన ప్రబోధ మారంభించినాఁడు.

రాజేంద్రా! నీకతిశ్రేష్టమగు మనోవాంఛ కలిగి
నది. వినుము, సంసారమగ్నమానసులు ధనధాన్య సతీ
సుతాదులు శాశ్వతమని మోసపోదురు. చివరి దినములం
దైనను నిజమును గానరు.

కం. కావున సర్వాత్ముండును మ
హావిభవుఁడు విష్ణుఁడీశుఁ డాకర్ణింపన్
సేవింపను వర్ణింపను
భావింపను భావ్యుడభవభాజికి నదిపా ॥

నిర్గుణ బ్రహ్మశ్రేయమునందిన మానసము సాంఖ్య యోగమున అంత్యకాలమందు హరిచింతన మొనర్చుట జన్మ సాఫల్యసిద్ధికి మార్గము - నా తండ్రి వ్యాసమహర్షి వ్రాసిన మహాకావ్యము బ్రహ్మ సమ్మితమగు భాగవతము దానిని నేను పఠించితిని. వాసుదేవనామ వర్ణములు, మోక్ష ప్రాప్తి సాధనములు అయిన ప్రబోధము లాగ్రంథమం దున్నవి. నీ వద్దానిని వినుము. తొల్లి రెండుగడియల కాల ములో, తన రాజ్య వైభవమును త్యజించి సురవరులీయం బోయిన వరముల గూడ నొల్లక ఖట్వాంగుడను రాజు గోవిందనామ కీర్తన గావించి గాఢవైరాగ్యమును ముక్తిని చూఱగొనెను. నీకేడు దినములకుగాని మరణము లేదు. నీవు నన్నడిగిన విశేషము పూర్వము బ్రహ్మ మాధవుని వలన విని నారదునకుఁ జెప్పెను. నారదుడు నాకది ప్రసా దించెను. దానిని నీకు బోధించెదను, వినుమని శుకయోగీం ద్రుఁడు శ్రీహరిని తన చిత్తమునఁ దలఁచి ఆత్మతత్త్వమును గూర్చియు మోక్షసాధనను గూర్చియు పరీక్షిత్తున కిట్లు నుడివెను.

మోక్షకామియగు వాడు సంసార మోహమును దృజించి శుచి ప్రదేశమున, కుశాజిన చేలముల పఱచిన ఏకాంత స్థలమున ఆసీనుడై, నిర్మలము దృఢమునగు చిత్త మున, ఇంద్రియముల నాయా విషయసుఖములను పరువిడ నీయక బంధించి హరిచింతనుఁడు కావలెను. సకల విశ్వము

హరిమయమే, హరిమయముగాని పరమాణువైనను లేదు. ఆ పరమేశ్వరుఁ డఖిల జీవుల హృదయములందుండి వారి బుద్ధి వృత్తుల వీక్షించుచుండును. ఆ పరమేశ్వరు నెఱుఁగని ప్రాణి మూఢత్వమున దుష్కర్మ లాచరించుచు తత్కర్మ ఫలమున మరల మరల పుట్టుచు చచ్చుచు సంసార పాశము లందు జిక్కుకొని నరకబాధల ననుభవించుచుండును. సౌధ ప్రాసాద సుఖ శయ్యా భోజనాదు లెందులకు? ప్రకృతి సిద్ధములైన సౌఖ్యము లనేకము లున్నవి. పర్వత గుహాలు శాద్వల స్థలులు నదీజలములు తరుఫలములు మున్నగునవి, భగవచ్చింతనున కివిచాలును. మహాసుందరాకారుఁడు బహు విధ భూషణాలంకృతుఁడు, బహువిధాకారుఁడు, సంతతా నందమయుఁడు, సంతతానుగ్రహశీలావదనుఁడు, ప్రాణుల హృదయకమలకర్ణికాస్థితుడైన పరమేశ్వరుని ధ్యానించుచు నరుడు తద్రూపములను పరిపూర్ణ నిశ్చల భక్తియోగంబు సిద్ధించువరకు చింతనమందు నిలుపవలయును.

తనువును త్యజించి బ్రహ్మ సాయుజ్యమందఁగోరు యతికి కాలదేశములతో పనిలేదు. బుద్ధిచే ప్రాణ వాయువును బంధించి జీవాత్మను బ్రహ్మమునందు గలుపును. ప్రాణము బిగియఁబట్టి దిగువనున్న మూలాధార చక్రమును నాభితలమున జేర్చి వక్షమున కెగయబట్టి హృదయ పద్మమున ప్రాణవాయువును నిలిపి, ప్రణవరూపమున పరమాత్మ నెంచుచు, కనుబొమల మధ్యకు ప్రాణవాయువును దెమల్చి

నేత్రములు, చెవులు, ముక్కు, నోరు మూసి, ఇంద్రియ వ్యాపారము లరికట్టి ప్రాణములను వంచి శిరోవీథినున్న బ్రహ్మరంధ్రమును చించి పరబ్రహ్మమున గలియును- అట్టి యోగి, పరమాణుభూతమైన సుషుమ్నా నాడివెంట నగ్నిని అధిదేవతంజేసి జ్యోతిర్మయంబైన లింగ శరీరమున, తారా మండలము, సూర్యాది ధ్రువాంత పదములు, మహర్లోకము దాటి హరిసంబంధమగు శింశుమార చక్రముజేరి బ్రహ్మలోకమునందు వసించుచు మరల తిరిగిరాడు. ఆత్మానందమయమైన బ్రహ్మస్థితి యది. పరమసిద్ధ యోగులు విష్ణుపద ధ్యానులు వెడలు ప్రదేశమది.

పరమ భాగవతులు పాటించు నీ పథముననేగిన యోగికి పునర్జన్మ లేదు. వేదగీతలందు సద్యోముక్తియు క్రమముక్తియని రెండు తెఱగులున్నవి. తపోయోగాదులైన పెక్కు మోక్ష మార్గములందు భక్తిమార్గము సంసారగతులైన వారికి సులభ సాధ్యమైనదియు, ముఖ్యమైనదియును దానిని వినుము.

వేదము నంతయు మున్ను బ్రహ్మ ముమ్మాఱు పరామర్శించి జనార్దనుని భక్తిభావమున సేవించుటయె సులభమార్గమను నిర్ణయమునకువచ్చెను. అఖిల భూతములందును ఆత్మరూపకుఁడగు హరికథామృతమును వీనులవిందుగ వినువారు ధన్యులు. అహరహము శ్నములు సేవనీయుడు వందనీయుడు భక్తవత్సలుఁడు ఆ హరియె. ఆ పరమాత్ముని దివ్య

గాథలు యెట్టివారికైనను శ్రవణానందదాయకములే. వ్యర్థములైన పశువులు, శునకాదులు తిరుగునట్లే ధర్మార్థచింతయు ముక్తికాంక్షయు లేని మనుష్యపశువు సంసార బంధమునఁబడి బాధల నొందుచుండును. వేయేల రాజేంద్రా! ఒక్క పలుకాలకింపుము—

సీ॥ విష్ణుకీర్తనముల విననికర్ణంబులు
కొండబిలంబులు కువలయేశ
చక్రిపద్యంబులఁ జదువనిజిహ్వలు
కప్పలజిహ్వలు కౌరవేంద్ర
శ్రీమనోనాథు నీక్షింపనికన్నులు
కేకిపింఛాక్షులు కీర్తిదయిత.
కమలాక్షుపూజకుఁ గాని హస్తంబులు
శవముహస్తంబులు సత్యవచన
హరిపద తులసీదళామోదరతి లేని
ముక్కు పందిముక్కు మునిచరిత్ర
గరుడగమను భజనగతిలేని పదములు
పాదపముల పాదపటల మనఘ.

సీ॥ నారాయణుని దివ్యనామాక్షరములపై
గరగనిమనములు కఠినశిలలు,
మురవైరికథలకు ముదితాశ్రురోమాంచ
మిళితమైయుండని మేను మొద్దు,

చక్రికి మ్రొక్కని జడుని యౌదలనున్న
కనకకిరీటంబు కట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవుసిరి
వనదుర్గ చంద్రికావైభవంబు

కైటభారిభజన కలిగియుండనివాడు
గాలిలోననుండి కదలుశవము
కమలనాభుపదము గననివాని బ్రదుకు
పసిడికాయలోని ప్రాణి బ్రదుకు-

ఇట్లుపన్యసించుచున్న శ్రీశుకుని ప్రబోధామృత వృష్టియందు పరీక్షిత్తు హృదయము కరగిపోయినది. మేను పులకించినది. తన సర్వస్వము శ్రీహరి మయమైనట్లు తోచినది. ఆహా! పరమాత్ముఁడగు హరి చింతనములేని బ్రతుకు నిరర్థకము వ్యర్థము కదాయనుకొని శ్రీశుకయోగీంద్రుఁడింతవఱకు నుడివిన ఆత్మతత్త్వము యోగమార్గము భక్తిభావము పునర్విమర్శించుకొని ఒకనిమేషమాత్రము సమాధిగతుఁడైనట్లు నిస్పృహుఁడై యుండిపోయెను. శ్రీశుకుని ప్రవచనములు మధుర మధుర నినాదములై చెవులలో మ్రోగుచున్నవి. తనలోనున్న పరమాత్మ ఒకపరంజ్యోతీ రూపముగా భాసించుచు తన సర్వస్వము ప్రకాశమానము చేయుచుండెను. చుట్టునున్నవారందఱు పరమాత్మ స్వరూపులే. ప్రత్యణువు పరమాత్మమయమే. తాను మరణించి

నను జీవించినను తన మనోనేత్రమున కొకటే మార్గము గోచరించుచున్నది. వినవలెను, విష్ణుదేవుని గాథలన్నియు వినవలెను, మనసార వినవలెను - కనులార ఆ జగన్నాథుని కనవలెను. తత్పదసన్నిధికి జనవలెను, మోక్షసామ్రాజ్యమును చూఱగొనవలెను. ఇదియే తపన. తక్కిన లోకముతో తనకొక నిమేషమాత్రమైన సంబంధములేదు. ఆ హరికథా శ్రవణ భక్త్యావేశములో కనులు తెఱచి శుకయోగీంద్రుని చరణములవ్రాలి పరీక్షిత్తు-

" గురుదేవా, శుకయోగీంద్ర ! నీ పలుకులలోని మహత్తరశక్తి యేదియో నన్నాకర్షించి లాగివేయుచున్నది. ఆ పలుకులయందలి పరమార్థతేజమేదియో నన్నుగ్రమ్మచు నా చుట్టునున్న సర్వమును పరమాత్మమయముగా చేయుచున్నది. నీవు సర్వజ్ఞుడవు. నీ వొనరించిన సర్వాత్ముని సంస్తుతితో నా మనస్సున సర్వభ్రాంతులు వదలిపోయినవి. జగదాశ్రయమైన సర్వేశ్వరునిఁజేరుటయొక్కటే నా యాశయము. మిగిలియున్న ఈ కొలఁది దినముల జీవితకాలములో కరుణించి నీవు నాకు చెప్పగలిగినదంతయు చెప్పుము. ఆపరమాత్ముని గాథలు వేయివీనులతో విందును. ఆ పరమాత్ముని కథామృతము మనసార ఆస్వాదింతును. ఆ పరమాత్ముని రూపమును నా హృదంతరమున స్థాపించి సమాధానింతును - సర్వేశ్వరుఁడు విష్ణుఁడైన హరి సృష్టి

స్థితిలయముల నెట్లొనర్చెను. సర్వసమర్థుడైన యాతడు ఏ శక్తుల నాశ్రయించి బ్రహ్మాది దేవతా రూపము లందెను. ఏకరూపుఁడై యుండు హరి భిన్న రూపముల నేలఁదాల్చెను. ఏమేమి చేసెను. ఆ జగన్నాథుని లీలలు సర్వమెట్టివి. దుష్టుల శిక్షించి సాధుల నెట్లు సంరక్షించెను. ఆచార్యా! ఈ హరికథా సర్వస్వమువిన కుతూహలుఁడనైతినని, పులకితదేహుఁడు, అశ్రుసిక్తనయనుఁడై పరీక్షిత్తు శుకయోగీంద్రుని ముందు భక్తి శ్రద్ధలు రూపుదాల్చిన మూర్తియో యన, బద్ధాంజలియై కూర్చుండెను –

పరీక్షిత్తు మనః స్థితిఁ జూచి శుకముని పరమాశ్చర్యభరితుఁడయ్యెను. ఆహా ! యీ క్షణమువఱకు సకలసామ్రాజ్య వైభములఁ దులతూగుచున్న ఈ రాజేంద్రునికి శ్రీహరియందు యెంత భక్తిభావ ముదయించినది! యెంత తాదాత్మ్యము సిద్ధించినది! యెంతగాఢమైన మోక్షకాంక్ష జనించినది– వైరాగ్యమనిన ఇట్టులుండవలెను. ఇట్టి జనుఁడే కద జీవన్ముక్తుడు– ఇంక ఎక్కువ సమయములేదు. కాలము మహావేగమున గతించుచున్నది– మరణోన్ముఖుఁడు మాధవ చింతనుఁడు, జన్మించినదాది సచ్చరిత్రుఁడు ధర్మపరిపాలకుఁడైన మహాభక్తునకు ఈశ్వరునిగూర్చి బోధించు సదవకాశము తనకు కలిగినది –

శ్రీమహావిష్ణు వనాది పురుషుడు, అనంతుడు, విశ్వకారణుడు విశ్వాత్మకుఁడయిన ఆ జగన్నాథుని పుణ్యగాథ

లకేయది మొదలు ఏయది తుది? అంతయునొకటే. ఏ విభు నామ సంకీర్తనము, ఏ విభుని కథా శ్రవణము, సర్వపాప నివారకము. మోక్షదాయకమో, విబుధులెల్లరే విభుని పాద పద్మములు పూజింపనెంతురో, ఏ విభుఁడు ముని మనోగో చరుఁడో, జప తపోదానములకన్న ఏ విభుని చింతన మత్యు త్తమమో, బ్రహ్మ రుద్రాదులుకూడ ఏ విభుని భావించు చుందురో జగదుత్పాదన రక్షణ లయక్రియలెవ్వని మహిమ ములో అట్టి సర్వాత్ముఁడు పరముఁడు అయిన శ్రీవిష్ణుని ధ్యానపదమున నిల్పి శ్రీశుకుఁడు పరీక్షిన్నరేంద్రునికి బోధించుట కారంభించెను-

తాను తండ్రియగు వ్యాసభగవానునివలన వినినది కనినది పఠించినది అగు శ్రీమన్నారాయణుని పవిత్రగాథా మృతము, శ్రీమహాభాగవత ప్రవచనము శ్రీశుకయోగీం ద్రు డారంభించినాడు. పరీక్షిత్తు భక్తి శ్రద్ధలతో ఆకర్ణించు చున్నాడు. నిరశనుఁడు నిర్మోహుఁడు నిశ్చలధ్యానమ గ్నుఁడు కేవలము వాయుభక్షకుఁడు ప్రాయోపవేశ భద్రా సనుఁడైన పరీక్షితుని కాత్మలో శ్రీవిష్ణుచింతనము తప్ప అన్యము లేదు-

శ్రీమహావిష్ణుని లీలావతార గాధలు ఒకదాని తరు వాత నొకటి శ్రీశుకుని నోట వెలువడినవి - శ్రీహరియొ నర్చినది సర్వము లోకకళ్యాణార్థము ధర్మసంస్థాపనార్థము ఇందుల కవసరమైన దుష్టుల వధలు నిశ్శంకగ నెఱవేర్చి

నాడు. సాధుజనుల రక్షించి సన్మార్గ వర్తనమునకు ఆశ్రయము కల్పించినాడు. ఈ కథాకథనము మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన భార్గవరామ శ్రీరామ బలరామ శ్రీకృష్ణ బుద్ధావతార వర్ణనములు పూర్తియైనవి. రాబోవు కల్క్యవతార వర్ణనమైనది. శ్రావ్యములై ఆ దృశ్యములన్నియు పరీక్షిత్తు మనమున హత్తుకొనుచున్నవి. హయగ్రీవ దత్తాత్రేయ వృషభావతారాదులైనవి. హరియంశలగు సుయజ్ఞుడు సనకసనందనులు కపిలుడు నరనారాయణులు ధ్రువుడు పృథుడు మున్నగువారి చరిత్రములైనవి. నారద వ్యాస వసిష్ఠాది విశ్వామిత్రాది మునుల చరిత్రములైనవి. అంబరీష రుక్మాంగదాది మహాభక్తుల కథలైనవి. సూర్య చంద్ర వంశనృపతుల కథలైనవి. ఆకర్ణించుకొలది అమృతప్రాయములుగానున్న వవియన్నియును కాలమానము కల్పములు యుగములు మన్వంతరముల కథలైనవి. ఈ గాథలకు కథలకు సంబంధించిన ఆఖ్యానములు ఉపాఖ్యానములుకోకొల్లలు. అన్నియు విష్ణుసంబంధములే. మహాభాగవతకథ మహాస్రోతః ప్రవాహమై మధుర మధురమై మహారాజు పరీక్షిత్తు కర్ణములఁ జేరుచున్నది. ప్రతి వాక్యమున ఆతఁడు త్తేజితుఁ డగుచున్నాడు. శ్రీమహావిష్ణువు లీలా ప్రదర్శనస్థానమైన ఈ విశ్వమంతయు యెట్లుద్భవించినది? పరీక్షిత్తున కాప్రశ్న యుదయించినది.

శ్రీశుకుఁడు మరల మొదటికి వచ్చినాడు. పాలసంద్రమున వటపత్రశాయియైన బాలనారాయణుని నాభికమలమందుద్భవించిన బ్రహ్మ శ్రీహరి యానతిని సృష్టికార్యం నారంభించినాడు. బ్రహ్మ మానసపుత్రులు మహాఋషులుద్భవించిరి. ప్రజాపతు లుద్భవించిరి. బ్రహ్మఫాలమున రుద్రు లుద్భవించిరి. సర్వలోకముల సృజనమైనది. దేవ దానవ మర్త్యజంతు జలచరాది సకలచరాచర భూతకోటు లుద్భవించినవి. బ్రహ్మదేవుని నాలుగు ముఖములనుండి వేదములు శ్రుతములైనవి. సకల శాస్త్రములు విజ్ఞానములు విద్యలు కళలు వెలువడినవి. జగచ్చక్ర మవిచ్ఛిన్నముగ సాగుచున్నది. విశ్వరూపమునఁగల ఊర్ధ్వమండల, గ్రహమండల తారామండల ఆకాశ భూమండలముల వర్ణనలైనవి. సప్తద్వీప సంశోభితమైన భూమండలము, ముఖ్యముగ నారాయణుని కీర్తన జరుగు జంబూద్వీప భరతవర్షముల వర్ణనలైనవి. నదీనదపర్వత పయోనిధుల వర్ణనములు సాగినవి. అంతయు అణువునుండి మహత్తువరకు ఆయచ్యుతుని స్వరూపమే. ఆ విష్ణుమూర్తి విలాసమే.

దినము లొక్కొక్కటి వెనుకఁ బడుచుండెను. హరికథా శ్రవణానంద కందళిత హృదయారవిందుఁడైన పరీక్షిన్నరేంద్రునకుమృత్యుసమయముదగ్గఱపడుచున్నదన్న భావమే లేదు. మహాభాగవతములో తొమ్మిది స్కంధముల కథయైనది. దశమస్కంధ మారంభమైనది. శ్రీకృష్ణావతార

కథను శుకయోగి మొదలిడెను. శ్రీకృష్ణుడనుమాట వినగానే పరీక్షిత్తునకు శరీరము రోమాంచమైనది. తన తాతలకు ఏ మహనీయుడు మేనమఅదియై సచివుడై సర్వవిధముల సంరక్షకుడై సముద్ర వేలావలయిత సామ్రాజ్యమిప్పించెనో; ఏమహనీయుడు తన జన్మవేళ అశ్వత్థామ అస్త్రబాధనుండి తప్పించెనో ఆ మహామహుడు ఆ చక్రి ఆకారుణ్యనిధియగు శ్రీకృష్ణునిచరిత మారంభమైనది. ఈ భాగవతమే శ్రీకృష్ణ భాగవతము. కంసుని కారాగారమున వసుదేవ దేవకులకు శ్రీకృష్ణ ప్రాదుర్భావము మొదలు శ్రీకృష్ణుడు తనువు చాలించినవఱకు శ్రీశుకుడు వచించుట పరీక్షిత్తు వినుట ఒక్కబిగిని సాగిపోయినది. ఆ ఇరువురు ఒక ఆనందసాగరమున కలసి పయనించు యాత్రికుల వలె ఒకరి అనుభూతిని ఒకరు పంచుకొనుచుండిరి. పుట్టుకతోడనే తన దివ్యాకృతితో ఆవిర్భవించిన అవతారమూర్తి యశోదకు తన విశ్వరూపము జూపిన విశ్వమయుడు, సమరాంగణమున సవ్యసాచికి తన ప్రళయ భీకర విశ్వాకృతిని జూపిన సకలభూత మహేశ్వరుడు, శ్రీకృష్ణుడు నేడు మురళీమోహనాకారుడు, రాసలీలా విలాసుడు తన కన్నుల ముందే తాండవించుచున్నట్లయినది. పరీక్షిత్తునకు శ్రీకృష్ణుని గాథామహాత్మ్యము అనూహ్యము అతర్క్యము అనుభవైకవేద్యమేగాని అన్యముగాదు. పూతన మొదలు యెందఱో దుష్టులను వధించి ధరణిని ధర్మమ్ము సుస్థిరము చేసి

నాడు. నందయశోదలు అక్రూరుఁడు విదురుఁడు ఉద్ధవుఁడు భీష్ముఁడు, కుబ్జ, సుదాముఁడు, కుచేలుఁడు గోపికలు ఆహా! యెందఱెందరో నిర్మల హృదయులు శ్రీకృష్ణుని మధు రానుగ్రహమునకు పాత్రులై భవాబ్ధిని తరించిరి. శుకుడు చెప్పుచుపోవుచున్న ఆకథాకథనము పరీక్షిత్తు మానసాకాశ మున శరదుత్సవమే అయినది. శ్రీకృష్ణునకు గోపికలకు గల సంబంధమెంత పవిత్రమైనది? యెంత ఉన్నత ఆధ్యా త్మిక భావభావితమైనది? వినుచున్న కొలఁదియు అద్భుతా వహముగ నున్నది. వంశీనాద వినోదుఁడగు శ్రీకృష్ణుని భావించి సేవించి వర్ణించి ఆతనిం జేరి ఆడిపాడి పతిపుత్రా దిక సర్వమాతఁడేయని శ్రీకృష్ణతత్వములో క్రీడించి ధన్యు లైనవారు గోపికలు. శ్రీకృష్ణుని పాదముద్రల ముక్తి కాంతామనోమోహనములుగా భావించిన చరితార్థ లా గోపికలు ఆ కథలు వినినంతసేపు తానొక గోపికననియే పరీక్షిత్తు భావించుకొనుచుండెను. తా నంతకంతకు అల వైకుంఠపురమ్ములోఎచ్చటోవున్న శ్రీమన్నారాయణునకు చేరువ యగుచున్నట్లే తోచసాగినదతనికి. శుకుఁడుబోధించు చున్న శ్రీకృష్ణ చరిత్రము మధుర మనోహరముగా సాగు చున్నది. శ్రీకృష్ణుని వివాహములైనవి. దుష్టులెందఱో వధింపబడినారు. పాండవ రాజసూయమైనది. కౌరవ పాం డవ యుద్ధమైనది. యుద్ధ మధ్యమున శ్రీకృష్ణు డర్జునునకు

చెప్పిన ఆధ్యాత్మికోపదేశము శ్రీకృష్ణుడు తనకు చెప్పు చున్నట్లే పరీక్షిత్తు అనుకొనెను. ధరణిపై శ్రీకృష్ణుండు చేయవలసినపని ముగిసినది. పరీక్షిత్తు ఒక్కసారి తన మనో నేత్రము విప్పి చూచినాడు. తాను వినినది శ్రీకృష్ణ భాగ వతము – నాయకుడు శ్రీకృష్ణుడు. వ్రాసినది కృష్ణద్వైపా యనుడు – బోధించినది ఆ మహనీయుని కుమారుడు శ్రీ శుకయోగీంద్రుడు. జన్మతరించినది పరీక్షిత్తునకు. హరికథా శ్రవణఫలము పరిపూర్ణముగ లభించినది.

నారద వశిష్ఠ విశ్వామిత్రాది మహాఋషులు శ్రీ కృష్ణుని దర్శనార్థమే తెంచుట, బ్రహ్మాదిదేవతలు శ్రీ కృష్ణుని వైకుంఠమున కాహ్వానించు కథలుగూడ రచింపం బడినవి. విష్ణుసేవా ప్రాశస్త్యము భక్తులకు పరమపద లబ్ధియేయని ఆత్మతత్త్వము, జీవాత్మ పరమాత్మల సం యోగము మోక్షసిద్ధిగా శుకుడు వర్ణించుచుండగనే పరీ క్షిత్తునకొక విష్ణుచింతనా సమాధిస్థితి వచ్చినది. పరీక్షిత్తు స్థితి శ్రీశుకుం డెఱుగును. అయినను మఱొకసారి, ఆమహా నీయుని శ్రీశుకయోగీంద్రుడు–

ఉ॥ ఏనుమృతుండ నౌదునని యింతభయంబు మనంబు లోపలన్
మానుము సంభవంబుగలమానవకోట్లకుచావునిక్కమౌ
గాన హరిందలంపు మికఁగల్గదు జన్మము నీకుధాత్రిపై

మానవనాథ పొందెదవు మాధవలోక నివాస
సౌఖ్యముల్.

అని పరీక్షిత్తు నాశీర్వదించినాడు. పరీక్షిత్తు జీవము మహాతేజోవంతమై శ్రీహరిని జేరుచున్నది. ఆ మహాచక్రవర్తి దేహమంతయు ప్రకాశమానమైనది. ముఖమున బ్రహ్మభావము ఒక నూత్నవికాసమున వెల్గుచున్నది. యోగ నిష్ఠితుడైన ఆ మహానుభావుని ఆయుర్దాయువు లాగిపోవుచున్నవి.

ఆదరి శమీకమునికుమారుడు శృంగిశాప మూరక పోలేదు. సర్పకులాధిపుడైన తక్షకుడొక విప్రవేషమున వచ్చుచున్నాడు పరీక్షిత్తునెట్లయిన కాటేసి కడతేర్చుటకు. అతని వెనకనే కశ్యపుడను ఒకమహామంత్రవేత్తయు వేవేగచనుదెంచుచున్నాడు. తనమంత్రబలముచే యెట్టి సర్పవిషమైనను నిర్మూలించి సర్పదష్టుని పునర్జీవితుని చేయగల మాంత్రికుడాతడు. తన విద్యచూపి ఆ రాజువలన ధనసహాయము పొందవచ్చునని యా మాంత్రికుని యాశ. సర్పవిషమున భస్మమైపడియున్న వృక్షమును తన మంత్రముచే బ్రతికించి కశ్యపుడు తన శక్తిని చూపెను. అతని మహిమ ప్రత్యక్షముగ జూచి తక్షకుడామాంత్రికుడాశించిన ధనముకన్న మిక్కుటమగు ద్రవ్యము నాతనికిచ్చి వెనుకకు బంపివేసెను. తక్షకుని కార్యము సుకరమైనది.

పరిక్షిత్తున్న ప్రదేశముచేరి విప్రాకృతినున్న తక్షకుడు ఒక ఫలము నా రాజునకు కానుకగా లోనికి బంపినాడు. ఆ ఫలములో తానొక క్రిమిరూపమున సూక్ష్మదేహుడై చేరి సమయముకొఱకు నిరీక్షించుచుండెను. ఆ ఫలము పరిక్షిత్తును చేరినదో లేదో, ఆ క్రిమి ఒక్క త్రుటి కాలమున భీషణ విషోగ్ర సర్పాకృతియై మహా ఫూత్కారములతో చుట్టి ముట్టి పరీక్షితుని కాటేసి యదృశ్యమయ్యెను. ఆహా! యెంతవానికైనను విధి నిర్ణయము తప్పదుగదా యనుకొని, పరీక్షిన్మహారాజు ధన్యచరిత్రము తలచుకొనుచు ఇట్టిదికదా జన్మమని ప్రశంసించుచు పరిపూర్ణ బ్రహ్మభావ వికాసకాంతివిస్ఫూర్తితో వెలిగిన ఆ పృథ్వీశుని మరియొకసారి సానుకంపతో వీక్షించి, శ్రీశుకునకు ప్రణతులర్పించి అచటచేరిన మునులు జనులు, వెనుకకు మఱలిరి-

పవిత్రమగు పాండవ వంశమున ప్రభవించిన పుణ్యశీలి ధర్మపరిపాలనము నెఱపిన ధరణీశుడు, కలియుగమారంభమైనను తన రాజ్యమున కలికాలుష్యము లేకుండఁజేసి ధర్మదేవతను నాల్గుపాదముల స్వేచ్ఛగ విహరింపఁజేసిన ప్రాభవోపేతుడు, హరికథా శ్రవణానందమయుఁడై పరమపదమును జేరఁగలిగిన మహాభక్తుడు పరీక్షిత్తు-

సమాజ శ్రేయోమార్గమును జూపు కొన్ని ఇతర ముఖ్య విషయములనుగూడ పరీక్షిత్తు కథవలన తెలియనగును. మహాధార్మికుఁడు కన్నతండ్రిని బోలిన పరిపాలకుఁ

డైన పరీక్షిన్నరపాలుని జీవనముకన్న తక్షకుఁ డిచ్చిన ధనమే మాంత్రికుఁడైన కశ్యపునకు విలువగలదిగ కానుపించినది. ధనాశ, లోభము యెంతటి ద్రోహమునైనను చేయించునుగదా! ఆదుర్గుణమిచ్చట సకల సద్గుణ సంపన్నుడైన చక్రవర్తినే బలిగొనినది.

పరీక్షిత్తు మాన్యుఁడగు భూపాలకుఁడే. పిపాసార్తుడనిన విషయముగూడ సత్యము. సమాధిగతుఁడైన శమీకముని స్థితి గ్రహించు ఓరిమిలేక తొందరపాటున అనుచితమని కూడ తలంపక. ఒకమృతోరగమును దెచ్చి ఆ ముని మెడకు జుట్టెను. ఆ పాపము శాపమై తన మీదికే వచ్చినది. యెట్టి పరిస్థితులలోనైన పెద్దలను జ్ఞానులను తిరస్కరించి అవమానించుట యెంత ఘనునికైనను తగనిపని.

ప్రతిశాపమీయఁగల సమర్థుడయ్యు, మునిబాలకుని శిక్షింపఁదలపెట్టలేదు సరికదా. తనతప్పుతానెరిఁగి పరీక్షిత్తు ఆవిప్రకుమారుని శాపమున కధీనుఁడై ఆ శాపమునే వైరాగ్యకారణముగ నెంచి మనసును మాధవచింతనమున కంకితమొనర్చిన మహాజ్ఞాని యనిపించుకొని కైవల్యసిద్ధినందిన పరమభాగవతుఁడయ్యెను. ఉత్తముల వర్తనము లిట్లుండును.



# 3. ధాస్యము - అక్రూరుడు

ఉ॥ ఎట్టితపంబుసేయఁబడె నెట్టిచరిత్రము లబ్ధమయ్యెనో
యెట్టిధనంబు లర్హులకు నీఁబడెనో తొలిబామునందు నా
యట్టివివేకహీనునకు నాదిమునీంద్రుల యోగదృష్టులం
బట్టగలేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁ
గల్గెడిన్.

వ్రేపల్లెలో నందునింటఁ బెరుగుచున్న బలరామకృష్ణులను కంసుని ఆదేశమున మధురకుఁ గొనివచ్చుటకేగు అక్రూరుని మనసునందున్న భావములవి. శ్రీకృష్ణుఁడు తన మృత్యుకారణమని నమ్మి ఏదో వ్యాజమున ఆ బాలుఱిద్దరిని తన నగరికి రప్పించి చంపవలయునన్న భ్రమ కంసునిది. ఆ దుష్టభావము నెఱిఁగియు సద్వర్తనుఁడగు అక్రూరుఁడును వారిని గొనివచ్చుటకేగినాఁడు. నారాయణుని అవతారమగు శ్రీకృష్ణుని కెట్టియాపదయు వాటిల్లదని అతని ధైర్యము.

ఉ॥ శూరులు తొల్లి యెవ్విభుని శోభితపాదనఖప్రభావళిం
జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టిదేవునిన్
వైరముతోడనైన బిలువన్ ననుఁబంచి శుభంబుసేసె ని
ష్కారణమైనప్రేమ నిదె కంసుని బోలుసఖుండు
గల్గునే.

కంసుని తలఁపెట్టిదైనను, ఆ కారణముచే మోక్షదాయకుఁడగు శ్రీకృష్ణదేవుని దర్శనభాగ్యము కలుగుచున్నది. ఇదియును శుభమే అని అక్రూరుడు మఱియొకసారి భావించెను. అతని ధ్యానమెల్లప్పుడును శ్రీకృష్ణుని పదారవిందములయందే. శ్రీకృష్ణునిగూర్చి వినిననాటినుండియు ఆ మహాసీయునే తన ప్రభువుగా నెన్నుకొని జీవించుచుండిన అక్రూరుని భావన అట్టిది. సత్కులీనుఁడైన అక్రూరుని కిట్టి నిర్మల దైవచింతన మలవడుట పసిడికి తావి అబ్బినట్లయినది.

ఉత్తర భారత వర్షమున ప్రసిద్ధికెక్కిన మధురరాజ్య ప్రాంతమున వసించు భోజకులమునకు చెందినవాడు అక్రూరుఁడు. సౌహార్దమునకు సౌజన్యమునకు పేరెన్నికఁగనిన సుగుణవర్తనుఁడు మధురానగరవాసి శ్రీకృష్ణునిమాహాత్మ్యమెఱిఁగి శ్రీకృష్ణునే తనప్రభువుగా భావించుచుండువాఁడు. ఇతని జనకుఁడు శ్వఫల్కుఁడు.

కాశీ దేశమున ఒకప్పుడు వానలులేక దుర్భిక్షమేర్పడి ప్రజలనేక బాధలు పడుచుండిరి. కాశీశుని భార్య గర్భవతియై యీ శిశువును చాలాకాలము మోయుచుండెనే గాని ప్రసవము కాలేదు. మహాప్రాభవశాలియగు శ్వఫల్కుని కాశీకి ఆహ్వానించినచో ఈ కష్టములనుండి గట్టెక్కగలవని పురోహితులు చెప్పిన మాటలు శిరసావహించి కాశీరాజు స్వయముగ అనుచరసహితుఁడై చని శ్వఫల్కుని సగౌరవ

ముగ నాహ్వానించి కాశీకి తీసికొనివచ్చి సకల సత్కృతులను గావించుచుండెను. శ్వఫల్కుని రాకతో కాశీ రాజ్యమునకు మంచి దినములు వచ్చినవి. వానలు కురియ సాగినవి. పంటలు పండినవి. పశుగణము వృద్ధియైనది. ప్రజలు సుఖించిరి. శ్వఫల్కుని ఆశీర్వాదబలమున కాశీరాజు భార్య సుఖప్రసవమై చక్కనిచుక్క యనందగు పుత్రికను గనెను. ఆబాలికపేరు గాందిని. క్రమముగ గాందిని పెరిగి సౌందర్యవతియగు జవ్వనియైనది - శ్వఫల్కుఁడు తన కొనరించిన యుపకృతిని మఱవక కాశీశుఁడు తన ముద్దులతనయయగు గాందినిని శ్వఫల్కునికిచ్చి పెండ్లి చేసెను. ఆ పుణ్య దంపతులకుమారుఁడే శ్రీకృష్ణునిభక్తశేఖరుడగు అక్రూరుడు.

కంసుడు మధురరాజ్యమును చేజిక్కించుకొని పాలించుచుండెను. ఇతని సోదరి దేవకి వివాహసమయమున విను వీధినుండి ఒకవాణి వినిపించినది. దేవకి అష్టమ గర్భమున జనించు కుమారుడు కంసునిమృతికికారణమగునని. కంసుడు భయపడి, దేవకిని ఆమె భర్తయగు వసుదేవునితో చెఱసాలయందుంచి దేవకికి జనించు శిశువులను వరుసగ చంపుచుండెను - దేవకి యెనిమిదవసారి గర్భవతియైనది. ఒకనాడు కెవ్వన ఒకశిశువు రోదనము వినిపింపగనే కంసుడు పరుగెత్తి ఆ శిశువును తనకరవాలమున కెఱఁజేయ నుంకించుచుండగా ఆ క్రూరుని హస్తములనుండి ఆ శిశువు తప్పించుకొని ఆకసమున కెగసి ఓరీ కంసా! నిన్ను జంపు వీరబాలుఁడు వేఱుగ

పెరుగుచున్నాడు. అతడు నిన్ను వధించితీరుననిపలికి అదృశ్యయమ్యెను. ఆ శిశువు యోగమాయ. వ్రేపల్లెలోన ందుని భార్య యశోదకు జన్మించినది. ఆ క్షణమునందే చెఱసాలలో దేవకికి జనించిన మగశిశువును వసుదేవుడు తనకు చెఱసాలలో విన్పించిన దివ్యవాణి నిర్దేశానుసారము వ్రేపల్లెలో దేవకి మంచముపైనుంచి, దేవకికి తెలియకుండగనే దేవకికి జనించిన యోగమాయను యశోద ప్రక్క నుంచెను. కంసుడా యోగమాయను చంపఁబోయి నిష్ఫలుడై ఆ యోగమాయ పల్కులు విని భయభ్రాంతుడై ఏమిచేయుటకు తోచక తనరాజ్యమునఁగల శిశువులనందఱిని తన భటులగు రాక్షసులచే చంపించుచుండెను. క్రూరులగు ఆదైత్యులు వ్రేపల్లెకేగి అనేక మాయాకారములతో దేవకికడ పెరుగుచున్న కుమారుడు కృష్ణునిగూడ చంప యత్నించి కృష్ణుని చేతులలో మరణించుచుండిరి.

కంసుఁడు పంపగా నేగినవారిని చంపుటేగాదు, మఱెన్నియో సాహస కృత్యములను కృష్ణుఁడు పిన్ననాడే యొరించెను. ఆ చిన్నికృష్ణుని లీలలు జగదాశ్చర్యకరములైయుండి ఈ బాలునివలననే తనకు మృత్యువని కంసుని గుండెలు దిగజారిపోవుట మొదలిడినది. పరిస్థితులింకను ముదిరినచో తన శత్రువునకు బలమెక్కువగును. వెంటనే ఈ బెడదను త్రుంపకపోయినచో కృష్ణుడే విజృంభించి

తనపైఁబడ వచ్చును. ఇట్లాలోచించి కృష్ణుని తానే చంపు టకు కంసుడు నిశ్చయించుకొనెను.

నందుని ఇంట బెరుగుచున్న కృష్ణుని, ఆ బాలునితో సఖుడైన అతనియన్న బలరాముని ఇద్దరిని చంపుటకై కంసుఁడొక పన్నాగము పన్నెను. ఏదోమిషచే బలరామ కృష్ణులను మధురకే రప్పించి కడతేర్చవలయును. తన మధురలోనున్న అక్రూరుఁడు కృష్ణప్రియుడు. అక్రూరుడేగి చెప్పినచో కృష్ణుఁడు తప్పకవచ్చునని తలఁచి తాను చేయ దలపెట్టిన ధనుర్యాగోత్సవములను తిలకింపవలసినదిగా బల రామ కృష్ణులను వ్రేపల్లెనుండి నందాదులతోఁగూడ తోడ్డి రెమ్మని కుసుఁడా యక్రూరునంపెను.

కంసుని దురాలోచనము నక్రూరుఁ డెఱుగును కాని, రాజాదేశము ఆ పనికై పోవకతప్పదు. శ్రీకృష్ణుడు సామా న్యమానవుడుగాదు. లీలామానుష విగ్రహుడైన పరమా త్మయే. ఈ విషయము నక్రూరుఁడు తన యాత్మయం దెఱుంగును. నిత్యము చిత్తమున శ్రీకృష్ణునే తలఁచుచు ధ్యానించుచు, తన ప్రభువుగా నెంచుచు ఇదియే జీవిత పర మార్థముగా నెంచుచు బ్రతుకు గడపుచున్న అక్రూరున కీరాజకార్యము తలకంటగింపైనది. శ్రీకృష్ణునెడలనా? తుదకు తానీ దుష్కార్యమొనరించుట, ఆతఁడేమనుకొనును, ఆతని బంధువులేమనుకొందురు? ప్రజలేమనుకొందురు ? ఈసంశయములతో అక్రూరుని మానసము తహతహ లాడ

పోయినది. యెట్టి చెడుతలంపు మనమునలేని అమాయకుఁడను నేను ప్రభూ! నీదాసుని రక్షింపుము అని శ్రీకృష్ణునకు మనసునందే నమస్కృతు లాచరించి మఱునాడు కంసుడు పంపిన రథమునెక్కి అక్రూరుడు నందుఁడున్న బృందావనమునకు బయలుదేరినాడు.

శ్రీకృష్ణ పరమాత్మను చూచుభాగ్యము లభించినదను ఉత్సాహ మొకప్రక్క, అయ్యో కంసుడు చేయ తలపెట్టిన క్రూరకార్యమునకై శ్రీకృష్ణుని కొనిరావలసి వచ్చినదే అనుభయము మఱొకప్రక్క ప్రబలిన తత్తఱపాటుతో అక్రూరుడు ప్రయాణము సాగించెను. అక్రూరుని మనసు నందన్నియు సందేహములే. తనరాక నెవరైన చూచినచో ఇందేదో దురాలోచనమున్నదని తప్పక అనుమానింతురు. యెవరికంటను పడకుండ పోవలయును. శ్రీకృష్ణుని పాదములపై బడవలయును. తనస్వామి సన్నిధానమున తన సర్వస్వము అర్పింపవలయును. పోదును సరే, శ్రీకృష్ణుడు నన్నేమని తలంచునో కంసునివద్దకు చేకొనిపోవు దుష్టునిగా తలఁచునో యేమోనను భయము, ఆ మహనీయుడు సకలభూతాంతర్యామి నా సుజనత్వ మెఱుంగకుండునా అను ధైర్యము కొంత డెందమున సందడింప బృందకరగుచు—

ఉ॥ మాపటివేళ నేనుచని మాధవుపాదసమీపమందు దం
డాపతితుండనైన నతఁడాశుగ కాలభుజంగవేగసం

తాపిత భక్తలోకభయదారణమైన కరాబ్జ మాదలన్
మోపి హసించి నాకభయముం గృపతోడుత
నీయకుండునే.

అని తలంచిన అక్రూరునకు ఒకింత గుండెదిటవు కుదురుకొనినది_ నేను బృంద చేరునప్పటికి చీకటిపడునుగదా ఒంటరిగా ఆతని పాదపద్మములపైఁ బడుదును. భక్తులను సదా రక్షించు ఆ దేవుని అభయహస్తమే నా కవలంబము. అక్రూరుని హృదయము తలఁపులు కృష్ణమయములైనవి.

ఆమలి సంజవేళ బృందావన ప్రాంతములు పసపు బంగరులు జల్లులాడినట్లు మఱింత అందమొల్కినవి. కోష్ఠములవైపు బరువులెత్తు గోవుల పదధూళి ఆకసమున వేచుచున్నది. ఆ వనమార్గముల కిరుగడలనున్న పూఁబొదలనుండి తీయతావులు దిక్కుల కెగయుచున్నవి_ ఆ యాలమందల మధ్య పుష్పమాలాంకృతులై చనుచున్న బలరామకృష్ణుల దిలకించినంతనే అక్రూరుఁడు వివశుఁడై వారిపాదములపై బడెను. స్వామిపాదములపై తన శిరసుంచినాడు. ఆనందాశ్రువులు కట్టలుతెగి పారినవి. శ్రీకృష్ణుఁడక్రూరు నాదరమున లేవనెత్తి ఇంటికి తీసికొనిపోయినాడు. నందుడును తగిన మర్యాదలొనరించి ఆసనమిచ్చినాడు - కుశల మడిగినాడు.

అక్రూరున కేమిచెప్పుటకునోరు పెగులుట లేదు. తాను వచ్చినపని వేరు, వీరడుగు ప్రశ్నలు వేరు. శ్రీకృష్ణుని మనసు

తనతలిదండ్రులు దేవకీ వసుదేవులపై బోయినది. అక్రూరా! మీరందఱు కుశలమేగదా - మామ కంసుని భయములు తీరినవా? అతని కారాగారమున బంధితులైన మా అమ్మ నాన్నయు యెట్లున్నారు- వచ్చునపుడు నీకేమైన చెప్పిరా? శ్రీకృష్ణుని ప్రశ్నలు పరంపరగా వచ్చుచున్నవి. అక్రూరుని మనసునకు దుడుకెక్కువైనది. రాజకార్యవృత్తి వేరు, తన ప్రవృత్తివేరు. ఆ ప్రశ్నలకు తగు నుత్తరము లిచ్చి తా నరుదెంచినపనిని మెల్లగనుడివెను. "మధురాధిపతి" కంసుడు ధనుర్యాగ మొనరించుచున్నాడు. సకల రాజన్యులు వచ్చుచున్నారు. మిమ్మందర నాహ్వానించి ప్రత్యేకముగ బలరామ కృష్ణులఁ దోడ్కొని రమ్మని నన్నంపెను అని - వారియెడ కంసునికిగల ఆదరాభిమానములు వారెఱుగనికావు. శ్రీకృష్ణుడు అన్న బలరాముని జూచి చిఱునవ్వు నవ్వి, నందుని దెస అంగీకారము దెల్పెను - పూతనవధ నోటినుండియు, కృష్ణునియెడ కంసుని చేతలు చేతములందు అందఱెఱుగుదురు. అక్రూరుఁడును తన రాయబారమునకు తానే బిక్కు బిక్కుమనుచుండెను. ఏమిజరుగనున్నదో శ్రీకృష్ణునకే వేద్యము. మఱునాఁడు నందాదులు మధురకు పయనమైరి. అక్రూరుని యరథముపై బలరామ కృష్ణు లాసీనులయిరి. అక్రూరుని మనోభావములను శ్రీకృష్ణు డెఱుగును.

శ్రీకృష్ణుని మధురకు తీసుకొనిపోవుచున్నారను వార్త గోకుల బృందావనముల నలుదిక్కులకు బ్రాకినది. వినినవారెల్లరు విషణ్ణచిత్తులై విచారింపసాగిరి. అయ్యో! మన వంశీమోహనుఁడు రాసలోలుఁడు మనోహరుఁడు ప్రేమమూర్తి శ్రీకృష్ణునా నాగరికవధూమణులు చూచిన మరల వెనుకకు రానిచ్చెదరా, యెంత విపత్తు వచ్చినది. ఈ ప్రయాణమునాపెడువారు లేనేలేరా.

శా॥ అక్రూరుండని పేరుపెట్టుకొని నేడస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడ బాపికొంచు నరుగం జర్చించి
యేతెంచినా
డక్రూరుండట క్రూరుడీతడు నిజం బక్రూరుడౌ నేని ని
ర్వక్రత్వమ్మునఁ గృష్ణుబెట్టి తనత్రోవంబో
విచారింపడే.

అని గోపికలు పలుతెఱంగుల విలపించుచు కృష్ణుఁడేగు రథము దృగ్గోచరమగు దనుక చూచి చూచి వెనుకకు మరలిరి.

రథముపై రమణీయమూర్తులు రామకృష్ణులు వారి పాదపీఠమున రథచోదకుఁడై తాను. యెంతటిభాగ్యము! అక్రూరుని ఆనందమునకు మేర లేదు. మాటి మాటికి రామకృష్ణుల నేదో మధురాభిలాషతో చూచును. ఆలస్యమగు నేమోయని యశ్వముల నదలించును. ప్రతి నిముషము శ్రీకృష్ణవదనారవింద దర్శనానంద రసాస్వాదన చేయువల

యునని యే అక్రూరుని తలంపు. రథము యమునానదిని సమీపించినది. సూర్యసుతా స్రవంతిక యమున. పుణ్యఝరీ పూరము లా నీరములు. రామకృష్ణుల యనుమతిగైకొని, యమునాజలస్నానమునకై చని వేదమంత్రముల విధిపూర్వకముగ నుచ్చరించుచు ఆశీతలోదకముల మునిఁగి లేచి, మరల మునుఁగునంత ఆ జలగర్భమున రామకృష్ణులు కన్పడిరి. ఆహా! ఇది ఏమి వింత, భ్రాంతి యేమో; కనుదమ్ములు విచ్చి చూచెను. వారు రామకృష్ణులే. నిలబడి రథమువైపు విలోకించెను. అచటను రామకృష్ణులే. నీట మరల మునిగెను ఆ రామకృష్ణులే. ఒక అద్భుత కాంతిలోకమునకు త్రోసివేయఁబడినట్లు అక్రూరుడు మరల నీటిలో మునిగెను. సహస్రఫణి ఫణాభిశోభితుఁడైన శేషుడు. ఆ భోగి భోగ పర్యంకమధ్యమున శ్రీ రమాసహితుడు శంఖచక్ర గదా పద్మహస్తుడు శ్రీవత్స కౌస్తుభవనమాలికా విరాజితుఁడు జలజగర్భ రుద్రసనకసనంద నాద్యమర సేవ్యమానుఁడు ప్రహ్లాద నారదాది పరమభాగవత సంభావితుఁడు మహాసౌందర్యనిధియు మహాపురుషుఁడునగు పద్మనాభుని మూర్తి అక్రూరుని నయన గోచరమయ్యెను. భూమిపై నీటిలో వెలుపల బయటయు అంతయు భగవన్మయము. తానాకాంతి ప్రవాహమున గొట్టుకొని పోవుచున్నాడు. ఆ పరమేశ్వరుని దర్శనమున తనను తానే మఱచిన అక్రూరుని భక్తిపారవశ్యము అవధులు దాటినది. ఆనందభాష్పములు వఱదలై

పారుచున్నవి. గళము వణకుచున్నది. చేతులు జోడించి ఆ మహామూర్తి నిట్లు స్తోత్రము చేసినాడు.

ఓ దేవాదిదేవా, మహామునీంద్రుల కలభ్యమైన నీ దర్శనము లభించినది. నా మనోరథము ఫలించినది. నిన్నే మని స్తుతింపగలను. ఈ విశ్వ విశ్వముసకాదియు ఆధారము నీవే. సమస్తంబు జలమయంబై యున్నవేళ, ఆ కల్లోల జల తరంగముల బాలకేళీగతిని దేలియాడు నారాయణుడవునీవు. నీ నాభిపద్మమ్మునం దుద్భవంబైన బ్రహ్మయేకదా! ఈ లోకములెల్ల సృష్టించెను. ఈ లోకములెల్ల నీయందే వికసించి వసించి నశించుచుండును. పునఃపునరావృత్తిగజరుగు సృష్టి స్థితిలయముల కీవే కారణుండవు. సకలసాక్షీభూతుడవు. అఖిలభూతమ్ములందంతర్గత జ్యోతినీవే, నీ వొక్కండవు, నీ వనేక రూపాధిశోభితుండవు, నీవే ఆత్మవు, వాసుదేవాది అనేకరూపములు నీవేయని జ్ఞానులెల్లరు నుతింతురు. అనేక జలపూర్ణఘటమ్ముల ప్రతిబింబించు ఒకే రాకేందు బింబమువలె నీ వొకడవే సగుణుండవు, నిర్గుణుండవు, నిర్వికారనిరంజనుడవు, నీ వదనము వహ్ని. సూర్యచంద్రులు నేత్రములు, దిక్కులు చెవులు, భూమి పాదము. సాగరములు కుక్షి,శల్యములద్రులు. లతలు తరులు రోమములు, గాలిప్రాణము. సర్వవిశ్వము నీవేదేవా. నీవే విశ్వరూపము. చక్రివై మధుకైటభుల ద్రుంచింతివి. మహాబ్ధిమధ్యమున మత్స్యాకృతిని బూని సోమకుంద్రుంచి వేదములదెచ్చి విరించి

కిచ్చితివి. కూర్మమవై క్షీరసాగర మథనార్థము మందర గిరి నెత్తితివి. వరాహమవై హిరణ్యాక్షుఁద్రుంచి భూగోళ మును జలములనుండి పైకెత్తి నిల్పితివి. నరసింహుడవై హిరణ్యకశిపు జీల్చి ప్రహ్లాదాది భక్తుల గాపాడితివి. వామ నుడవై బలిగర్వమడచి త్రివిక్రముడవై ముల్లోకము లాక్ర మించితివి. భార్గవరాముఁడవై దుష్టరాజన్యుల రూపుమాపి తివి. శ్రీరాముఁడవై లోకవిద్రావణుఁడైన రావణు బోకార్చి క్షేమరాజ్యము నిల్పితివి. బుద్ధుడవై వైరిజాలా తరంగముల గరంగించితివి. ధరణిని ధర్మమ్ము నిలుపకల్కివై వర్తింతువు, దుష్టశిక్షణ శిష్టరక్షణగదా యుగయుగమ్ముల నీ యుద్యమము. అశాశ్వతములయిన లౌకిక భోగభోగ్య ములు సత్యమ్ములనినమ్మి వర్తించు మూఢుఁడను స్వామీ నీ తత్త్వమెఱుంగలేని అల్పుడను. నీ పాదయుగ్మము చాలు నీ దాసుడనై నిన్ను సేవించి ధన్యుడనయ్యెదను. నీ కిదే నమస్కారము దేవా! కృపాకల్పాయని ప్రార్థించుచు అర్ధ నిమీలిత నేత్రముల ధ్యానముద్రలో మునిగిన అక్రూరుని నేత్రములముం దానారాయణుని మూర్తి అదృశ్యమై మొద టగానుపించిన శ్రీకృష్ణవిగ్రహ మగుపించినది. అక్రూరుని కనులు మిఱుమిట్లు గొలిపినవి. కనులలో శ్రీకృష్ణమూర్తి మెఱసిపోవుచున్నాడు. అంతయు కృష్ణమయము. ఆ తా దాత్మ్యములో లేచి తీరమును జేరి రథముకడ కరుదెంచిన

అక్రూరునికి చిఱునవ్వులొలుకు నందకుమారులు బలరామ కృష్ణులు యథాపూర్వము కనుపించిరి.

అక్రూరుని మనోభావము లింకను వైకుంఠమునందే యున్నవి. నారాయణుని పాదయుగ ముద్రాంకితమైన యతని హృదయ మా వైష్ణవ లోకమునందే తిరుగాడు చున్నది. అనన్యచింతనమున నున్న భక్తిపారవశ్య మది. శ్రీకృష్ణుఁడు లీలామానుషవిగ్రహుఁడు అక్రూరుని దృష్టి అవనికి కొనిరావలయును.

" అక్రూరా ! నీ చర్యవింతగా నున్నది. నదీ జలములు చాలా చేరువలో నున్నవి. నీవు స్నానమునకై యేగి చాలా సేపయినది. భూమ్యాకాశములందెచటను లేని చోద్యములేమయిన నీకాజలమునందు కనపడినవా" అని కృష్ణుడు మేలమాడుసరికి అక్రూరునికి తెలివివచ్చినట్లయినది; ఆహా! యెంత భగవదనుభూతి, బ్రహ్మభావమును పొందితిని అనుకొని తన యుత్తరము నెట్లీయవలెనో తెలియక- " మహాత్మా! నన్ను పరీక్షించుచుంటివి. నా కనుల పండువుగా చూచిన దివ్యరూపమును నేనేవర్ణింపలేకున్నాను. అంతయు నీవే అన్నియు నీవే నీలోలేని చోద్యము లేమియుండును? యెచ్చట నుండును? నీకరుణ లభించినది, నా కింకేమియు వలదు. నీ సేవసేయు తలంపొకటేయున్నది. నా చిత్తమున మధురానగర మేగిన పిదప స్వామీ, దాసుడనైన-

కం॥ నా యింటికి విచ్చేయుము
నీయంఘ్రి సరోజరేణునికరము సోకన్
నా యిల్లు పవిత్రంబగు
శ్రీయుత నీభటుని పెద్దసేయం దగదే.

అని శ్రీకృష్ణుని పాదములంటి మఱిమఱి వేడినాడు. భక్తుల మనోరథముల తీర్చుట పద్మాక్షుని కర్తవ్యమేకదా! అట్లే చేయుదాను రథమును పోనిమ్మని అని శ్రీకృష్ణుఁడు బలరాముని తో మధురాపురిఁ జేరగనే రథముదిగిఁ అక్రూరుని వాని యింటికిఁబంపి పాదచారియై తాను మధురాపుర ప్రవేశము గావించెను.

బలరామ కృష్ణులలో దుష్టజన విదళనోగ్రములైన తేజఃపుంజము లుజ్జ్వలములైనవి. కంసుడు ధనుర్యాగ మనుమిషపై తమ్మురావించెనని గ్రహించెను. ధనుశ్శాల కరిగి కంసుని మహాభీకర ధనువునుబట్టి తుత్తియలుజేసి ఆ యాగమునట్లు తానే పూర్తిగావించెను. దారిలో తనమీఁదికి తోలబడిన మత్తగజము కువలయాపీడమును దంతములు పెఱికి అంతమొందించెను. కంసుని సభకేగి, తనపై కురుక నెంచు చాణూరముష్టికులను మల్లవీరుల వధించెను. ఖడ్గ మూని తనపై కిరాబోవు కంసుని శిరోజములఁబట్టి క్రిందకు లాగి పిడికిళ్ళతో బొడిచి చంపెను. తల్లి దండ్రులవద్ద కేగి రామకృష్ణులు చెఱ విడిపించిరి. ఉగ్రసేనునికి తిరిగి రాజ్య పట్టము నిచ్చిరి. తన బిడ్డల నిద్దఱిని పుట్టిననాటినుండి నేడు

పొంగకలిగిన దేవకికి దేహము రోమాంచమై కుచయుగ్మము క్షీరధారల వర్షించినది. ఆ ప్రేమామృతమూర్తి వారిని పావనమూర్తియల కెత్తుకొనినది. వసుదేవుడు వారిశిరములు మూర్కొని ఇరువురును ఇరుచేతుల నెత్తికొని ముద్దాడెను. జగన్నాథుడైన నారాయణుని తమ బిడ్డగా కని మోసిన పావనమూర్తు లా దంపతులు.

ఇట్లెన్నో బృహత్కార్యములైనవి- ఇంకను కావలసి యున్నవి- కాని కృష్ణుని మనసు తన భక్తుడు అక్రూరుని మీదనేయున్నది. తా ననినమాట చెల్లించుకొనవలయును. భక్తుని యోగక్షేమములు వహించునది పరమాత్మయే గదా !

నేను నీ భటుడను నీ పాదసేవ నాకుచాలును, శ్రీ కృష్ణదేవా అని వేడిన అక్రూరుడు బలరామ కృష్ణులను మథురాపుర ప్రవేశద్వారమునందు దింపి తన ఇంటికే వెడలెను. కంసునిమొగము తిరిగి చూడనైనలేదు. ఇక అక్రూరుని సర్వము కృష్ణార్పణమైనది. శ్రీకృష్ణునే ధ్యానించుచు స్మరించుచు భావించుచు తదేక దీక్షితుడై యుండును. నీ ఇంటికల్లే వచ్చెదనని మాటయిచ్చిన శ్రీకృష్ణుడు రాక పోవునా అని ధైర్యము. కాని అక్రూరుని మనసు నందొక సందియ మావరించినది. యెడతెరిపిలేక తాను ధ్యానించి స్మరించునది శ్రీకృష్ణుని దివ్యసుందర విగ్రహము; కాని తన మనోగోచరమగునది తాను యమునా జలగర్భమున

నూచిన ఆ జగన్నాధుని స్వరూపము, మాటి మాటికి ఆ జలజాజాక్షునిరూపమే, ఆ జనార్దనునివిగ్రహామే కనుపట్టు చున్నది. తానెచ్చటికి పోవుచున్నాడు. తనకయ్యది గమ్య స్థానము. అక్రూరునికంతయు అస్ఫుటముగా నున్నది. ఆ సందేహాస్పద సమయములో మనసు ఒకింత వివశమై తన హృదయ స్థితమైన పద్మాక్షుని పాదములను రెండు హస్త ములతో పట్టుకొనినాడు - కనువిప్పి చూచుసరికి యెదుట చిఱునవ్వులుచిందు శ్రీకృష్ణవిగ్రహము. ఆ పరమాత్ముని పాదములపై తన చేతులు, తన శిరము. ఆనందబాష్పము లంబుధులై పొరలినవి - అక్రూరా! లెమ్ము యేమి అట్లే కూర్చుంటివి? అను శ్రీకృష్ణుని ఆదరవచనములతో అక్రూ రునికి తెలివివచ్చినది- అక్రూరుని కల నిజమైనది, జన్మము ధన్యమై చరితార్థమైనది. పరమార్థ ప్రదమగు ఒక పథము అక్రూరునికి లభించినది - భగవదనుగ్రహమునందిన భ శిఖామణి యతడు.

బలరామకృష్ణులను తన యెదుట ప్రత్యక్షముగఁజూ చిన అక్రూరుని ఆనందమునకు మేరలేదు. తాను పరమపదము నకు జేరినట్లే భావించుచు, "శ్రీకృష్ణా పరమేశ్వరా నీవు విశ్వమయుఁడవు విశ్వకారణుఁడవు సృష్టి స్థితి లయ కార ణుండవయ్యు విజ్ఞానమూర్తివగు నిర్గుణుండవు. పరతత్త్వమైన నీ దర్శనమాత్రమున నీ యనుగ్రహావేశమున యెల్లజీవులు

చరితార్థులగుదురు. దుష్టుల శిక్షించి ధర్మరక్షణ కుద్భవించిన నారాయణుడవు, నిన్ను జూచితిని నాకదిచాలును."

శా॥ ఏపుణ్యాతిశయప్రభావముననో యీజన్మమందిక్కడన్
నీపాదంబులుగంటి నిన్నెటిఁగితిన్ నీవున్ గృపాళుండవై
నాపై నర్మిలిఁజేసి మాన్పఁగదవే నానాధనాగార కాం
తాపుత్రాదుల తోడిబంధనము భక్తవ్రాతచింతామణీ!

అని ప్రార్థించినాడు. అక్రూరుని వైరాగ్యభావము తారాపథమందుకొనిన మనస్థ్సితి యిది.

కాని శ్రీకృష్ణుని యాలోచనవేరు. అక్రూరునివలన కాదగిన పనులు ముందున్నవి. ఈ విరాగమునుండి అక్రూరుని మరల్పవలయును. శ్రీకృష్ణుఁడు మందహాస మొనరించుచు "అక్రూరా, నీవు ధన్యచరిత్రుడవు, పెద్దవాడవు, మాన్యుడవు అందఱికిని హితుడవు. పరమభాగవతుఁడవగు నీకు దైవానుగ్రహము తప్పక లభించును. ప్రస్తుత మీ భావములట్లుంచి, నీకుకరణీయమగుపని యొకటున్నది. కుంతీ సహితులైన పాండవులు హస్తినాపురమున ధృతరాష్ట్రునింట నున్నారు. ఆ యంధనృపతి కుమారుఁడు దుర్యోధనుఁడా పాండవుల ననేక బాధల బెట్టుచుండెనని వినుచున్నాము. పుత్రమోహంబున ధృతరాష్ట్రుడేమియు అనజాలకుండెను. నీవేగి వారి యోగక్షేమములు పరిశీలించి వారి దుస్థితిని వారించిరమ్ము" అని నుడివెను.

శ్రీకృష్ణుని వాక్యములు శిరసావహించి అక్రూరుడా మఱునాడే హస్తినకేగి అచటి పెద్దలనుచూచి కుంతి నోదార్చి, విదురాదులెదుటనుండగా, దుర్యోధనుని దుశ్చేష్టల మాన్పి పాండవులకు న్యాయము చేకూర్పుమని ధృతరాష్ట్రుని కెంతయో చెప్పెను-

శా॥ నిందంబొందకుమయ్య యీతనువు నిద్రాకళాదృష్టహా
సందోహంబు విధంబు నిల్వదుసుమీ జాత్యంధతన్ బొందియున్
మందప్రజ్ఞత లేలచేసెదవు సమ్యగ్జ్ఞాన చక్షుండవై
సందేహింపక యిమ్ము పాండవులకున్ సర్వాంసహా భాగమున్.

అని స్పష్టముగ ఉద్బోధించెను. కాని ధృతరాష్ట్రుఁడవివేకి అసమర్థుడు. కుమారునికేమియు చెప్పలేకపోయెను. నిరాశాహతుడయి అక్రూరుఁడు వెనుదిరిగెను.

అక్రూరుఁడు సుప్రసిద్ధిగనిన భోజకులీనుడు. నిరంతర శ్రీకృష్ణ చింతనాభిలాషియై మధురనువిడిచి ద్వారకయందు తన నివాసమేర్పఱచుకొనెను. సత్యభామను తనకిచ్చి వివాహము గావింపలేదను కినుకతో శతధన్వుఁడనువాడు ఆమె తండ్రి సత్రాజిత్తును చంపి అతనివద్దనున్న శ్యమంతకమణి నపహరించెను. అయ్యది శ్రీకృష్ణునికి కోపకారణమగుట తెలిసి శతధన్వ డామణిని అక్రూరునొద్ద దాపరికము వెట్టి

తాను దిక్కుబట్టి పారిపోయెను. శ్యమంతకము అనంతమగు మహిమ గలిగిన రత్నము.

ప్రతి దినము వంసినంత పసిండియు ధన ధాన్యములు కురియుచునే యుండును. భగవత్పాద సేవాపరాయణుడు, శ్రీకృష్ణచింతనుండగు అక్రూరున కీ యైహిక భాగ్యము లేల కావలయును. అదియొక పరీక్ష. శ్యమంతకమణి ఇచ్చుచుండిన ధన కనకములను ఆత్మసభోగమున కావంతయయిన దాచుకొనక, అక్రూరు డాసంపద నెల్ల దాన ధర్మములకు క్రతుకార్యములకు దైవపూజలకు వినియోగించి, అర్థుల నెల్లర సంతృప్తిపరచి గురుగోవిప్ర పోషణమున సంతృప్తి పడువాడు. ఒకటి రెండుగాదు ఇట్లుతొంబది రెండేడులు గడచినవి. "దానపతి" యను పే రక్రూరునకు వచ్చినది. అతని వితరణశీలము నలుదిక్కులకు ప్రాకినది.

ఇంతలో నొకయాపదవచ్చిపడినది. ద్వారక ప్రాంతములనున్న భోజ లేదో వైరమున శత్రుఘ్నుండను యాదవుని జంపిరి. ఆవధ భోజ యాదవకులములమధ్య తీవ్ర కలహమును రేపెను. అక్రూరున కా కలహముమధ్య నిలువ అనువుగాక ద్వారకను విడచి దూరమేగెను — అక్రూరుండు లేడు. నిత్యదానములు లేవు. అర్థిపోషణ మడుగంటినది. అన్ని చోటులలోను అశాంతి ప్రబలినది. ప్రజలు సంక్షుభితులైరి. అనావృష్టితోబాటు ఈతి బాధలు సర్వము ఆ ప్రాంతమున పొడగట్టినవి. ఈ జనసంక్షోభము శ్రీకృష్ణ

నకుఁ దెలిసినది - సహజముగ అసాధారణ గౌరవోదారుఁడు మాన్యుఁడయిన అక్రూరుఁడున్నంతదనుక యదుపురమున కేయాపదలును లేవు. ఆ మహనీయునివద్ద అనుదినము సువర్ణ సంపదలొసఁగు శ్యమంతకమణి యుండనోపునని శ్రీకృష్ణుఁడు స్వయముగ నేగి అక్రూరుని మరల ద్వారకకు తోడ్కొని వచ్చుటతో ప్రజలకు మరల సౌఖ్యములన్నియు లభించెను.

ఆనాఁడు దుష్టశిక్షణార్థై భక్తుఁడగు అక్రూరుఁడేగి శ్రీకృష్ణుని మధురకుఁ దోడ్కొనివచ్చెను. ఈనాఁడు శ్రీకృష్ణదేవుఁడే ప్రజల శ్రేయమునకై స్వయముగ నేగి అక్రూరుని ద్వారకకు తీసికొని వచ్చెను. ఆహా! భగవానునికి భక్తునికిగల సామ్యమిదియగాబోలునని ప్రజ లద్భుతంపడిరి.

అక్రూరుఁడు తిరిగి ద్వారక కరుదెంచుటతో ప్రజల సంతోషము మిన్నుముట్టినది. అక్రూరుని సౌజన్యమునకు వితరణశీలమునకుఁదగిన మర్యాద ప్రజాముఖమున జరుగవలయునని శ్రీకృష్ణుని యభిలాష. శ్యమంతకమణి యేమైనది అను సందేహమింకను ప్రజలడెందములం దున్నది. ఆ శంక యుతీర్చవచ్చునను తలంపుతో శ్రీకృష్ణుఁడు తన సభాస్థానము సుధర్మయందు పెద్ద కొలువేర్పాటు గావించి కుల వృద్ధులందఱితోపాటు అక్రూరునిగూడ ఆహ్వానించినాడు.

ఇట్టి సభలు యదుపురమునందరుదుగ జరుగును. మహావిశేష మేదియోయున్నపుడే శ్రీకృష్ణుడు బలభద్రుగూడి దానిని నేర్పాటు జేయును. సభాసదుల హృదయములందలి కుతూహలమునకు మేరలేదు.

శ్రీకృష్ణుం డక్రూరుని దిక్కు-మొగంబై దానపతీ! నీ వితరణప్రశస్తి విశ్వవిదితము. నీ రాకతో ద్వారక మరల సర్వసమృద్ధమైనది - అనుదిన దానోత్సవములు జరుగుచున్నవి- ఇందులకు ద్వారకావాసులేమి ఈ పరిసర ప్రాంతముల జనులెల్లరు శతధా సహస్రధా నీకు కృతజ్ఞులు. కాని ఒక్కమాట ఈ దాన ధర్మముల కెంతయోవ్యయమగును. తరుగులేని ద్రవ్యముగావలెను. నీకిదిసాధ్యమగుటకు శ్యమంతకమణి నీవద్దనుండవలయును. ఈమాట సత్యాసత్యములు ప్రజలెఱుగగోరుచున్నారనియెను. అక్రూరునకు మంచి సమయము లభించినది. తనయొద్దదాచి యుంచబడిన శ్యమంతక మహారత్నమును వెలువరించుటకు అయ్యది అనుక్షణము అతని యొద్దనే యుండును. అక్రూరుడు చేతులు జోడించి, స్వామీ, నీవనినది ముమ్మాటికి సత్యము. నీ యాగ్రహాము నకు భయపడి శతధన్వుడిది నాయొద్దదాచి పారిపోయినాడు. ఇంత శక్తివంతమైన మణిరాజము అల్పుడనయిన నాకేల వలయును ప్రభూ! మీకిది సమర్పించుతరుణ మెప్పుడేతెంచునాయని చూచుచుంటిని. నేడేతెంచిన దట్టి శుభముహూర్తము. ఈ శమంతకమణి నీవద్దనుండవలసిన వస్తువు. ఇదిగో

నీకిది భక్తితో సమర్పించుచున్నాను. నీపాదాబ్జ చింతనము నాకు చాలును. నీ దాసానుదాసుఁడనని అక్రూరుడు తన యాగవస్త్రపు కొంగు ముడివిప్పి ఆ రత్నమును ప్రజలకు చూపునంతలో, ఆ మణికాంతి ప్రభలునిండి అత్యాశ్చర్య కరము అద్భుతముగ సుధర్మాస్థావమంతయు మధ్యందినార్క తేజోవిరాజితమయ్యెను. అక్రూరుఁడా రత్నమును శ్రీకృష్ణు ముందటపెట్టెను.

శ్రీకృష్ణుఁడు, వదనమున మందహాస సుందరకాంతు లొలుక సభనంతయుజూచి, అక్రూరు నానందముతో సంభావించెను. శ్రీకృష్ణుఁ డీరత్నము నెవరి కీ దలంచెనోయని జనులు కుతుకమున నుండిరి. సభ్యశ్రేణి విస్మయమ్మంద శ్రీకృష్ణుఁడారత్నము నెత్తి అక్రూరా! సూర్యదత్తమగు ఈ మహారత్నమునుగైకొన బలభద్రుఁడు, నేను, సత్యభామయు అర్హులము, మఱెవ్వనుగాదు. అయినను దీనినింగైకొను వాంఛ మాకు లేదు. సుజనులచేతనే ధార్యమాణమగు ఈ రత్నము వేఱొండుచోటికిఁ బోరాదు. నియమవర్తనుడవు, నీతిశాలివి, సకలకాలశుచుఁడవు, పరిశుద్ధ భావుఁడవు, నిత్యదానవినోదివగు నీవంటివానివద్దనున్నపుడే ఈ మణి నిజ ప్రభావము జూపును. కాన దీనిని ధరింప నీవయర్హుండవు. దీనినిఁగొని యథాపూర్వము నీ దానధర్మ వ్రతములు నడుపుము అని శ్రీకృష్ణుఁ డారత్నమును మరల అక్రూరునకే యొసఁగెను. శ్రీకృష్ణభగవానుఁడు తన శిరోవీధిని మోపిన

గురుతరభారమో లేక అనుగ్రహించియిచ్చిన బహుమానమో యెఱుంగఁజాలక ఒక్కక్షణ మాలోచించి దేవా! నీ దాసునకిది నీయాజ్ఞ. నా శక్తికొలది ఈ రత్న ప్రభావమున ప్రజాసేవ పాలింతునని రామకృష్ణులకు ప్రణతులర్పించి, సభాసదులకు నమస్కారములు గావించి సంతృప్త హృదయుఁడై ఇంటికేగి మునుపటివలెనే అక్రూరుడు అనుదిన దాన ధర్మాది సద్వర్తనుడై మనియెను. ఆహా, భగవానునికి తన భక్తునియెడల యెంత గౌరవము, యెంత విశ్వాసము అని విబుధులెల్లరు శ్రీకృష్ణాక్రూరులను వినుతించుచు వెడలిరి.

కాశీ నగర రాజాస్థానమున సకల సంపద లనుభవించుచు కాలముగడపు సౌకర్యములున్నను శ్రీకృష్ణునిసేవయే పరమార్ధముగ నెంచిన భక్తశేఖరుడు అక్రూరుడు. శ్రీకృష్ణుని దర్శనమాత్రమున ఆత్మజ్ఞానమునందిన బ్రహ్మభావుడతడు. అనుదినము ధన సంపదలను గుమ్మరించు శ్యమంతకమణి తనయొద్దనున్నను ఆ భోగ భాగ్యములను తనకొఱకు వినియోగింపక ప్రజాశ్రేయమునకే వినియోగించిన నిస్వార్థజీవి అతడు. అక్రూరుని చరిత్రము సర్వకాలముల సర్వప్రజలకు మార్గదర్శకముగనుండు పవిత్రవర్తనము.



# 4. వందనము - సుదాముడు

కం॥ నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును
తాపసమందార నాకు దయసేయఁగదే.

నీకు కావలసినవరము కోరుకొనుమనగా శ్రీకృష్ణుని ముందీకోరిక కోరినవాడు పూవులదండలమ్ముకొని జీవించు సుదాముడను నిరుపేద. అతనికి భోగభాగ్యము లక్కఱలేదు. శ్రీకృష్ణ పాదభక్తి, శ్రీకృష్ణ భక్తులతో చెలిమి, సర్వ భూతదయ ఇవియే సర్వస్వము. ఆహా, ఏ మహాసీంద్రులో యోగులో నుడువవలసినకోర్కె ఈ సామాన్యుని నోటి నుండి వచ్చినది. భక్తిభావము పరమసిద్ధినందిన భాగధేయ మది. శ్రీకృష్ణసుదాముల సమావేశ మొకచిత్రమైన సన్ని వేశము.

కంసుఁడు పాలించు మధురానగరమున వసించు ఒక మాలాకారుఁడు సుదాముఁడు. జీవనోపాధికై పూలు, పూల దండలు అమ్ముకొనుట అతని వృత్తి. కొందఱొనరించిన పూర్వపుణ్యము లట్లుఫలించును. హృదయాభిలాషకుఁదగిన వృత్తికూడ వారి కమరును. రాజాస్థానమునవలయు పుష్ప మాలికలను పుష్పముల నందించుచుండును. కంసుడు

క్రూరుడేయయినను ఆ రాజనగరమునవసించు తనకు మను గడకై పూవుల నా భూపాలునకు ఇచ్చుచుండును.

పుష్పము లెంతమృదువైనవో సుదాముని హృదయ మంతమృదువైనది. పుష్పము లెంతసుందరములో యెంత సురభిళములో సుదాముఁడును అంతటిసుందరభావలలితుడు. తా నమ్మిన పూవులు సత్కార్యములకు వినియోగపడవలె ననియే యతని మనోవాంఛ. దేవకార్యములకు ప్రతిఫలము కోరకయే ఇచ్చును. పూజాదులు జరుగుచోటులకు తాను స్వయముగ బోయి యిచ్చును. తాను చేయగలిగినదిది. ఉదయముననే లేచును. పురపరిసర ప్రాంతములకేగి ఉషస్సుందరములు పూర్ణవికసితములైన పూలను కోసి తీసికొనివచ్చును. పూలుకోసినపుడు పూమొక్క కేమి బాధ కలుగునోయని పరితాపపడును. చిత్ర చిత్ర వర్ణ శోభితములైన పూలను దెచ్చును. అందమైన మాలలుగా కూర్చును. ఏపూవు ఎచ్చటనుండవలెను, ఏవర్ణము ఎచ్చట నుండిన కనులకింపగునో ఈ విషయములన్నియు కడు శ్రద్ధతో తానే చూచుకొనును. పూలను నలగనీయుడు, క్రిందకు తొలఁగనీయుడు, పూవులనినచో పుత్తడి కన్నమి న్నగా భావించు పుష్పహృదయుఁడు సుదాముడు. తీరికకలిగి నపుడెల్ల ఓపికచేసుకొని తాను ప్రతిదినము పూలుకోయు మొక్కలకు స్వచ్ఛమయిన నీరము సమృద్ధిగ పోసివచ్చు చుండును.

వ్రేపల్లెలో నందునింట పెరుగుచున్న బాలకృష్ణుని లీలలు మహిమ దూరదూరములకు ప్రాకినది. మధురాపుర వాసులందఱకు కృష్ణునిగూర్చి తెలియును. కంసుని మనోభావములెట్లున్న నేమి? మధురానగరవాసులందఱకు కృష్ణుఁడనిన అనురాగము. ఆబాలునిచూడవలయుననుఅభిమతము. సుదామునికిగూడ కృష్ణుఁడనిన యెంతయోప్రీతి. ప్రీతికన్న భక్తిభావము మిక్కుటము. వ్రేపల్లెనుండి యెవరైన వచ్చినచో వారివద్దకుపోవును. కృష్ణునిగూర్చి అడుగును, వేయి ప్రశ్నలువేయును. వేసినవానినే మరలవేయును. వినిన విషయములనే మరల వినును. కృష్ణుఁడు ప్రతిదినము గోవులు గోవత్సములు గోపకులతోకలసి వనములకేగునట. మంచి మంచి పూలుకోసికొని తాను వక్షమున గళమున శిరమున అలంకరించుకొనునట. తనతోడిబాలుర కిచ్చునట, లేగదూడలకు పూలమాలల లంకరించునట_యివియే యెక్కువగ సుదాముడువిను కథలు. పూవులనిన ఇంత ప్రేమగల కృష్ణుని మనసెంత మృదువైనదో, కృష్ణుని ఆకారమెంత అందమైనదో ఇవియే సుదాముని తలపులు. శ్రీకృష్ణుఁ డొనరించిన మహితకార్యములు, యెందఱెందరో దుష్టరాక్షసులను మట్టుపెట్టుట, ఈ కథలుగూడ వినవచ్చినవి. శ్రీకృష్ణుఁడు సామాన్య బాలకుఁడుగాఁడు. కేవలము భగవానుఁడే. సుదామునియందు ఇట్లొక అచంచలమైన విశ్వాసమేర్పడినది. శ్రీకృష్ణునే మనసులో మాటిమాటికి తలచుకొని నమ

స్కృతులాచరించును. నిదురపోవునపుడు నిదుర లేచునపుడు శ్రీకృష్ణునే స్మరించును.

ఎప్పుడైన శ్రీకృష్ణుడు మధుర కేతెంచును. తానా మహనీయుని దర్శింపఁగలఁడా. తానిచ్చిన పూలదండల నాతఁడు స్వీకరించునా, స్వీకరించినచో అవి యాతనికి నచ్చునా? ఇవియే సుదాముని యూహాలు. శ్రీకృష్ణుఁడు శ్యామసుందరుఁడట. శిరమున నెమలిపింఛము ఉండునట. ఈ వర్ణముగల పూలదండ అయినచో ఆ బాలునికి అందముగా నుండును. ఈ వర్ణములుగల ఈ చిన్ని చిన్ని పూలు ఈ పెద్ద పెద్ద పూలు ఆ సుకుమారుని గళమున వక్షమున యెంతో సుందరముగ నుండును. సుదాముఁ డనుదినమిట్లే యాలోచించును. ఆ యాలోచనల మరల విమర్శించుకొనును. శ్రీకృష్ణుని పూజించు సమయమున ఏ లోపమురా రాదుసుమా అని తన బుద్ధిని తానే హెచ్చరించును. ఈ భావములతో ఈ ఆశలతో తూగాడిపోవుచున్నది సుదాముని మనసు.

సుదాముని ఆశ లీడేరు సుదినము వచ్చినది. శ్రీకృష్ణుఁడు మధురకు వచ్చుచున్నాఁడట. అక్రూరుఁడప్పుడే శ్రీకృష్ణుని తోడితెచ్చుటకు రథముతో నేగినాఁడు. మఱునాఁడే శ్రీకృష్ణుడు మధురకరుదెంచుట. శ్రీకృష్ణుని ప్రత్యక్షముగ చూచినట్లే సుధాముని చిత్తము పొంగిపోయినది. వివిధములైన పూలు ఏ వర్ణపుపూలు ఏ వాసనగల పూలు

ఎంత పెద్దవి ఎంత చిన్నవి కావలెను. ఈ యోచనలన్నియు ఒకదానివెంబడి మఱియొకటి సుదాముని మనసులో సాగి పోవుచున్నవి. ఆతని తత్తరపాటు అంతకంతకు అధికమగు చున్నది. ఆ బాలగోపాలుఁ డరుదెంచు దారి గాయవలెను. ఆ మహనీయుని పాదాబ్జములకు వందనము లర్పింపవలెను. తనతక్కినపని ఆనాడు మానుకొని యయినసరే శ్రీకృష్ణుని తన ఇంటికి గొంపోయి తృప్తితీర తానెంచి తీసికొనివచ్చిన పూలతో పూజింపవలయును. ఈ సుందరభావములన్నియు ఒక సురభిళపుష్పమాలవలె సుదాముని మనసులో గ్రేలు చున్నవి.

సుదాముఁ డానాడు రాజగృహమునకేగి పూలదండ లీయనేలేదు. తన జీవనస్వామియే వచ్చుచుండగా ఈ రాజు లందఱిగొడవ తనకేల. తన యింటిదారినే శ్రీకృష్ణుఁ డేతెంచు సమాచారము తెలిసినది. ఆ బాలకృష్ణుని దర్శనార్థము జనులతో ఇండ్ల గుమ్మములు గవాక్షములు వాకిండ్లు నిండిపోయినవి. వారి ఆనందమునకు అవధులులేవు. సుదాముఁడట్లే కాచుకొనియున్నాడు.

శ్రీకృష్ణుడు బలరామునితోఁగలసి పురప్రవేశ మొనరించి దారిలో తన్నెదిరించిన రజకుని ఒక పిడిగ్రుద్దుతో గూల్చి ముందుకు సాగినాడు. మొగముల వేయికన్నులు చేసికొని మధురపౌరులా బాలవీరుని తిలకించుచున్నారు.

పూతనను జంపిన చిన్నిబిడ్డ డితడ కే, ఈ విశ్వమోహనుని నోటియందా యశోద విశ్వరునిదర్శనము పొందినది. గోపి కల కను మొఱగి వెన్నలుదొంగిలించు బాలుఁడితడా, గోపి కలతో యమునాపులినముల రాసలీలల మరగిన సురుచిరా కారుఁ డీ సుందరుఁడా, ఆ గోపలీలావతులెంత పుణ్యామూ ర్తులో గదా! ఈముద్దుబిడ్డతో కలసి ఆడి పాడుటకని ఒకరికొ కరు కృష్ణుని కథలు చెప్పుకొనుచున్నంతలో బలరామకృ ష్ణులు రమణీయమూర్తులు విజయాలంకార విభూషితులు దాపునకు రానేవచ్చిరి.

ఉ॥ నందతపఃఫలంబు సుగుణంబులపుంజము గోపకామినీ
బృందము నోముపంట సిరివిందు దయాంబుధి యోగి
బృందముల్
డెందములందుకోరెడు కడింది నిధానము సేరవచ్చె నో
సుందరులార చనిచూతము కన్నులకోర్కె తీరగన్.

అని ఆబాలవృద్ధులు బాలకృష్ణు నాలోకించుటకు గుంపులు గుంపులై యుండిరి.

శ్రీకృష్ణ దర్శనాభిలాషయందే మగ్నమానసుఁడై తాదాత్మ్యమంది పరవశతనున్న సుదాముఁడొక్కయంగలో ముందునకు దూకి రామకృష్ణుల పాదములపైఁబడి వందన మాచరించినాడు. చేయెత్తి మ్రొక్కినాడు. శ్రీకృష్ణుఁ డాతని లేవనెత్తి అతనితోబాటు అతని యింటికేగినాడు. సుదాముని మనోనిలయములో నెలవున్న శ్రీకృష్ణుఁడాతని

గృహమునకే ప్రత్యక్షముగా విచ్చేసినాఁడు. భక్తులహృదయము లెఱిగిన కరుణాళుఁడా భగవానుఁడు- సుదాముడు మరల మరల మ్రొక్కును. అర్ఘ్యపాద్యము లిచ్చును. తానేర్చికూర్చిన పూలదండలతో వారి నలంకరించును. పాదములపై ఆనందబాష్పముల వర్షించును. ఆ పాదమస్తకము చూచిన కృష్ణునే మరలచూచును. చేసినవందనమే మరలచేయును. కుసుమగంధములదారి నలంకరించిన అలంకారములే మరల నొనర్చును- కొంతవడికి సుదాముని పెదవులునుండి మాటలు వెలువడినవి-

ఉ॥ పావనమయ్యె నాకులము పండె దపంబు గృహంబు లక్ష్మికిన్
సేవితమయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిదానమూర్తులై
భూవలయంబుగావ నిటపుట్టినమీరలు రాకజేసి నే
నేవిధమాచరింతు పనులెయ్యవి బంట నెఱుంగ జెప్పరే.

యని కై మోడ్పులతో వేడినాడు- తా నానాడు ఏరితెచ్చిన పూవులకు పరిపూర్ణ వినియోగము లభించినది - శ్రీకృష్ణుడను గ్రహముతో సుదాముని సేవలస్వీకరించి, సుదామా! నీకు కావలసినదేమిద్యైనను కోరుకొనుమని స్పష్టముగా చెప్పినాడు - సాక్షాత్ భగవత్ స్వరూపముల చరణములంటి వందన మాచరించి వారికరుణకు పాత్రుఁడైన భక్తుని కేమి కావలెను - ధన ధాన్యములా, భోగభాగ్యములా, సువర్ణ సంపదలా, ఇవియన్నియు ఆ పురాణపురుషుని కృపాకటాక్ష

లవమునకైనను చాలవు. శ్రీకృష్ణుని దివ్యదర్శనముతో సుదాముని భక్తిభావము ఫలసిద్ధికి వచ్చినది - అతని మనో బుద్ధులు యోగిపుంగవులందాకొనలేని పరువమునందుకొన్నవి - స్వామీ! నీయనుగ్రహామునుపొంది ధన్యుడనైతిని, నాకలలు నిజమైనవి, నా పూలదండలకు సద్వినియోగము లభించినది- నీపాదసేవ నినుపూజించు భక్తులతో స్నేహము యెల్లపుడు నే నందఱియెడలను సహృదయుఁడనై యుండుట చాలును-

కం॥ నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును
తాపసమందార నాకు దయసేయగదే.

అని సుదాముడు మరల ముకుళితకరములతో బలరామ కృష్ణుల చరణముల వ్రాలినాడు. ఆ దివ్యానుభూతిలో సుదామునికి సర్వము ఈశ్వరమయమే. శ్రీకృష్ణుడు సుదాముని జూచి, నీ కోర్కెలీడేరును. సుదామా! నీవు బలాయుః కాంతి కీర్తులతో వర్ధిల్లగలవని దీవించి, బలరాముని జూచి, అన్నా! ప్రధానకుటిజుడు కాకపోయిననేమి ఈ సుదాముని చిత్తశుద్ధియు భక్తిభావము మనఃపరిపాకము యెంత ఉన్నతమైనవో చూడుము. పరమయోగులకైనను మార్గదర్శకమైన పవిత్రభావములని యనిచెప్పి వెలుపలికేగెను-

సుదాముఁ డొక నిరుపేదమానిసియని శ్రీకృష్ణుఁడు నిరాదరింపలేదు. విశ్వాత్మకుడైన పరమేశ్వరున కఖిల భూతములు సమానమేకదా ! సుదాముడు కోరినవెంటనే ఆతని పూరింటి కతిథియై యేగినాడు. భక్తులముందు భగవానుఁ డెప్పుడును వినయుఁడే. ఏ వ్యక్తికైనను సమాజ గౌరవము లభింపఁజేయునది వినయమేగదా! సమయము వచ్చినది సుదాముఁడు సర్వసంపదలను వరములుగా బడయవచ్చును. కాని యాతఁడు వాంఛించినది శ్రీకృష్ణ పాదభక్తి సాధుజనులతో స్నేహము సర్వభూతదయ. ఇవి యలవడినచో చిత్తమునకు శాంతి సౌఖ్యములు తమంతవచ్చునని ఆ మాలాకారుని విశ్వాసము. ఇట్టి ఆదర్శవర్తనము నిజముగ చిత్తశుద్ధిగల తపస్సిద్ధి.



# 5. అర్చనము - అంబరీషుడు

శా॥ సప్తద్వీపవిశాలభూభరము దోః స్తంభంబునంబూని సం
ప్రాప్త శ్రీయుతుఁడై మహావిభవసంపచ్చాతురింగల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనలమేరం గాలముం
బుచ్చుచున్
సుప్తింబొందకయొప్పె సద్గుణగరిష్ఠుం డంబరీషుండిలన్.

ఒక ప్రక్క సప్త ద్వీప విశాలమైన సర్వభూమండల ప్రజలకెట్టి లోపము రాకీయని ధర్మపరిపాలనము, వేఱొక ప్రక్క శ్రీహరియే సర్వశరణ్యమని నమ్మి నిరంతర హరి పదార్చనము నిష్ఠతోడను నియమముతోడను నెఱపిన మహాత్ముడు అంబరీషుఁడు. ఈ మహారాజు హరిభక్తియెదుట జగదప్రతిహతమగు బ్రాహ్మణ శాపముగూడ నిరర్థకమై వ్యర్థమయ్యెను. ధర్మపాలకులుగ లోకమున సుప్రసిద్ధి గనినవారు సూర్యవంశపు రాజులు. ఇక్ష్వాకు, మాంధాత మున్నగువా రీవంశీయులే. ఇట్టిసత్కులమున నాభాగుఁడను మహారాజునకు పుత్రుడై అయోధ్యనుండి భూచక్రమేలిన చక్రవర్తి అంబరీషుడు. ఈ ఇక్ష్వాకు వంశమున ప్రసిద్ధులైన రఘువు అజుడు దశరథుడు శ్రీరాముడు మున్నగువారు అంబరీషుని తరువాత ధరణినేలిన సూర్యవంశీయులు-

జగత్ప్రసిద్ధిఁగనిన సద్వంశజననమునకుఁ దోడు సంపూర్ణ విశ్వాసముతో సంతత విష్ణుపూజాచరణ మీ

మహారాజున కలవడుట పదాఱువన్నె మేలిమి బంగారునకు మధురసౌరభ మబ్బినట్లున్నది. అనంతమైన సామ్రాజ్యము, అప్రతిహతమగు అధికారము, అరిభీకరములగు బలసాహసములు, అమరేంద్రుని తిరస్కరింపఁజాలు అగణిత భోగ భాగ్యములు. ఇన్ని మహావైభవములున్నను ఈ మహానీయుని చిత్తమెప్పుడును శ్రీహరి పాదములందే. కరములు విష్ణుమందిర సేవలయందు, భాషణములు హరికీర్తనమందు, వీనులు హరికథా శ్రవణమందు, చూపులు శ్రీహరిరూపమందు, శిరము హరి నమస్కారములందు, కాళ్ళు హరి నిలయముల కేగుటయందు, కోరికలన్నియుహరిపదసేవలయందు. ఇట్లు తన నిత్యకార్యక్రమములెల్ల హరిచింతనమునందే గడపుచు వైష్ణవార్చనమునకే తనజీవితమంకితమొనరించినపరమ భాగవతు డంబరీషుడు - మహారాజభోగములున్నవి. కాని అంబరీషునకు కావలసినది ఆత్మోద్ధరణము, ఆధ్యాత్మికానందము, నిరంతరతపోనిమగ్నులకలవడని హరిపదార్చనయందు తాదాత్మ్యము. అతని తపస్సు ఫలించి ఇవి పుష్కలముగ ఆ నరపాలునికి లభించినది-

ప్రజాక్షేమమున కెట్టి అంతరాయములులేవు. వర్ణాశ్రమ ధర్మములు సక్రమముగ ఆచరింపఁబడుచున్నవి. గోవిప్రమునికులమునకు తగిన రక్షణయున్నది. సామ్రాజ్య పాలన విధ్యుక్తముగ సాగుచున్నది - ఆ పుణ్యావర్తనుని

చిత్తము ఈశ్వరాయత్తమైనది. ఐహిక వ్యాసంగములందు కాంక్ష క్రమముగ నశించినది - సరస్వతీ నదీతటమున కేగి తత్పుణ్య ప్రదేశమున యాగశాలలు యథావిధిగ నేర్పఱచి వశిష్ఠ వామదేవాది కులగురువులను మునిపుంగవుల దీవించి అశ్వమేధ యజ్ఞము లనేకములు గావించినాడు - పవిత్ర హవ్యములతో దేవతలెల్లరు తృప్తులయిరి. విస్తృత దాన ధర్మములతో ప్రజలన్నివర్గములవారు తృప్తి నందిరి. క్రతు నిర్వాహమున కేతెంచిన మునులు విప్రులు పూజలంది ముదితులైరి - ఆ రాజర్షి ఇట్లు సర్వకార్యములు హరిపర ములుగా నొనరించుచు, ఐహికాపేక్షలు త్యజించి, ఒకనా డేకాంతమున హరిపద ధ్యానమగ్నుడై యున్న తరుణమున భక్తవత్సలుడగు పద్మాక్షుడు డాచతపసి భక్తపార వశ్యమునకలరి ఓరాజవర్యా! నిన్నెల్లవేళలను ఈయది రక్షించుచుండునని యాశీర్వదించి ఒక చక్రము నిచ్చి చనెను.

ఆ॥వె॥ అతని కీహమానె హరులందు కరులందు
ధనములందు కేళివనములందు
పుత్రులందు బంధుమిత్రులయందును
పురమునందు నంతిపురమునందు.

ఇట్లు సకలసంగ పరిత్యాగి యయిన ఆ కర్మయోగి కేమి కావలెను. ఈశ్వరార్చనమే యామహనీయుని నిత్యాను

ష్ఠానము, అనుదినార్చనలిట్లుండ, అంబరీషుడు అనురూపగుణాఢ్యయు అమలవర్తనయునగు తన అర్ధాంగితో కూడి కాళిందీతటమున విధ్యుక్తముగ ద్వాదశీ వ్రతము నారంభించెను. పూజానిర్దిష్టమగు వత్సరకాల మా పుణ్య వ్రతము సంపూర్ణముగా సాగినది. శరదృతువేతెంచినది. కార్తీకమాసపు వెన్నెలలో నలుదెసల రాత్రివేళల వెలుగులార బోయుచున్నవి. కాళింది నిర్మల జలములు ఇరుగట్ల నొరసిపారుచున్నవి. స్వచ్ఛకౌముదివలె మాధవార్చనమున మఱింత నిర్మలమైన అంబరీషుని మనస్సు భాసిల్లినది– వ్రతోద్యాపనోత్సవదిన మేతెంచినది. మహావైభవముగా సర్వసంతృప్తికరముగ, సంతోషప్రదముగ జరుపవలెనని అంబరీషుని అభిలాష– ఆ దినము దినమెల్ల వ్రతకార్యములే, కేశవార్చనలే, దాన ధర్మములే, హరికీర్తనములే. విష్ణుపద పూజాఫలమగు ఒకవిశిష్టతేజ మా యంబరీషునిలో వెలుగులీనుచున్నవి. ఆ తేజః పుంజముముందు యెట్టి అపకృతియు అనుచితమును నిలువఁజాలని మహిమరూప మది–

వ్రతఫలము నందుటకు నియమయుక్తమగు ద్వాదశి పారణము చేయవలెను. అంబరీషుఁడు తన నిత్యానుష్ఠానములు నిర్వర్తించి, హరిపూజనము జరిపి, గోవిప్రపూజలు గావించి అమలసువర్ణశృంగములు అక్షీణ క్షీరపూర్ణములు, వత్సాన్వితములునగు అసంఖ్యాకములగు గోవులను బ్రాహ్మ

ణులకు దానమొనర్చి షడ్రసోపేత భోజనములచే వారికి పరితృప్తి గావించి ఆ పుణ్యపురుషుల యనుమతితో వ్రత ప్రసాదము ద్వాదశిపారణము చేయుట కేగుచున్నంతలో ఋషిపుంగవుఁడు దూర్వాసుఁ డతిథియై యేతెంచినాడు— అంబరీషుని యానందమునకు మేర లేదు. తలవనితలంపుగా పరమపూజ్యుడయిన తాపసవరుడు ఆ పర్వదినమున తన కతిథిగా చనుదెంచినాడు. ఇంతకన్నను భాగ్యమేమి వల యును. అర్ఘ్యపాద్యాదులిచ్చి ఆసనమొసగి అర్చనలుజరిపి భోజనమునకు లెండని యాహ్వానించినాడు.

"రాజా! ఒకక్షణమాగుము, నదీజలములస్నానమొన రించి ఇచ్చటున్నట్లు వచ్చెదను. నా భోజనమగువరకు నీవును ఆగు"మని చెప్పి దూర్వాసుఁడు వెడలెను. మహా ప్రసాదమని యా మునిని స్నానమునకు సాగనంపి అంబ రీషుఁడా యతివరునిరాకకై యెదురు తెన్నులు చూచు చున్నాడు — గడియ లొక్కొక్కటి గడచిపోవుచున్నవి. స్నానమొనరించి వెనుకకు వచ్చుటకు యెంత సమయము కావలెను? పది పదునైదు నిముషములలో రావచ్చును. కాని యీ కమండలుధారి కదలువచ్చు జాడ లేదు. మధ్యా హ్నము కావచ్చినది— మాటిమాటికా ఋషికై బాటలు చూచిన ప్రభుసత్తమున కాత్మలో ఆందోళన అధికమైనది. ద్వాదశి మఱికొన్ని క్షణములలో దాటును. ఈశ్వరార్చన ప్రసాదము సకాలములో ద్వాదశిపారణగ గ్రహింపకుండు

టయూ, భగవానునియెడల యింత అపచారమూ - అచట ఆసీనులయి వున్న యతీంద్రులను జేరి అంబరీషుఁడంజలి బద్ధుడై ప్రార్థించినాడు.

ఆర్యులారా! మీరు ధర్మవిధులు, కర్మాకర్మ విచక్షణులు. ద్వాదశికాలము మీరుచున్నది- దూర్వాసముని అతిథియైవచ్చి స్నానమునకేగి యెంత ఆలస్యమైనను తిరిగి వచ్చుటలేదు. వ్రతభంగముకానివిధము సెలవీయుఁడయ్యా యని వినయుడై విన్నవించినాడు. ఆ మహారాజు వచనముల నాలించిన మునులకు మనస్సులందు దూర్వాసముని వర్తన మనుచితమనిపించినది. నిరంతర హరిచరణార్చనాపరతంత్రుడు ధర్మపరిపాలకుఁడగు అంబరీషునివంటి నరపాలునకా తాను నిశ్చలభక్తితో నొనరించిన ద్వాదశీవ్రత పారణాము భంగమగుట కారాదు, కారాదు, అది క్రమవిరుద్ధము ధర్మనిరాసము ఆ మహాముని లేకకంఠముగ-

ఆ॥వె॥ అతిథిపోయి రామి అధిప! యీద్వాదశి
పారణంబు మానఁ బాడిగాదు
కుడుచుటయునుగాదు, కుడువకుంటయుగాదు
సలిలభక్షణమ్మ సమ్మతమ్మ.

అని ధర్మసందేహ నిర్వృత్తిజేసిన యతీంద్రుల యానతి శిరసావహించి వారికిమ్రొక్కి అంబరీషుడు నిశ్చల చిత్తమ్మనసీరజాక్షుని నిలిపి, ద్వాదశీవ్రత ప్రసాదతీర్థము

నొకింత సేవించి తనవ్రతదీక్ష సక్రమముగ సంపూర్తియయి నందులకు శ్రీహరిని వినుతించుచున్నంతలో—

స్నానమున కేగిన దుర్వాససంయమిచనుదెంచి అంబరీషునిచే సేవితుఁడై, యా రాజు చేసిన పనిని బుద్ధినూహించి ఒక్కత్రుటిలో ఆగ్రహావేశుఁడై, ఔరా! అంబరీషా! మహారాజునని నీకు గర్వమెంత ప్రబలినది – మునివరులను గూడ కన్నుగాన కుంటివి. నన్ను స్నానమునకుఁ బొమ్మని చెప్పి. వినయమునటించి నేను వచ్చునంతదనుక ఒక నిముసమాగక నీవు మునుముందు సలిలపానమొనర్చి నన్నిట్టులవమానింతువా. నీ యపరాధము మునిలోకమునకే అపచారము. పరమశివుఁడయినను అడ్డుపలుకని నా యెడలనా, నీ దురహంకారము. నిన్నంత మొందించినగాని నా స్వాంతము శాంతింపదు. హరిగాదు గిరిగాదు యెవ్వరడ్డ మేతెంతురో చూతునుగాకఅని చిందులు త్రొక్కినాడు—

తనపరిస్థితులు విన్నవించుకొనుట కంబరీషుని కవకాశమే యీయలేదు. అచటనున్న మునులందరు దుర్వాసుని ఆగ్రహాబలమెఱిగినవారు గాన భయభ్రాంతులై యూరక చూచుచుండిరి.

దుర్వాసునికి మేనదరినది – పండ్లు పట పట లాడుచున్నవి. బొమముడిసుడివడుచున్నది. వక్త్రిలమునుండిహుంకారములు వెలువడుచున్నవి. కోపోద్రేకమున ఆపాదమస్త

కము భీకరాకారమైనది. తన శిరోజములనుండి ఒక జటను మొదలంటపెరికి మంత్రించి కృత్యయను ఒక మహాశక్తిగా ప్రాదుర్భవింపజేసి సర్వాయుధ సమన్వితగా నొనర్చి ఈ దురహంకారుని ఈ దుష్కర్ముని ఈ ధర్మఘాతుకుని ఈ గర్వోన్మత్తుని అంబరీషుని హతమార్చుమని ఆరాజుపై కాళశక్తిని కవ్వించి పంపినాడు. యెంత ఘోరము! యెంత ఘోరము! అని అచటివారెల్లరు భీతిల్లి వణకిపోవుచుండిరి. అంబరీషు నంతటిజ్ఞాని భక్తుడు ప్రజాక్షేమ మెరిగిన జనపతి, క్షణములో ఆభయంకరశక్తియొక్క అగ్నిశిఖాజ్వాలలకాహుతి కావలసియున్నది. దిక్కులు సంక్షుబ్ధమైనవి. వాయువీచికలు స్తంభించినవి. దుర్వాసుని వదనమున నొక వికృత క్రూర హాసోన్మిషితరేఖ తాండవించుచున్నది. తన శక్తిసామర్థ్యములు చూపింపఁబోవుచున్నాడు ఆ ఋషి.

ప్రశాంతచిత్తుఁడు అంబరీషున కావంతయు భయభావములేదు_ సంతోషముగ ఆతిథ్యము గ్రహింపవలసినచోట ఆగ్రహోన్మత్తుఁడైన దుర్వాసుని దుశ్చర్య కాశ్చర్యపడినాడు. తనకు కోపమురాదు. ఆ సాత్త్వికగుణాభిరామునకు కోపించుటకును ఆవశ్యకతలేదు. తనవద్ద హరి యొసంగిన రక్షాచక్రమున్నది. దానిని ప్రయోగించు ప్రయత్నములేదు. మఱుక్షణములో ఆ శక్తినుండివచ్చు పెనుమంటలలో దగ్ధమగుటకే సిద్ధమగుచున్నాడు. కాని తన సర్వస్వము ఆ

పరమాత్ముని, ఆ జగద్రక్షకుని, ఆ భక్తవత్సలుని ఆ ఆపన్నశరణ్యుని ఆ ధర్మపరిపాలకుని అచంచల విశ్వాసముతో ఆత్మయందు నిలిపి, శ్రీహరీ ! నేను నిరపరాధిని నీ దాసుఁడను ఈ యగ్నిపరీక్షలో నన్నే మియొనర్చిననుసరే నీ ఇష్టము అని నిమీలితనేత్రుఁడై ధ్యానముద్రాంకితుఁడయినాడు. ఏ మహాగ్నులుదరిఁజేరలేని ఒకయాధ్యాత్మిక తేజమంబరీషునిలో వెలుఁగుచున్నది.

తనభక్తులనెప్పుడెట్లు రక్షించుకొనవలయునో సర్వ జగత్సాక్షియయిన జగన్నాధుఁడెఱుగును. అదియొక విరతిలేని విశ్వదర్శనము — ఒకలిప్త, ఒకత్రుటి, ఏమిజరుగఁబోవుచున్నదోయని ద్వాదశీవ్రతయాగమంటపమందున్న యందఱి కనులు అన్నిదిక్కులవైపు చూచుచున్నవి — అంబరీషుని ఆత్మవేదన నచ్యుతుఁడాలించినాడు. ఒకకరుణామృతరేఖ వైకుంఠమునుండి ఆ వసుధాధిపునిపై సోకినది— అంబరము నుండి అవనీగర్భమువరకు పెళ్లున ప్రీలిప్రేలినట్లయి ఒక చక్రము దుర్నిరీక్ష్యరయతేజములతో పరిభ్రమించుచు ధగ ధగాయతముగవచ్చి కృత్యకుఅడ్డుపడినిలచినది. విశ్వవిక్రాంత మగు ఆ చక్రవేగమునకే ఆ దుష్టశక్తిదగ్ధమై భస్మీభూత మైనది — అంతటితో ఆ చక్రమునకు తనివి జనింపలేదు— హరిభక్తుడగు అంబరీషు నకారణముగ అంతమొందించుటకు హేతుభూతుఁడైన దుర్వాసునిపై తిరిగినది. ఆ దుర్వార చక్రోద్ధతికి దుర్వాసురునికనులు తిరిగిపోయినవి. ముచ్చెమ

టలుపోసినవి. కాలుసేతులు వణకుచున్నవి. గుండెలు కొట్టుకొనుచున్నవి. వచ్చుచున్నది, వచ్చినది, మీదపడ బోవుచున్నది. ఆ వహ్నికీలాభీలా చక్రమున కడ్డులేదు— శిఖిశిఖాజ్వాలనోగ్రమైన దావానలమువలె తన్నావరించు చున్నది. దుర్వాసుడు వెఱ్ఱివానివలె నలుదిక్కులు చూచి నాడు. ఆతనినాదుకొనువారు లేరు. తనమంత్రశక్తియు తపో బలమేమైపోయినదో ఆ మునికే తెలియదు — దండకమండ లువు లచటజారవిడచి పరుగెత్తిపోయినాడు — ఆ చక్ర మాతని వెంటాడ నారంభించినది—

ఆ యాగమంటపమున ప్రళయమునుండి బయటపడి నట్లొక ప్రశాంతవాతావరణము సుప్రసన్నముగ ప్రకాశ మానమైనది. అంబరీషుడట్లే తనధ్యానముద్రలోనున్నాడు— ఆ చక్రమెచ్చటిది, ఆ శక్తియేమైనది, దుర్వాసునిశాపబల మేమైనది— దుర్వాసుడు కనుపింపడే. అచటనున్నవారికా సంఘటనక్రమ మంతుపట్టలేదు— అద్భుతాశ్చర్యమగ్నులై యెటనున్నవారటనే ఉండిపోయిరి.

వెనుకకు చూచును. దుర్వాసుడు ముందునకు పర్వె త్తును. చక్రమడ్డుదగులును. ప్రక్కలకు దుర్వాసుడు తప్పు కొనబోవును. అచటను చక్రమే. కుంభించి పై కెగురబో వును. పటుక్కున తలకేదియో తగులును— యెచటచోటు దొరకిన అచటకు దుర్వాసుడు పరుగెత్తును. వానివెంటనే

చక్రమువచ్చి మీదపడుచుండును. ఆ చక్రమున కొక్కటే గతి— దానిని తప్పించుకొనుటకై దుర్వాసుడు—

మ॥ భువిదూరన్ భువిదూరు నబ్ధిఁజొర నబ్ధుల్ సొచ్చు నుద్వేగియై
దివిఁబ్రాకన్ దివిఁబ్రాకు దిక్కులకుఁబో దిగ్వీథులంబోవు జి
క్కివెసంగ్రుంగిన గ్రుంగు నిల్వ నిలుచుం గ్రేడింపఁ గ్రేడించు నో
క్కవడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్యదుర్వక్రమై.

దుర్వాసుని ఒకఆటబొమ్మజేసి ఆ చక్రమాడించుచున్నది.

దుర్వాసుఁడెటు తప్పించుకొనిపోవఁజూచిన యచటికే వెంటాడి తరుముచున్న దాచక్రము. ఆ చక్రము పద్ధతియే వింతగానున్నది— ముందునకు త్రోయును, వెనుకకు నెట్టును, ప్రక్కలకు పడగొట్టును, అంతియేగాని ఒక్కసారిగా దుర్వాసుని పట్టుకొని మట్టుపెట్టదు. అట్టు చేసినచో పరిపూర్ణమైన ప్రయోజనములేదని కాబోలును. హరిభక్తున కెదురుతిరిగినాడు, హరిచరణార్చనకు విలువలేకుండ చేయసంకల్పించినాడు, దుర్వాసుని యపకృతి యతనికే తెలిసిరావలయును. దుర్వాసుని కీలుబొమ్మవలెచేసి వెంటబడి తరుముచున్న దాచక్రము— ఊపిరిసలుపక మరి తప్పించుకొని పరువిడుట కోపికలేక ఉక్కిరిబిక్కిరియగుచున్నాడు

దూర్వాసుఁడు - భూనభోంతరములలో తనకు రక్షణనిచ్చు ప్రదేశమే కనుపించ లేదాయెనికి-

బ్రహ్మలోకమున కేగి బ్రహ్మపాదము లంటినాడు. తనను వెంటాడి తరుము చక్రమునుచూపి పాహి! పాహి! మాం అని ప్రార్థించినాడా దుర్వాసుడు- నేనేమియు చేయ లేను మునీ! అని వనజభవుఁడావలి కేగెను- కైలాసమున కేగి కాలకంఠుని కాళ్ళమీఁదబడినాడు. వెనుకనుండి మీఁదబడఁ బోవుచున్న చక్రమునుజూపి రక్షింపుము! రక్షింపుము! అని వాపోయినాడు. ఇందు నేను కలుగఁజేసుకొని చేయు కార్య మేమియును లేదు. దుర్వాసా! నీవు వైకుంఠమున కేగి నారా యణునే వేడుము. ఏదేనొక దారిజూపఁగల దైవమాతఁడు అని పరమశివుఁడు దుర్వాసురుని పంపివేసెను- వైకుంఠ పురము నందొక కేళీవనమున భర్మమణి సౌధ వేదికాతల మున శ్రీ రమాదేవి సరస సంభాషణలవినుచు వినోదించు చున్న భక్తరక్షణ కళానందమనసుఁడగు శ్రీహరికడకు దుర్వాసుఁడేగి పాదములమీఁదఁబడి మరిలేవక కాలువలుగా కన్నీరు గార్చుచు, శ్రీహరీ, దేవాదిదేవా, భక్తవత్సలా, వరదా, నీ మహిమ మెఱుఁగలేక నీదాసున కగ్గోనరించితిని. జగన్నాథా! నా నేరమును సైరింపుము. ఈ చక్రానల జ్వాలలు నన్ను దహించుచున్నవి. నన్ను క్షమింపుము-

నాయజ్ఞానము తొలగినది– నాకిక నీవేశరణ్యమని విలపించు దుర్వాసునిపై శ్రీహరి కరుణించి ఇట్లనెను–

మునీంద్రా! నా భక్తులు, నా కతిప్రియులు, నా హృదయము వారియందే యుండును. గోవు వెంటఁబోవు గోవత్సముఁవలె నా మనస్సు భక్తుఁడెచటనున్న యచటి కేగును. నిజదారసుతాదులను సంపదలనువిడచి నన్నే ఆశ్రయముఁపొందు భక్తులను నిరంతరమంటిపెట్టుకునేయుందును– మా హృదయమార్గములనన్యోన్యము మేమేయెఱుగగలము. తపము విద్యవిప్రవరులకు ముక్తిప్రదములై ముదమునిచ్చును. దుర్జనులకివియే కంకటములై బాధించును. నా తేజము ప్రకాశించు సాధువర్తనులకు బాధలుగల్పింపఁ జూచువారిట్లే యాపదల పాలగుదురు. దుర్వాసా, నీ కిపుడభయమీయ గలిగినది ఆ సాధుపురుషుడంబరీషుడేయని వెనుకకంపెను. దుర్వాసునకు మతితోచనిస్థితి యేర్పడినది. ఏమహానీయునిపై దురహంకారమున కాలుద్రువ్వి కడముట్టఁజేయ సంకల్పించి నాడో తిరిగివచ్చి ఆ యంబరీషుని పాదకమలపైఁబడినాడు. కన్నీరు గార్చినాడు. రాజేంద్రా! హరిభక్తవరేణ్యా, నన్నీ చక్రమునుండి రక్షింపుము. నన్ను నలువురిమధ్య బ్రతుక నిమ్ము. నీకరుణకై వేచియున్నానుఅని ఆ మహీవల్లభు పాదములు విడువక విలపించు ఋషినిగాంచి, అంబరీషుఁడాశ్చర్య పడి, చేతులు జోడించి ఆ విష్ణుచక్రము దెసవీక్షించి ఇట్లు వినుతింపసాగెను–

"సాక్షాత్ సారసాక్షునిహస్తమునవిలసిల్లు ఆయుధరాజమా నిన్నేమని సన్నుతింపఁగలను. పంచభూతములందున్న శక్తిసామర్థ్యములు తేజఃపుంజములు నీయవియే. దురంతులైన దైత్యులెందఱో నీ నిశితధారలకు మడిసిరి. సాధుజనులెందఱో నీ మహిమవలన సురక్షితులయిరి. నీ రణోద్ధతికడలిదుర్నీతులు పలుపంచలపరువిడితలలుదాచుకొనుచున్నారు. మా మనస్సులెప్పుడు నీయందేలగ్నమైయుండును. ఈ మునీంద్రుని దుర్వాసునిదుస్థితి దయనీయమైనది. ఇంతవఱకే శిక్షచాలు. నావలనగదా నీకింతశ్రమ వచ్చినది. నన్ను సైరించి, కరుణించి, ఈ దుర్వాసునిక వదలిపెట్టుము అనగానే చక్రము తననిర్వక్ర విక్రమోగ్ర వహ్నిజ్వాలా విక్రాంతులు త్యజించి ప్రసన్న ప్రశాంత తేజమ్మున ఆ మునినివిడచి వైకుంఠమున కరిగెను.

అంబరీషుఁడత్యాదరమున ఆ మునీంద్రుని లేవనెత్తి ధూళిధూసరితమైన అతని మేను శుభ్రమొనర్చి, మూలనుబడియున్న యాతని దండకమండలు లాతని చేతులకిచ్చి, తదంఘ్రులంటి మునీంద్రా, చాలా అలసియున్నావు అని షడ్రసోపేతమగు భోజనము విందుఁగూర్చి తృప్తుని జేసి సుఖాసనమిచ్చి శీతలోపచారముల వింజామరల వీవసాగెను. అంబరీషుని భక్తికి వినయమున కాముని యాశ్చర్యపడెను. తానుచేసినపనికి తానే సిగ్గుపడి నోటమాటలేక కొంత తడవట్లేయుండి తుదకు-

రాజేంద్రా నీవర్తన మతిపవిత్రమైన దయ్యా. ఏ దేవుని నామస్మరణ మాత్రమున సకలాఘములు నశించి శుభము లొదవునో ఆ దేవదేవు నర్చించు మహాభక్తుడవు. నిన్ను బోలు సాధుజనుల కేయాతంకములు గలుగవు. నా తప్పును సయిరించి నన్ను సదయుఁడై సంరక్షించి సత్కృతు లొనరించి మహోత్తమగుణుఁడవు నీవు. నీకు సర్వవేళలందును శుభములే కల్గునుగాక. త్రిభువనములందును నీకీర్తి స్వచ్ఛమై వ్యాపించును. నీ ధర్మగుణము సర్వజనులకు మార్గదర్శకము. నీయింటతనివితీర భుజించితిని. నీమహిమ గ్రహించితిని,

శా॥ కంటిన్ నేటికి నిన్ను నీవచనముల్ కర్ణద్వయిన్ బ్రీతిగా
వింటిన్ అన్నముగొంటి నీగృహమునన్ వేడ్కన్ ఫలంబబ్బె నే
మంటింబోయెద నీచరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
మింటన్ మేదిని సన్నుతింపఁగల రీమీదన్ నరేంద్రాగ్రణీ.

అని శుభంబుపల్కి దుర్వాసుడు మరలి బ్రహ్మలోకంబునకు జనెను. ఆ మునీంద్రుఁడు భుజింపమిగిలిన పవిత్రంబైన యాహారముగుడిచి అంబరీషుఁ డచటివారలకెల్ల నమస్కృతులుసలిపి దక్షిణ తాంబూలాదులు బహుమాన సంయుత

ముగనిచ్చి వీడ్కొలిపి తన ద్వాదశీవ్రత కార్యక్రమము విధ్యుక్తముగ పూర్తి నొందించెను.

హరిచరణపూజాతత్పరులగువారికి తక్కుంగల సౌఖ్యములెల్లను బంధములే. తనయుల రావించి ధర్మపద్ధతుల బోధించి ధరణీభారము వారిభుజస్కంధములనునిచి అంబరీషుడు హరిధ్యాన తపోనియమానుష్ఠాననిష్ఠుండై యడవులందు శేషకాలమును గడపుచు తుదకు పరమపద మధిష్టించెను.

అంబరీషుని ద్వాదశివ్రతముం జూడవచ్చిన యనని జనులకెల్లరకు ఆ మహామహిముని చరిత మత్యద్భుతముగా గోచరించినది - భగవానుడెప్పుడును తన భక్తులవెనుకనే యుండి గాపాడుచుండునను సత్యము గ్రహించి, అంబరీషో పాఖ్యానమును మరల మరల తమలో తాము చెప్పుకొనుచు గృహములకేగిరి.

దురహంకారులు, దుష్టవర్తనులు తాము త్రవ్వుకొనిన గోతియందు తామే పడుదురనిన సామెతకు దుర్వాసుని కథ ఒక నిదర్శనము.

అంబరీషుడు అంబుజాక్షుని భక్తశేఖరులలో అగ్రశ్రేణికి చెందిన పరమభాగవతుడనినది లోకవిదితము. అంతటి భక్తుడై, అఖిలావనీ సామ్రాజ్యమేలు ఆ మహాపురుషుని

వర్తనము సాధుత్వమునకవధి, తనకపచారము చేయనెంచిన దుర్వాసుని హృదయపూర్వకముగ ప్రేమించి సేవించి పూజించినాడు. ఆ రాజఋషి మనస్సున సర్వజనులు భగవదనుగ్రహమున సుఖశాంతులతో నుండవలయుననిన ఆశయమే సర్వకార్యములకుమూలమై భాసించినది. జగత్పూజ్యుఁడైన సద్వర్తనుఁడు భక్తాగ్రణి అంబరీషుఁడు.



# 6. సేవ - యశోదానందులు

మ॥ గతజన్మంబుల నేమినోఁచితిమొ యాగశ్రేణులేమేమిసే
సితిమో, యెవ్వరికేమివెట్టితిమొ యేచింతారతిం
బ్రొద్దుపు
చ్చితిమో సత్యములేమివల్కితిమొ యేసిద్ధ
ప్రదేశంబుఁ ద్రొ
క్కితిమో యిప్పుడుసూడగంటి మిచటం గృష్ణార్భకున్
నిర్భయున్.

ఇవి బాలకృష్ణునిజూచి యశోద గోపికలు మరల మరల ఆడుకొను మాటలు. తొట్టెలో శిశువుగానున్న నాటి నుండియు కృష్ణుని కేవియో ఆపదలు సంభవించుచునే యున్నవి. అందుండి యాతడు విజయవీరుఁడై వెలువడును. గోప గోపికలు ఏదోదైవమీయర్భకుని రక్షించుచున్నదను కొందురు. పూర్వజన్మముల మనమొనర్చిన పుణ్యఫల మీ కృష్ణుఁడని సంతృప్తిపడుచుందురు. నిజము క్రమక్రమముగ గాని తెలియరాలేదు-

బాల్యమునుండియు శ్రీకృష్ణుని చరిత్రము చిత్రాతి చిత్రముగ జరిగినది. జననము మొదలు నిర్యాణమువరకు ఊహాకందని వేగముతో సంఘటన లొకదాని తరువాత నొకటి సాగినది. శ్రీకృష్ణుఁడు విష్ణుదేవుని అవతారము,

లీలామానుష విగ్రహుఁడు. జన్మించినది కంసుని మధురా పురమున కారాగృహమునందు దేవకీ వసుదేవులకు. ఆ మరు క్షణమునుండియే బాల్యము గడిపినది వ్రేపల్లెలో యశోదా నందుల ఇంట. పెరిగి పెద్దవాడయి నివసించినది ద్వారకా పురమున. ఈ మధ్యలో యెన్ని లీలలు, యెన్ని మహాత్కా ర్యములు, అవి అసంఖ్యాకములు. యమునాతీరము, బృందా వనము, మధుర, ద్వారక, ఇంద్రప్రస్థము, హాస్తిన, కురు క్షేత్రము ఈ ప్రాంతములన్నియు శ్రీకృష్ణుని లీలా విశేష ములతో నిండి ఆ యవతారపురుషుని శ్రీచరణముద్రాంకి తములయి పవిత్రములైనవి. బాలుఁడుగానున్న శ్రీకృష్ణు నకు మాతాపితృభావ మధురవాత్సల్యవిశేషములతో సేవ చేయు విశిష్టభాగ్యము యశోదా నందులకు దక్కినది. శ్రీకృష్ణుఁడు అవతార పురుషుఁడని నంద యశోదలకు తెలి యునా; తెలియును, తెలియదు కూడను- శ్రీకృష్ణుఁడొక నిముషములో తన దివ్యలీలలు ప్రదర్శించును. మరు నిము షములోనే మరపించును. అది శ్రీకృష్ణుని మాయా రహస్యము.

కంసాది విమతులొనరించు పాపభారము వహించలేని భూదేవి మొరవిని శ్రీహరి అభయమొసగినాఁడు. అవనిపై తానవతరించి ఆ బాధలను బాపెదనని - తనసోదరి దేవకికి జనించు అష్టమశిశువు తన మృత్యుహేతువని మధురాపతి

కంసుఁడెరుగును. పుట్టిన పిల్లలను పుట్టినట్లు చంపుట కను వుగా దేవకీ వసుదేవులను కంసుఁడు రాజగృహాకారగారము నందేబంధించినాడు. శ్రీహరి శ్రీకృష్ణరూపమున ఆ కారాగారమునందే దేవకి అష్టమగర్భమున దివ్యభాసురమూర్తియై జనిర్మించినది.

చతుర్భుజుఁడు గదాశంఖచక్రపద్మహస్తుఁడు కౌస్తుభ హారకాంతిభాసుఁడు శ్రీవత్సలాంఛనుఁడు రత్నకిరీటుఁడు రమణీయమూర్తియయిన ఆ చిన్నిబిడ్డనుజూచి దేవకీ వసుదేవులు అద్భుతంపడి, దేవా! నీవు మా బిడ్డడవై యుద యించుట మా భాగ్యవిశేషము. మహాజ్ఞానులు యోగులు చూడఁజాలని నీ పరంజ్యోతిరూపము చూచినారము— మా జన్మములు ధన్యములైనవి కాని... కాని ఇంక నొక క్షణ ములో దుష్టుఁడా కంసుడు వచ్చును. నిన్ను తన కత్తి కెఱ చేయుటకు. భక్తవత్సలుఁడవు సర్వసమర్థుఁడ వీవేయని స్తుతి యించుచున్నంతలో కరుణాకటాక్షభాసురమగు చిర్నగవున ఆ సర్వేశ్వరుఁడు ఆ పుణ్యదంపతులజూచి మీరు స్వాయం భువమనువుకాలమునప్రశ్నిదుతపులు, తరువాత అదితి కశ్య పులు, ఇప్పుడు దేవకీ వసుదేవులు. వరుసగా మీకు బిడ్డ డనై యుదయించుచుంటిని. నన్ను పరబ్రహ్మముగా నెరిగి వర్తించుచుండుడు. మీకిటుపై భవబంధములుండవు అని

పలికెను. "వసుదేవా! కృష్ణునివేగమె వ్రేపల్లెకు గొనిపోయి నందుని ఇల్లాలు యశోద మంచమునబెట్టి ఆమె కుదయించు శిశువు నిటకు గొనిరమ్ము" అను వాణియు వినబడినది- మఱుక్షణములో ఆబిడ్డ తనరూపమునుపహరించి పసిపాపయై దేవకిపా ర్శ్వమందు దొడిగినాడు. అంతయు లిప్తలో జరిగి పోయినది- దేవకీ వసుదేవులు మాయామగ్నులైరి. వెలుపల అంతయు ప్రశాంతము-

వసుదేవుఁ డాబిడ్డ నొకచిన్న మందసము నందుంచి నిశ్శబ్దముగ వ్రేపల్లె కేగి నందునిగృహముజేరినాడు. అచ్చట అంతకన్నను ప్రశాంతము. వసుదేవుఁడట అడుగుపెట్టినాడు. యశోదగర్భమున యోగమాయ ఉదయించినది. యశోద ఒడలెఱుగదు. తక్కినవారికి మెలకువయేలేదు. యోగమాయయే దాదిరూపమున ఆ ఆడశిశువును వసుదేవునకిచ్చి వసుదేవునిబిడ్డనుయశోదప్రక్క పరుండబెట్టినది .వసుదేవుడు మధురజేరినాడు. కనినపసికందు కడుదూరమైనాడను క్రందులో దేవకీ వసుదేవులకు కంసునిబారినుండి యీ బిడ్డను తప్పించితిమిగదాయను ఆశాకిరణమొకటివెలిగినది. అచ్చట కారాగారమున ఒకశిశువు కేరుమని యేడ్చినది. ఇచ్చట నందునింట ఒకబిడ్డ కెవ్వున గొంతెత్తి యేడ్చినాడు. ఆ క్షణముకొఱకెదురుచూచు కంసుడు కత్తినిదూసి దేవకి బిడ్డనులాగి ఖండింపఁబోవునంతలో యోగమాయ ఆకాశ

మున కెగసిపోయినది. కంసునిజంపు పసిబిడ్డ డెచ్చటనో యెదుగుచున్నాడు. తెరమీది చిత్రములవలె మహావేగమున యీ సంఘటనలన్నియు ఒకదానివెంబడి ఒకటి జరుగు చున్నవి_

పురుడింకను ఒకటి రెండు రోజులలో వచ్చుననుకొన్న నందుని ఇంటిలో ఆయర్ధరాత్రమున అనుకొనకుండగనే ఆనందము వెల్లివెలిసినది. మధురాతి మధురమ్మగు ఆ బిడ్డను మొదటి కేరింతతో అందఱు ఒకత్రుటిలోలేచిరి. ఒకకత్తె చిన్నపసివానిని యశోద గుండెల కద్దుకొనుచున్నది. నందుడు తెరనొకింత తొలగించితిలకించినాడు. ఆ శ్యామ సుందరునిచూపులో రూపులో ఒకదివ్యతేజము వెలుగొందు చున్నది. ఆపుణ్యదంపతులిరువురికన్ను లేక మైమోదబాష్పములతో కాంతిరేఖలు వెల్లువలుగట్టినవి. ఇది మా గారాముబిడ్డ మాపూర్వపుణ్యఫలముమాభాగ్యములపంటఅనుకొనిరి.ఎవరి మనసులోవారు- విధినిర్ణయ మెన్ని విధములబోవుచున్నదో ఊహాతీతముకదా - ఆ బిడ్డడు వారికిజనిించిన బిడ్డడేయని వారిమనసులందుగల తలపు సందేహము లేశమ్మునులేదు_

ఆ జగన్నాధుడు ఆ అవతారమూర్తి ఆ లీలామానుష విగ్రహుడు నందుని ఇంట వెలసినాడు. యశోదానందులా శిశువు తలిదండ్రులు. ఎచ్చటి వైకుంఠమందిరమ్ము యెచ్చటి వ్రేపల్లె - యెవ్వరి కెవ్వరగుదురో అదిదైవనిర్ణయము- దేవ

లోకమున దేవతలలో వసువులనువారుకలరు. వారిలో అగ్ర గణ్యుఁడు ప్రముఖుఁడైనవాడు ద్రోణుఁడనువాడు. అతని భార్య ధర. ఒకానొక సందర్భమున బ్రహ్మ వారినిజూచి మీ రిరువురు భూలోకమున జన్మింపవలసియున్నది అని యాజ్ఞాపించెను. ద్రోణుఁడు తెల్లబోయి ఒకింత తడవాలోచించి పద్మసంభవా! నీవు సృష్టికర్తవు. నీ మాట యెటులైనను చెల్లును. ఈ అమరలోకమున సుఖముగనున్న మమ్మ అవనికిపొమ్మనుచున్నావు. నీయాజ్ఞ శిరసావహింతుము. మాకు విష్ణుసేవాభాగ్యము వరముగ దయసేయుము. కాదనకుము. ఇది మా హృదయపూర్వకమగు అభిలాష- అని వేడగా చతుర్ముఖుఁడట్లేయగుగాకయని వారినంపెను- ఆదంపతులిరువురు నేడు వ్రేపల్లెయందు యశోదా నందులు. జగన్నాథుడు చిన్నికృష్ణుడై వారింటికేతెంచెను. యశోదా నందులకు వారియెటుకలేకయే విష్ణుమూర్తి సేవలభించినది. పూర్వపుణ్య విశేషములు లూరకబోవుకదా-

శ్రావణ బహుళాష్టమి. ఆనాడు వ్రేపల్లెయందు నూతానందము వెల్లివెరిసినది. ఆకసమున గ్రహారాజి ఉత్తమ స్థితులయందున్నది. రోహిణితార రుచిరమై వెలుగొందుచున్నది. చల్లని గాలులు మెల్లగ వీచుచున్నవి. ఆ గాలులందు నవఫుల్లసుమ సౌరభములు నల్గడల ప్రసరించు చున్నవి. కర్మనిష్ఠితుల గృహములందు హోమాగ్నులు

చెన్నుమీరుచున్నవి. వ్రేపల్లెవాసుల హృదయములందేదో చెప్పరానియామోద ముదయించుచున్నది. పక్షులు పెందల కడనేలేచి కలకలారావములు గావించుచున్నవి. ప్రజలను మేల్కొలుపుచున్నవాయనునట్లు వత్సములు క్రేళ్ళుదాటి తల్లుల పొదుగులను తాటించుచున్నవి. ఆనాడు గోవులు నిర్మలక్షీరమధువులను కుంభవృష్టిగా కురిసినవి. కేవలము జగన్నాధుడైన పురుషోత్తముడు వ్రేపల్లెకు వేంచేసినాడు. ప్రకృతిమాతకు పట్టరాని పరమానందము - తెల్లతెల్లవారి నది. సుమసౌరభ సుగంధిలములైన సమీరవీచికలతోపాటు యశోదకు చిన్నిమగబిడ్డ కలిగినవార్త వ్రేపల్లె నలుప్రాంత ముల ప్రాకిపోయినది. గొల్లయిల్లాండ్రు త్వరత్వరగా వారి ప్రాతః కాలకృత్యములు చక్కబెట్టుకొనుచున్నారు. పల్లె లందు యెవతె ఇంటనైనను పురుడువచ్చినచో ఆడపడుచు లందఱు వెంట వెంటనే చూచిరావలయును. అదియొక తీయనితితీక్ష. శిశువనగా స్త్రీగర్భశుక్తి ముక్తాఫలము. నవ మాస మధురస్వప్నముల సుందరస్వరూపము - విశేషించి యశోద ఆయూరిపడుచులందరికి తల్లివంటిది-

నందుని ఇంట ఆ చిన్నిబిడ్డకు వలసినసేవ లారంభ మైనవి. పుట్టువులేని పురుషోత్తముడు నందుని ఇంట ఉద యించినాడు. దాదులు పాపనికి వెచ్చ వెచ్చని జలముల స్నానమాడించితుడిచి మల్లెపూవులబోని మెత్తని తెలిమడుగు మడతల పరుండబెట్టిరి- నందుఁడు మహానందమున వేదవిదు

లగు పురోహితులరావించి స్వస్తిపుణ్యాహవాచనములు సదివించి, జాతకర్మముల జరిపించి, పితృదేవతల నర్చించి, విరివిగ దానధర్మములు విప్రులకు సుందరగోదాన సహిత ముగ జేసి వ్రేపల్లెవాసులందఱకానాడు విందులేర్పఱచినాడు. ఒకనాడు తన ముద్దుబిడ్డను నందగోపుడు చూచివచ్చెను. మఱునిముషము తిరగకపూర్వమే మరల మరల పోయిచూచును. అది పితృమూర్తి యానందము. యశోద ఒకమారు కుమారుని చూచును. ఱెప్పలార్పక ఆ చూపు నందునిపై ద్రిప్పును. అది మాతృమూర్తి మధురభావము- ఆదంపతుల కనులపండువుగ ఆకట్టి నిసుగుతనువెల్లను కమనీయప్రసన్న కాంతులను ప్రసరించుచున్నవి. ఆతెలివలువలమధ్య ప్రశాంతముగనిదురబోవు ఆచిన్నిబిడ్డను చూచినపుడెల్ల యశోదానందుల కనులలో పాలకడలిపై పవళించు బాలనారాయణుఁడే మెఱసిపోవుచుండెను.

గొల్లపడుచులు క్రొత్తవలువముల సింగారించుకొనిరి. మొగమున తిలకము లద్దుకొని మేనభూషణముల ధరించి అద్దములలో మఱియొకమారు మరల మరల తమరూపములు దిద్దుకొని-

ఆ॥వె॥ ఏమినోముఫలమొ యింతప్రొద్దోకవార్త
వింటి మబలలార వీనులలర
మనయశోద చిన్నిమగవాని గనెనట
చూచివత్తమమ్మ సుదతులార.

అని ఒకరి నొకరు పిలచుకొని, కానుకలు కరముల గైకొని, తమయందములు తామే చూచుకొనుచు యశోద ఇంటికి కరిగిరి. ఒకరి తరువాతనొకరు కాళులు కడుగుకొని ఆ పురుటి మంచముపై నున్న చిన్నికృష్ణుని చూచిరి. ఆ చిఱుచీకటిగదిలో ఆ చిన్నికృష్ణుని చూపులతో ఏదో మాధుర్యమున్నది. ఆయాకృతిలో నేదో ఆకర్షణయున్నది. గొల్లపడుచుల హృదయము లుప్పొంగి మేనులు రోమాంచమగుచున్నవి- శ్రీకృష్ణుని యాకారమా చిన్ననాడే మనోహారముగనున్నది. అది గోపికల మనసులో బుద్ధిలో హృదయములో చెరగనిముద్రగా నిలిచిపోయినది - అనుదినము వ్రేపల్లె గోపికలు వచ్చుచుందురు. దినదిన ప్రవర్ధమానుడౌ చిన్నికృష్ణుని యెత్తుకొని ముద్దాడుదురు. వారి చేతులలో ఒకఅరనిముసముకూడ యశోద కృష్ణునిఉండనీయదు. తిరిగి చేరదీసి తనయురమున కద్దుకొనును. అనవరత తపోతత్పరులై నను దరిజేర లేని హరి నేడు యశోదయురమునచిఱుబిడ్డడై క్షీరములను త్రాగును. ఆ మాతృమూర్తి యొనరించిన పుణ్యపరిపాకమది.

మధురలో కంసునకు మనసులో మనసులేదు. మగ శిశువు జన్మించుననిన యశోద అష్టమగర్భమున ఆడశిశువు జనించినది. తన చేతులనుండి నింగికెగసిపోయినది. తన మృత్యుకారకుఁడైన యొకశిశు వెచ్చటనో పెరుగుచున్నాడు. నిదురపట్టుటలేదు. తినినయన్నము రుచించుటలేదు.

కంసుడు మంత్రులతో నాలోచించి తనరాజ్యముననున్న శిశువులనందఱిని అంతమొందించుడని ఆదేశమిచ్చినాడు. దానితో తనకు మృత్యుకారకుడయినవానిపీడ వదలును. మారువేషమునబోయి కార్యము నెఱవేర్చగల రక్కసులను పంపుడనికూడ కంసునియాజ్ఞ. ఈ హింసాకాండతో ఆ రాజ్యప్రజలు సంక్షుభితులగుచున్నారు.

దినము దినమెల్ల గోపవనిత లేదోనెపమున యశోద ఇంటికేతెంచి కృష్ణునిఁజూచి నవ్వించి పోవుచుందురు. అంత కంతకు వారికి, వారి ఇండ్లవద్దకంటె కృష్ణునికడనే ప్రొద్దు గడపుటకు ఇష్టముగా నుండును. యశోదకృష్ణునివదలి ఒక నిముషమైనను ఉండలేదు. నీరుపోయుట తుడుచుట ప్రక్క సరిచేయుట క్రొత్తవలువముల పరచుట, తొట్టెను శుభ్రము చేయుట, ఆ చిట్టితనయునకువలసిన పరిచర్యలన్నియు తానే చేయవలెను. పరిచారికలు వేరే ఇంటిపనులు చూచుకొం దురు- సాయంతనమగుసరికి మఱికొందఱు గోపికలు చేరు దురు - యశోదకృష్ణునికి దృష్టితీసి తొట్టెలోపరుండబెట్టి జోల పాటలు పాడును-

కం॥ జోజో కమలదళేక్షణ
జోజో మృగరాజమధ్య జోజోకృష్ణా
జోజో పల్లవకరపద
జోజో పూర్ణేందువదన జోజోయనుచున్.

గోపికలుగూడ సన్నసన్నగా గొంతులుకలిపి తొట్టె నూపుచు కృష్ణుని నిద్రబుచ్చెదరు. ఒకొక్కదినమున అర్ధ రాత్రమునలేచి ఆ చిన్నిబిడ్డడు పోరుపెట్టి యేడ్చును. తన చిట్టితండ్రికి అయ్యో ఏమయినది. పాలు సరిపోలేదేమో- చన్నులు కుడుపును. ఏచీమయైన కుట్టినదేమో, ప్రక్కలు దులిపి సరిచేయును. కృష్ణుడు నిదురబోయినను యశోద తాను నిదురింపక, కనుపెట్టియేయుండును. ఆమె కనులలో ఆ చిట్టితండ్రి భగవత్స్వరూపుడే.

వ్రేపల్లె కంసుని రాజ్యములోనిది. నందుడచ్చట నున్న గొల్లలపెద్ద. ఏటేట కంసునికి కప్పము చెల్లించ వలయును. తనకు లేకలేక తనయుడు కలిగినాడు. సంతో షముతో నందుడు మధురకేగి ఆ కప్పము చెల్లించి వసు దేవునిచూచుట కేగినాడు. వారిసంభాషణ మొకచిత్రముగ సాగినది-

నందా! మీ మందలును మీ రందఱును కుశలమే గదా! లేకలేక నీకుతనయుడు లభించినాడు. భాగ్యశాలివి. ఆ నా బిడ్డ క్షేమమేనా- మిమ్ములను అమ్మా, నాన్నా యనిపిలిచి ఆనందము కలుగజేయునా అని యడిగిన వసు దేవుని పలుకులలోని నర్మము వెఱ్ఱిగొల్ల నందుడు గ్రహిం పలేకపోయెను. "అవును వసుదేవా, మీకు పుట్టినబిడ్డలను కంసుడు తన పొట్టనుపెట్టుకొన్నాడుగదా! ఊఱడిల్లుము-

నా బిడ్డడు నీబిడ్డఁడే యనుకొమ్ము - కంటికిఱెప్పవలె ఆ చిట్టి తండ్రిని కాచుకొనుచున్నాము." అనిన నందునిమాటలు వినిన వసుదేవుని కొక్కమారు తాను ఆచిన్ని బాలుని నందునింట వదలిన దృశ్యము మనసులో కదలినది. కనులు చెమర్చినవి. కంసుని దురితచర్యలును మనసునఁ దోఁచినవి. మంచిది నందా! వ్రేపల్లెలో ఏ యుత్పాతములైన పుట్టవచ్చును. త్వరగ ఏగుమని నందుని సాగనంపినాడు.

నందునిడెందమందొక సందేహమావరించినది. వసుదేవుడు సర్వమెఱిగిన మహామనీషి. వ్రేపల్లెలో ఉత్పాతములని నుడివినాడు. నందునిమనస్సు తనచిన్నికృష్ణునిపై బడినది. ఆబిడ్డనువదలినందుఁడిప్పుడు ఆలమందలతో పోవుటలేదు. వ్రేపల్లెను వదలి అప్పుడే ఒక దినము గడచినది. వెనుకకు నందుడు వేగముగా పయనించినాడు.

కంసుపంపున పూతనాదులు పెక్కుకఱకురక్కసులు నలుదిక్కులకేగి ఇల్లిల్లు వెదకి తల్లియొడిలోని పిల్లలనుకూడ పైకిలాగి హింసించుచున్నారు. ఒకనాఁడొక క్రొత్తమనిసి నందునింట గోపికలందరుతోఁటికలసి తిరుగుచున్నది. చూపులకు బహుసుందరాంగి. అందఱికనులామెమీఁదనే యున్నవి. ఈమె యెవరు? యెవరో తెలియదు. తిన్నగాబోయి చిన్నికృష్ణుని ముద్దాడుట నటించి, నీకాకలైనదిబిడ్డా, మీ అమ్మపాలీయలేదా, ఏడవకుము, నా చనుబాలుత్రాగుమని పైటతొలగించి రైకసడలించునంతలో యశోదచూచినది.

తనబిడ్డ నేరిదగ్గరకును పోనీయకుండ చూచుచున్న యశోద కది ఇష్టము లేదు. రోహిణితో కలసి ఆమె కడ్డమువచ్చి-

మ॥ వనితా ముట్టకుమమ్మ చన్నుగుడుపన్ వల్దమ్మ నీ చన్ను మా
తనయుండొల్లడు వాసిపొమ్మని యశోదారోహిణుల్ చీరఁగా
కొన కీక్షించుచు మాయఁబన్ని పెలుచన్ గోశంబులో పాలు మె
ల్పువ రాజిల్లుచు మాటమెత్తదనమున్ లోవాడియు న్నేర్పడన్.

ఎంతచెప్పినను వినక సుందరాంగి రూపమున వచ్చిన ఆ రక్కసిపూతన కృష్ణునెత్తుకొని విసపుబాలు పొంగివచ్చు చన్నుగుడిపినది. బాలకృష్ణుడు సర్వజ్ఞుడు. ఆమె సంకల్ప మెఱుగును. ఒక్క గుక్కలో ఆమె ప్రాణవాయువులే పీల్చి నాడు. తాళవృక్ష పరిమాణమున నిజభయంకర రూపమున పూతన క్రిందబడి గిలగిల లాడినది. ఆమె వక్షములనెక్కి కృష్ణుడు గుద్దులు గుద్దినాడు. దానితో సరి- ఇంతలో మధురనుండి నందుఁడు తిరిగి వచ్చినాడు. ఇంటివాకిలి యందుపడియున్న పూతనను జూచి అడలిపోయినాడు. సుర క్షితముగ వెలుపలికి దొరలివచ్చు చిన్నికృష్ణుని యశోదా నందులు గుండెలకు హత్తుకొని శిరము మూర్కొని తమ బిడ్డను రక్షించినందులకు సర్వదేవతలను సంస్తుతి జేసినారు.

ఏదేవుడో అడ్డుపడి రక్షించెనుగాని ఈబిడ్డడు మనకు దక్కు-వాడా అయ్యయో అని గోమయమూత్రముల్తల దృష్టితీసి అంగరక్షలు పెట్టిరి. కృష్ణు నెత్తుకొని పాలీయఁబోయిన పూతన చటుక్కున క్రిందఁబడి చచ్చుటేమి? అది యేదో మహాశ్చర్యకరముగానున్నది అందఱకును. ఈబాలకృష్ణుని యందు యేమైనా మహాత్త్వమున్నదా ? ఏమో అని పించినది_

శ్రీకృష్ణుడు కొంచెము కొంచెము పెరుగుచున్నాడు. నలువైపుల జూచును. నవ్వును యశోదనుచూచి నవ్వి నపుడు ఆ పసినిగ్గులనవ్వులు వేరు. గోపికలనుజూచినవ్వినపు డున్న మాధుర్యము వేరు. బోరగిలపడును. తప్పటడుగులు వేయును. గడపలుదాటి కంచములకెగ బ్రాకును. బయటకు పోఁజూచును. తనచిట్టి తండ్రి అదిచేయును ఇదిచేయును అని ఆవిద్దెలన్నియు యశోద తనసాటివారితో గర్వముగచెప్పుచు కృష్ణుని ముద్దాడును. చిట్టికృష్ణుడుచూపు చిన్నిచిన్నివిద్యల కెప్పుడే వేడుకలు విందులు చేయవలెనో, విప్రులరావించి వేదమంత్రముల అభిషేచనాదికము లొనరించి వారి దీవెన లంది యశోద ఆ వేడ్కలన్నియుఁజేయును. నా చిట్టితండ్రి కిన్ని కావలెనాయని కుహానానిందతో ప్రేమ లొలికించును. మాతృహృదయము అట్టిదేకదా-

పూతనపనియైనది. ఆ వెనుకనే తక్కిన రక్కసులను ఊరూరఁదిరిగి వేపల్లెకరుదెంచినారు. ఆనాడుచిన్నికృష్ణుడు

గుమ్మము ముందాడుకొనుచున్నాడు. ఒకవైద్యుడు శకట
మువలె రయమునవచ్చి కృష్ణుని తనచక్రములక్రింద చంప
బోయెను. కృష్ణు డొకతన్నుతన్నెను. ఆబండిపై కెగిరిక్రింద
బడి ముక్కలైనది. కృష్ణుడు దొంగయేడ్పు యేడ్చినాడు.
యశోదపరువిడి వచ్చినది. "నయమే ఏదేవతలు రక్షించురో
బండిక్రిందపడలేదు నాబిడ్డ" అనుచున్న యశోదనుచూచి
అచట నాడుకొనుచున్న బాలురు "అది కాదమ్మా తనమీ
దకువచ్చుచున్న యీ బండిని కృష్ణున్నయే తన్నినాడు.
బండి విరిగినది. ఇది మేము చూచామమ్మా" అనినారు.
యశోద నమ్మలేదు. ఈ పసికూన తన్నుట బండి విరుగుట
యునా, ఇవి యన్నియు కల్లలు. ఏడ్చుచున్న కృష్ణునిదీసి,
యశోద గుండెల కద్దుకొనుచు—

ఆ॥వె॥ అలసితివిగదన్న ఆకొంటివి గదన్న
మంచియన్న! యేడ్పు మానుమన్న
చన్నుగుడువుమన్న సంతసపడు మన్న
యనుచు చన్నుగుడిపె నర్భకునకు.

తల్లియొడిలోనున్న కృష్ణుడు ఉన్నటులుండి పెద్ద
పాషాణమంత బరువయినాడు. యశోద భయభ్రాంతయై
మోయలేక ఆబాలుని నేలపై దింపునంతలో పెద్ద సుడిగాలి
వలె చుట్టుకొనుచు తృణావర్తుడను రక్కసుడు కృష్ణు నాక
సమున కెత్తుకొనిపోయినాడు. యశోద కండ్లుతెరచి ఏభూ
తమో నాబిడ్డనుయెత్తుకొనిపోయినది. అయ్యో! అని గుండె

బాదుకొనుచున్నది- ఇంతలో బయటగభాలుమని మిన్ను విరిగిపడినంత శబ్దమైనది. పాషాణమేకాదు, బ్రహ్మాండమంతబరువై బాలకృష్ణుఁడా రక్కసిగొంతుకనులిమి పట్టుకొని వ్రేలాడినాఁడు. పీనుగై ఆ తృణావర్తుఁడు క్రిందబడినాడు. చిఱునవ్వుచు చిట్టి పొట్టి యడుగులంతో కృష్ణుడు ఇంటిలోనికి వచ్చుటఁజూచి యశోద ఒకపెట్టున కృష్ణునెత్తి గుండెల కద్దుకున్నది. అయ్యో నా తండ్రికి దినదినము గండములే. నాబ్రతుకెట్లు తెలవాఱునోయని వలవల విలపించినది. దృష్టితీసినది. అంగరక్షలు పెట్టినది. దేవతలను తలచుకొని బలిదానము లిచ్చినది. నా చిన్నియయ్యా! నీ యడుగులు బ్రహ్మ, గుండెలీశ్వరుండు, భుజములు చతుర్భుజుడు, ముందు చక్రి, వెనుక గదాధరుడు, ఆడుచున్నప్పుడు గోవిందుడు నడచునప్పుడు నారాయణుడు, కుడుచునప్పుడన్ని, కూర్చున్నయపుడు ముకుందుడు, శయనించునపుడు శేషశాయి. నిన్ను రక్షించుచుండవలె తండ్రీ! యని ఆ చిన్నిబాలుని అంగములన్నియు తడిమి అందరి దేవతలను అభయమడిగినది - చుట్టుప్రక్కలనున్న గోపస్త్రీల కేమియు తోచుటలేదు- తెలతెలబోవుచుండిరి- ఇది యేదోదయ్యపు నియని కొందఱు, భూతమని కొందఱు, సర్వజగద్రక్షకుఁడైన ఆ జగన్నాథుని కీరక్షలన్నియు కావలెనా - పసిపాపఁడై బాలుఁడై ఒకతల్లివలె యశోదచే చేయించుకొన

వలసిన సేవలన్నియు చేయించుకొనుచున్నాడు. భక్తుల సేవలు భగవంతునికి ప్రీతికరములుగదా-

యశోద కంతకంతకు అంతరంగమున భయమెక్కువగుచున్నది - ఎట్లో ఇంతవరకు సరిపోయినది. ఇకముందెట్లుండునో ఎవడు కాపాడుదురు, ఎవరు రక్షింతురు, నందుండామె ప్రక్కనేయుండును. పురుషుడు గావున కొంతఓర్పుతో ధైర్యవచనములు చెప్పును - ఈ చిన్నిబిడ్డం డందరివలె సామాన్య బాలుండుగాడను ఏదోభావము వారి మనస్సులలో ద్రోచుచున్నది- ఒకనాడు యశోద కృష్ణునకు పాలిచ్చుచున్నది. కొన్ని చుక్కలపాలు బయటికి వచ్చినవి. అయ్యో! ఈ బాలుని నోటిలో ఏమైనవున్న దేమోనని యశోదకృష్ణుని వక్త్రము పరీక్షగా చూచినది. ఆహా, ఆమె కందేమి కన్పించినది. విశ్వమే అందిమిడియున్నది. సూర్య చంద్రులు తారకలు గ్రహములు వార్నిధులు సప్త ద్వీపములు పర్వతములు నదీనదములు కాననములు శాద్వలములు గోగణములు అఖిల లోకములందున్నవి. కలగాదు నిజముగనే ఆమె తనబిడ్డ నోటిని చూచుచున్నది. ఏదో విభ్రాంతిలో ఆమె ఆశ్చర్యమగ్నయైనది. మఱునిముషమున కృష్ణు డెప్పటిబిడ్డడే. నందునకీవిషయములన్నియు యశోద చెప్పుచుండును. ఏదినమున కాదినమే కృష్ణుని సంగతులు వారి కాశ్చర్యములై తోచుచున్నవి.

వ్రేపల్లెయందే వసుదేవుని మొదటి భార్య రోహిణి యున్నది. శ్రీహరితల్పమగు శేషునంశ దేవకిస ప్తమ గర్భమున బడినది. పురుడురాకమునుపే ఆ గర్భస్థ పిండమును యోగమాయ రోహిణి గర్భమునకు తరలించినది. ఆ శిశువే బలరాముడు- రోహిణి దినమందు చాలాకాలము యశోద కడనే కాలముగడపును. కృష్ణునకాడుకొను ఈడు వచ్చినది. బలరామ కృష్ణులు జట్టువిడువరు. యశోద వారినన్నద మ్ములవలెనే పెంచుచుండును. అన్నదమ్ములేకదా వారు. పుట్టినదొకచోట, మాతాపితృసేవలుగొనుచు ఆ అవతార పురుషులు పెరుగుచున్నది మఱొకచోట-

నందుడు తనతోమాటలాడి వెడలినదాది, వసుదేవుని మనసులో బలరామ కృష్ణులే మెలఁగుచుండిరి- వారి మహిమ నాతఁడెఱుగును. కాని అది ఇంకను గోప్యముగానే యుంచవలెను. బాలకృష్ణుని చర్యలు కర్ణాకర్ణిగ తెలియుచున్నవి. కంసుఁడెందరిని పంపినను ఆబాలుర కేమాపదలు రావు. కాని యెవరివలననే యాటంకములు కలుగనున్నవో ఇది వసుదేవుని యాందోళన. మధురలో తానెఱిఁగిన గర్గుడను గొప్పజ్యోతిశ్శాస్త్ర పండితుని వ్రేపల్లెలో నందునింట యోగక్షేమము లెఱిగి రమ్మని పంపెను. గర్గునిఁజూచి పూజించి నందుడు మహానందమందెను. నందుని మనసులో ఇప్పుడున్న సమస్య ఒకటే. బలరామ కృష్ణుల జీవితముల గూర్చి ఇదమిత్థమని యాతనికి తెలియుటలేదు. గర్గునిజూచి

"ఆర్యా మీరు జగత్పూజ్యులు ఆగతానాగత విషయ జ్ఞానులు. ఈ బిడ్డలు ఇరువురకు ప్రతిదినమేవిమో గండములే. వీరెట్టివారగుదురో దీవించి చెప్పు"డని నందుడు వేడెను. గర్గుడొకింత యోచించి, నందగోపా! నీకును నీ యర్ధాంగి యశోదకును వీరిని గూర్చిన భయమక్కరలేదు. మీరిరువురు ధన్యులు. మీ పురాకృతపుణ్యఫలమున ఈ బాలకులసేవ మీకు దక్కినది. రోహిణిపుత్రుడీతడు బలరాముడు, మహాబలుడు. ఆ చిన్నబిడ్డ మొదట ధవళారుణ పీతవర్ణుడయ్యు క్రమముగనల్లనయి కృష్ణుడయ్యెను. ఒకప్పుడితడు వసుదేవుని సుతుడు గాన వాసుదేవుడనియు పేరందును. ఈ కుమారుడు నారాయణసముడు. ఈ బాలునిచే మీ దుఃఖములు నశించును. సుజనరక్షణ దుర్జనశిక్షణ చేయగల సమర్థుడీతడని చెప్పి గర్గుడేగెను. నందయశోద లీమాటలువిని పరమానందమందిరి. ఆ బిడ్డలయెడవారికేదో భక్తి భావముదయించుచున్నది. మరల మఱునిముసమునందే ఒక సహజవాత్సల్యభావము మబ్బుపొరవలె వారి మనస్సులఁ గప్పివేయును.

బలరామకృష్ణులు బయటకుపోయి ఆడుకొను ఈడు వచ్చినది. కృష్ణుడింటికడనే యుండడు. ఉన్నట్టుండి పొరుగిండ్లకుపోవును. లేగదూడలతో పరుగెత్తును. తోడి బాలకులను జట్టులుగగూర్చి తాను నాయకుడై ఆడించును.

యశోద అవి అన్నియుజూచి మందలించును. "నాయనా! గంతులు వేయకురా పడెదవు, దెబ్బలు తగులును. నే నీ బాములు పడలేనురా, ఈ పాటికింటికిరారా" అని పిలుచును. కృష్ణుడు మరింతదూరము పారిపోయి ఒకనిముసము కనుమఱుగై, వెనుకనుండి ఒక్కదూకున యశోదఒడిలోపడి ఒక్కగుక్కెడు పాలుత్రావి మరలపరువెత్తును– "ఒకచుక్క పాలైన కడుపున ఇముడనీయడుగదా ఈ అల్లరివాడు" అని మరలయశోద లోలోప లేలనుకొనును. అదిఆమెకొకగారము, ఆనందము. నందుడీలీలలుచూచి మహానందముపడును.

ఇప్పుడు కృష్ణుఁ డెచ్చటెచ్చటికో పోవును. ఆలస్యముగ వచ్చును. ఎఱుఁగనియట్లు మంచముమీద పరుండి నిద్ర నటించును. యశోద అన్నియు గమనించుచునేయుండును. తానేగిన ఇండ్లవద్ద కృష్ణుఁడేవియో చిలిపి పనులు చేయును. పొరుగిండ్లవారికి కొన్నాళ్ళవి ముచ్చటగనేయున్నవి. కృష్ణుఁడు కొంచెము మితిమీరుచున్నాడు. వద్దన్నను మానడు.

యశోద కీవిషయములు నుడువుట కా గొల్లపడుచులుల్లములందు మొదట మొదలసందియపడిరి. కృష్ణుడు మేర మీరుటలో వారికి ధైర్యము వచ్చినది. ఒకరొక్కరేవత్తురు. యశోదమ్మ నీ కొడుకు వట్టి అల్లరివాడమ్మ. మా ఇంటి పాలకడవ బద్దలు కొట్టినాడమ్మ. దూడకు కొన్నిత్రాగించి మా ఆవుపాలన్ని కృష్ణుడే త్రాగినాడమ్మ. నాకు

మా అత్తగారికి ఏవో ఒకరిమాట లొకరికిచెప్పి కలహములు రేపినాడమ్మా. ఇన్ని యెందుకు ఈడువచ్చిన మాపిల్ల వెంట బడినాడమ్మా అని ఒక్కొక్కరే చెప్పెదురు. యశోదవిని విననియట్లేదో సర్ది చెప్పెను. ఊరివారికి తృప్తిలేదు. ఒక రోజున—

కం॥ ఓయమ్మ నీకుమారుడు
మా ఇండ్లను బాలుబెరుగు మననీడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభు లాన మంజులవాణీ.

అని పెక్కుమందివచ్చి నిందావాక్యము లాడువరకు వచ్చినది— మీకు భోగభాగ్యములుండిన మీరు తిని అనుభవిం తురుగాక, కొడుకుల నిట్లూరిమీదికి విడచుట మంచిదికా దమ్మా అనిగూడ పలికిరి—

యశోద వారిమాటలు నమ్మను, నమ్మదు — వారిట్లు బారులై వచ్చి చెప్పుచుండ, కృష్ణుడు బుద్ధిమంతునివలె యశోద చీరచాటునదాగును — "ఏమోనమ్మా మీరిటు లాడుట వింతగానున్నది— ఇంకా కన్నుదెఱవని పసికూన వీడు పొరుగింట్లకే పోడు—

తే॥గీ॥ అన్యమెఱుగడు తనయంత నాడుచుండు
మంచివాడీత డెగ్గులు మానరమ్మ
రామలార త్రిలోకాభిరామలార
తల్లులార గుణవతీమతల్లులార.

అని బ్రతిమాలి యశోద వారినిండ్లకు పంపినది- తన కుమారుని అల్లరి తనకండ్లతో ఎదురుగ చూచినగాని ఏ తల్లియు ఒప్పుకొనదు - వారి మాటలు యశోదకుమాత్ర మెట్లు రుచించును.

కృష్ణునిపై నేరములు పెచ్చుపెరుగుచున్నవి. బలరామునితో గూడి బాలకులు కొందఱువచ్చి "కృష్ణుడు మన్ను తిన్నాడమ్మా, వాని నోరంతయు మన్నే" అని యశోదకు చెప్పిరి. యశోదకు కొంచెము కోపమువచ్చినది. మన ఇంటి కడ మరి పదార్థములేనట్లు మన్నే కావలసివచ్చినదిరా నీకు అని కృష్ణునివైపు చూచినది - ఏమియు చేయనివానివలె కృష్ణుడు దగ్గరకువచ్చి అమ్మా నేను మన్నేల తినెదను. నన్ను నీచే కొట్టింపవలెనని చాడీలు చెప్పుచున్నారమ్మా. కావలసినచో నానోరువాసనచూడుము. మట్టివాసన యున్నదేమో అని నోరుతెరచెను. ఒకఅంగుళము వెడల్పైనలేని ఆ నోరు చూడగనే యశోదకేమి కన్పడినది. సకలలోక చరాచరభూతాదికరండమైన బ్రహ్మాండమే అందు ప్రజ్వరిల్లుచున్నది. యశోదకు కనులు తిరిగిపోయినవి. తాను చూచుచున్నది నిజమా. తనకనులను తానే నమ్మలేక పోవుచున్నది-

మ॥ కలయో వైష్ణవమాయయో ఇతరసంకల్పార్థమో సత్యమో
తలపన్నేరకయున్నదాననొ యశోదాదేవి గానో పర

ప్థలమో బాలకుడెంత ఇతనిముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమిహేతువో మహాశ్చర్యంబు
చింతింపగన్-

అని భావించు యశోద కేదో యూర్ధ్వలోకమున విహ
రించుచున్నట్లనిపించినది. వ్రేపల్లె గోగోప గోపికలు తాను
తనభర్త నందుడు ఆ చిన్ని నోటియందు గన్పించిరి-
ఈతడు బాలుడుగాదు పరమేశ్వరుడు - ఇన్నాళ్ళుగా ఈ
చిన్నికృష్ణుని వేరువిధముగా భావించి నేర మొనరించితిమి-
అనుకొనునంతలో యశోద మనసును మరల మాయ కప్పి
నది. అంతయు మఱపు ఆ చిన్నికృష్ణుని ఒడిలో జేర్చుకొ
న్నది- యశోదా కృష్ణులమధ్య ఇట్లొక నూతనప్రపంచము
సృష్టియగుచున్నది-

ఆ మఱునాడు మరియొకవింత జరిగినది - ఉదయ
మునసే యశోద వెన్నకై మీగడ పెరుగు చిలుకుచున్నది.
కవ్వపు త్రాడు రాపిడికి అరచేతులు కెంపులవలె మెఱయు
చున్నవి. చిఱుచెమటబొట్లున్న ఆమెముఖము మంచుతుంపర
లున్న పద్మమువలె ప్రకాశించుచున్నది- అమ్మా నా
కాకలియగుచున్నదమ్మా, పాలీయమనుచు కృష్ణుడు పరు
వెత్తుకొనుచువచ్చి కవ్వముపట్టి ఆపినాడు - ఆ చిట్టితండ్రి
ఆకలి కామె ఓర్వలేదు. కడుపార స్తన్యములిచ్చి క్రిందను
దింపి ప్రక్కగదిలో పొంగిపోవుచున్న పాలు దింపుటకేగినది-
తిరిగి చూచినంతలో తనపెరుగుకుండ బ్రద్దలై ఇల్లంతయు

కాల్వలు గట్టుచున్నది. కృష్ణుఁడు కిలకిలనవ్వుచు పరువెత్త చూచుచున్నాడు - యశోద ఇటువచ్చిన, కృష్ణుఁడటు పోవును. కృష్ణుడొనరించు అల్లరిపనులామె కిపుడరమైనవి. ఇంక కృష్ణుని బయటకు వదలగూడదు - దండించి కట్టి యుంచవలెను. అదియొక టే మార్గము-

తొట్టెలోనున్న పసిబిడ్డ, తల్లిని చూడగనే కిలకిల నవ్వి, కేరింతలు కొట్టును. తల్లి నీవు కొంటెవాడవగుచున్నా వురా, ఇంత అల్లరా, దెబ్బలుతిందువుసుమా అని సొట్టలు పడ్డపసికూన చిగురుబుగ్గలపై గిల్లినట్లు నటించును. మా నాయనా బుగ్గకందిపోయినదని చటుక్కునబిడ్డ నెత్తుకొనును. చంటికుర్రని దండింతుననుకొనుట మాతృమూర్తి మనసు లోని ఒకమధురభావము. యశోదకాభావము కల్పింపవలెను. ఆమె యేమేమిచేయునో తానుచూడవలెను. ఇది శ్రీకృ ష్ణుని తలంపు. ఆ అవకాశము ఇప్పుడువచ్చినది. తనను పట్టు కొనవచ్చు యశోదకు అందినట్లు గన్పడును, అందక పరు వెత్తును - ఆ పరువెత్తుట ప్రక్కఇంటిలోదూరి వారి యుట్టి మీదనున్న వెన్నతీసి ఒకకోతికి పెట్టుచున్నాడు కృష్ణుడు. యశోద ఒకబెత్తము పుచ్చుకొన్నది-

కానీ, కానీ, అల్లరివాడా నన్ను తప్పించుకొని పారి పోదమనుకొనుచున్నావా, అదిసాగదులే, ఇదిగో బెత్తము అని చేతనున్న సెలగోలను ఝళిపించును. ఇదివరకు ఊర కున్నాను. ఇప్పుడు వదలిపెట్టను, యెఱుగుదువా అని

యశోదవెంటాడి తరుముచున్నది. వెంటనే ఆమె మనసులో ఒకభీతి- ఈ క్షుద్రుడు భయము యెఱుగడుగదా. పట్టుకొని గట్టిగా బుద్ధిచెప్పెదననుకొన్నచో లేక లేక ఒకపసికూన మరల ఒక్కొక్కవేళ ఎంతబుద్ధిమంతుడో ఏ పెద్దలుచాలరు. వీనిమాటలకూ చేతలకూ అని భావించుచూ-

మ॥ స్తనభారంబున డస్సిక్రుస్సి యసదై జవ్వాడు
మధ్యంబుతో
జనితస్వేదముతో చలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణగూడ బారితిరిగె న్వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్రమనంబులున్ వెనుకొనంగా లేని
లీలారతున్-

తనబాలుని పట్టుకొనియుంచు ప్రయత్నములలో యశోద పరమాత్మకొఱకే ప్రయత్నించుచున్నది. ఆమె యన్వేషణ లోని రహస్యమది. ఆమె నటునిటు త్రిప్పెను, కృష్ణుడు పట్టువడును-

ఎట్లయిననేమి, కృష్ణుని పట్టుకొని ఒకరోలునకు కట్టినది. యశోద తన పనులు చూచుకొనుటకు లోనికేగినది. నీకు తగినశాస్తిఅయినదిలే, ఇక ఇక్కడే పడివుండు అన్నది. లోనికేగినదో లేదో యశోద వాకిటిముంగల ఫెళ్లు ఫెళ్లు మను మహాశబ్దము, బయటకు పరుగిడి వచ్చినది. గృహద్వారము ముందున్న రెండు పెద్ద మద్దిచెట్లు కూలిపడియున్నవి. వానిమధ్య రోలు నీడ్చుకొనుచు కృష్ణుడున్నాడు.

అన్నీ అసాధ్యమే ఈ అల్లరివానితో, ఇంకనునయము! ఈ మహావృక్షములక్రింద వీడు నలిగిపోయినాడుకాదు. తాడు విప్పి కృష్ణు నెత్తుకొని గుండెల కద్దుకొనినది. నలువురు ఇంతలో చేరిరి. " ఎంత అల్లరివాడయిన మాత్రము, ఇంత చేయుదురా, చాలులే నీ పనులని యశోదను నిందించిరి." పిల్లనికి దృష్టితీసి లోనికి గొంపోయినది యశోద-

కృష్ణుని పాదస్పందముమాత్రమున ఆతరువులు కూలి పోయినవి. కుబేరుని కుమారులు శాపగ్రస్తులై ఆ వృక్షములుగా పుట్టి తిరిగి శ్రీకృష్ణుని దయవలన శాప ముక్తులై చనిరి-

శ్రీహరి యవతారమాకృష్ణుఁడు. ఘనయోగీంద్రుల ఊహకైన అందని దారూపము- ఏ కర్మములు బాములు లేని ఆ పరమాత్మకు యశోద ఇంటిలో జాత కర్మములు వచ్చినవి. రజ్జువున బంధితుఁడైనాడు. భక్తవరులనుగాని ఇతరుల కాదైవము పట్టువడునా, బ్రహ్మాండమునంతయు తనలో నిముడ్చుకొనినదిట్టు, యశోద రోలునకు గట్టగా ఒక చిన్న తాడునకు లొంగిపోయినాడు. ఏ బంధము లెఱుగని జగద్బంధునికి జననీబంధము తప్పలేదు- తనయొఱుక లేకయే పరమాత్మునికి యశోద చేయుచున్న సేవా ఫలమిది-

నందున కిపుడు ఒక్కటే యోచన. వ్రేపల్లెలో ఉత్పాతములు పరంపరగా వచ్చుచున్నవి - విసపు రక్కసి,

సుడిగాలి ఇప్పుడీచెట్లు. ఏదో భూత మిచ్చటనున్నది - రామ కృష్ణులనిచటనుంచుట శ్రేయముగాదు. కులవృద్ధులతో ఆలో చించినాడు_గోగణసహితముగా యమునాతటినున్న బృందా వనమునకు ప్రేపల్లెనంతయు తరలించి తీసికొనిపోయినాడు.

బృందావనమొక యందాలసీమ. అచట తిరుగాడు కృష్ణుడే వేరు - బలరామునితో, గోపబాలకులతో కలిసి ఆలమందతో ఆడుకొనుచు వనముల కేగి సాయంతనము తిరిగి వచ్చును. బాలకులతో చల్దులు తినును. వనవిహారము సేయును_ పూలమాలలు చేతిలో మురళి, శిరమునపింఛము గోలోకపతియగు కృష్ణస్వామిని మరపించును - అచట గోలోకమున రాధయొక్కతెయె యున్నది. ఇచట గోపిక లందఱు రాధలే. వెన్నెలరాత్రులందు కృష్ణుని మురళీగా నము వినితీరవలయును. గొల్లపడుచు లిళ్ళువదలి ఒడళ్ళు మఱచి ఆ బాలకృష్ణునితోనే యుందురు. రాసము లాడు దురు. వారికిప్పుడు సర్వమతఁడే. ఆ దివ్యవిగ్రహముచూచి యశోదానందు లమితానందము పొందుదురు_

వనములనుండి వచ్చిన గోపబాలకులు యశోదా నందుల కెన్నియోకథలు చెప్పుదురు - పెనురక్కసులవలె వచ్చు బకమును వత్సమును కృష్ణుడు పోరాడిచంపినాఁడు. బలరాముడు గార్దభ ధేనుకుని చంపినాడు. ప్రలంబుని చంపి నాడు. కార్చిచ్చునుండి గోవులను గోపకులను కృష్ణుడు

రక్షించినాఁడు: ఒక పెద్ద చిలువనుండికూడ రక్షించినాడు. ప్రతిదినమేదియో ఇట్టి కథయే. ఈ విపత్తులన్నియు యాదృచ్ఛికములు గావని నందునకు గట్టిగాఁదోచినది. గర్గునిమాటలు అదేస్ఫురింపఁజేయుచున్నవి. కంసుఁడిట్లు ఈ రక్కసులచే బలరామ కృష్ణులను పొలియింపజేఁయవలెనని చూచుచున్నాడు. రామకృష్ణులు ఈ యుద్యమముల కతీతులు, తన కనులముందే నందుడు చూచినాడు. కాళిందిమడుగున డాగి ప్రజలనుజంపు కాళియనాగుని కృష్ణుడు త్రొక్కి రక్తమును క్రక్కించినాడు. ఇంద్రుడు కురిపించు రాళ్ళవాననుండి గో గోపకులను గోవర్ధనాద్రి క్రిందికిఁజేర్చి కృష్ణుడు కాపాడినాడు. ఏకాదశీవ్రతము ముగించి నందుడు యమునలో స్నానమునకుఁ బోయినపుడు వరుణునిభటులాయనను గొనిపోయి వరుణునొద్ద పెట్టినారు. నందుడు మరణించెనని బృందావనమందు ఆక్రందములు రేగెను. కృష్ణుఁడా నీటమునిగి వరుణునొద్దకేగి పూజితుఁడై తండ్రి ప్రాణములు కాపాడెను.

యశోదా నందుల కివియన్నియు తామొక దివ్యలోకమున నున్నట్లనిపించినవి. ఇంతకాలము ఆడించి పాడించి పెంచి పెద్దజేసి ఒడలెల్ల కళ్ళుగా అనుక్షణము కాపాడిన దెవనిని, ఏమియెఱుగని ముగ్ధబాలకుని తమచుట్టు తిరుగుచున్న ఈ ముద్దులాడెవరు, మురళీగానముచే లోకమెల్లను గరగింపఁజేసి తనవశమొనర్చుకొను ఈ మోహనమూర్తి

యెవరు, తమ మాతాపితృభావ సేవాజాలమునం జిక్కిన చిదానందుడు ఆ నారాయణుండే అని తోచినది. ఈ జ్ఞాన చింతనములో మరల నొకభీతి. ఈ మహాత్మునికి మన ఇంట ఎప్పుడేమి లోపమువచ్చినదో, మనల నీతండు మన్నించునా అని అట్టి భావము ఆ దంపతులకు తోచిన క్షణములో ఎటనుండివచ్చునో బాలకృష్ణుడు వారియొడిలో దభాలున దూకి తాను నవ్వి వారిని నవ్వించును. మరల ఆ కృష్ణుడు వారిబిన్నారి నల్లనయ్యయే.

రామకృష్ణుల మహిమ జగద్విదితమైనది. కృష్ణుడు దేవకి యష్టమగర్భమున పుట్టినవాండే. యశోద ఇంటం బెరిగెను. సందేహములేదు. వారినెట్లయినసరే చంపి తీరవలెను. ఇది కంసుని యాలోచన. ధనుర్యాగమొనరించుచుంటినను మిషపై కంసుడు రామకృష్ణులను మధురకు రప్పించినాడు. ఏమి జరుగనున్నదో అనుభయముతో నందాదులును వెంట వచ్చిరి. ఆబాలవీరులకెదురులేదు. కంసుని ధనుస్సు విరచిరి. తమపై కురికిన మత్తేభమును క్రమందించిరి. ముష్టియుద్ధమున ముందునకు దుమికిన మహామల్లురు చాణూరముష్టికులను పడనేసి కడముట్టించిరి. సభాముఖమున తనుపైకి కత్తిదూసిన కంసునిమీదకు సింహమువలె లంఘించి కృష్ణుడు హతమార్చెను. వారి చర్యలు జగదాశ్చర్యకరములై భాసించినవి—

రామకృష్ణులకొక ముఖ్యమైన కరణీయము మిగిలినది. పదునెత్తి కారాగృహబంధితులై యున్న తల్లిదండ్రులు దేవకీ వసుదేవులను అందుండి విముక్తులనుజేసి, మీ కడుపునబుట్టి ఇంతవరకు మీ కేమి చేయలేకపోతిమిగదాయని క్షమాభిక్ష వేడిరి. ఈ బిడ్డలను కనినతరువాత కనులువాచునట్లు వేచివేచి, ఇన్ని దినములకు చూడగలిగిరి ఆ దంపతులిరువురు. దేవకీ వసుదేవుల కన్నీరు మున్నీరయినది. ఆ ఇరువురి బాలకులను యెత్తి కౌగలించుకొనిరి. దేవకితనువు పులకించెను. చనువుగ అమృతధారలే వర్షించినది-

రామకృష్ణులకు ఒకప్రక్క కనిన తల్లి దండ్రులు దేవకీ వసుదేవులు; మఱొకప్రక్క అల్లారుముద్దుగ పెంచి పెద్దజేసిన జననీ జనకులు యశోదా నందులు. ఆ వీరబాలకులను అచ్చట చూచినవారి హృదయములు సమోహ్లదమున ఉప్పొంగిపోయినవి. ఆ ప్రాంగణమంతయు ఆనందవార్ధులు పొంగి పొరలినవి. కంసుని హింసావృత్తినుండి లోకమును రక్షించిన జగద్వల్లభులువారు. ఆనాడు మధురకు వైకుంఠమే దిగివచ్చినట్లయినవి-

నతశిరస్కులై, వినయవినమ్రులై రామకృష్ణులు దేవకీ వసుదేవులనుజూచి, ఆర్యులారా, మహీతలమున మా జన్మములకు మీరుగదా కారణులు, మీ ఋణము నూరేండ్లకైనతీర్చుట సాధ్యముగాని పని. తల్లికి తండ్రికికాని తనయుడు రాక్షసప్రాయుడే. మీ కీనాటివరకు మే మేమిచేయ

గలిగితిమి ? ఆహా, మా కొఱకు పడరాని కష్టముల పాలయిరి గదా—

శా॥ కారాశాలల మా నిమిత్తము కంసుండు కారింపగా
వారింపంగసమర్థతల్ గలిగియున్ వారింపగారాక ని
ష్కారుణ్యాత్ములమైన క్రూరుల మహాకౌటిల్య సంచారులన్
సారాతిక్షములార మమ్ము కొఱతల్ సైరించి రక్షింపరే !

అని పాదములపై బడి వేడుకొనిరి. లేచి యీ ప్రక్కకు జూచిరి. యశోదా నందులను చూడగనే రామకృష్ణుల హృదయములు వికసించినవి. చూపులు చంద్రికా కాంతులను వెదజల్లినవి.

శా॥ తండ్రింజూడము తల్లిఁజూడము యశోదాదేవిశూన్ నీవు మా
తండ్రిందల్లియునంచు నుండుదము సద్ధర్మంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి భవత్స్నేజన్య భావంబులన్
తండ్రీ ! ఇంతటివారమైతిమి గదా తత్తద్వయోలీలన్.

అని ఇరుప్రక్కలనున్న తండ్రులకు తల్లులకు కృతజ్ఞతతో తలలువాల్చిన ఆ దివ్యపురుషుల నేత్రములనుండి ముత్యములవలె భక్తిబాష్పములురాలి వారి పాదములు పూజించినవి. ఆ దంపతులకు, ఈ దంపతులకు ఆనందము

అవధులు దాటినది. కారణజన్ములు అవతారపురుషులైన రామకృష్ణులకు యశోదానందులొనర్చినదే వాత్సల్యసేవ పూలుపూచి పరిమళించినది – ఆబాలురిద్దలోని దేవకీ వసుదేవుల కప్పగించి ప్రేమవిహ్వలులై బాష్పజలపూరితులై ప్రేపల్లెకు జనిరి–

సేవలుగొననేర్చిన శ్రీహరి ఈనాడు శ్రీకృష్ణావతారుఁడై తనను కనినవారికి, పెంచినవారికి తనసేవ లర్పించి వారలను ధన్యులను జేసినాఁడు. శ్రీహరిసేవలో సిద్ధులై పరమపదమును బొంది పరమభాగవతులనిపించుకొనినవారు దేవకీ వసుదేవులు, యశోదానందులు– శిశువైన శ్రీకృష్ణునెడల యశోదచూపిన మాతృవాత్సల్యము, మధురాతిమధురము. శ్రీకృష్ణుడు భగవదాకారుడని తెలిసిన తరువాత యశోద చూపిన మాతృభక్తి, పవిత్రభావభాసురము, యశోదా కృష్ణుల అన్యోన్యానురాగమొక పవిత్రానందయోగమై ప్రకాశించినది–



# 7. ఆత్మలో నెలకొన్న భీష్ముఁడు

శా॥ ఆలాపంబులుమాని చిత్తమునసీహాయత్తముంజేసి దృ
గ్జాలంబున్ హరిమోముపైఁబఱపి తత్కారుణ్యదృష్టిన్ విని
ర్మూలీభూతశరవ్యథా నిచయుఁడై మోదించి భీష్ముండు సం
శీలంబొప్ప నుతించెఁ గల్మషగజశ్రేణీహరిన్ శ్రీహరిన్.

భారత మహారణరంగమున, పార్థుని బాణహతికోరిగి, శరతల్పగతుడై, దివికేగుటకు ఉత్తరాయన పుణ్యకాలము నకై వేచియున్న భీష్మనిరూప మీపద్యమున చిత్రితము. శ్రీకృష్ణ సహితులయి ధర్మజాదిపాండవులేవురు నచటనే యుండిరి. దేవర్షి బ్రహ్మర్షు లేతెంచిరి. భీష్ముడు వారిని సత్కరించి, ధర్మజునకు రాజనీతి, ధర్మతత్వముల బోధించి సత్పరిపాలకుడవు కమ్మని దీవించి, చిత్తము నీశ్వరాయత్త ముజేసి, శ్రీహరి రూపమైన శ్రీకృష్ణుని మనసునందు పూజించి నుతింపఁదొడఁగెను.

యాదవపతియైన శ్రీకృష్ణుఁడు లీలామానుష విగ్రహుఁడు ఆనందస్వరూపుడు స్వయంభగవానుడని మొదటి నుండియు యెఱిఁగిన జ్ఞాని భీష్ముడు. మరణకాలమున తన సర్వము కృష్ణార్పణముజేసి దివికేగిన ధీరుఁడు.

భారతదేశ చరిత్రలో భీష్మునంతటి సద్వర్తనుఁడు, ధర్మదీక్షితుఁడు, పరాక్రమశాలి, వీరుఁడు, ఆత్మజ్ఞాని మఱి యొకడు లేడని నిశ్శంసయముగ చెప్పవచ్చును. ధీరోదాత్త తకు భీష్ముఁడు మొదటి యుదాహరణము. ఈతడు గంగా శంతనుల పుత్రుఁడు, దేవతా సంభూతుఁడు.

పుట్టువుతో ఈ మహనీయునికి గలిగినపేరు దేవవ్రతుఁడు. ఈతని జన్మవృత్తాంతము చాలావిశిష్టమైనది. వేయి యశ్వమేధము లొనరించి దివికేగిన ఇక్ష్వాకు వంశీయుఁడు మహాభిషుఁడు ఒకశాపవశమున ప్రతీపమహీపతికి సుతుఁడగు శంతనుడై పుట్టెను. గంగయొక సుందరాంగన రూపమున దేవసభనున్నప్పుడు మహాభిషుడును గంగయు అనురాగమున అన్యోన్యము చూచుకొనుచుండుటచే ఆ యనుచితమునకలిగి బ్రహ్మ మీరిక ధారుణిపై దంపతులై జన్మింపుడని శపించెను. దేవతలందొక తెగయగు వసువులు వసుధపై నొకప్పుడు తిరుగుచు వసిష్ఠమహాముని ధేనువునం దాసక్తులై ఆ ధేనువును దొంగిలఁబోవగా వసిష్ఠుడు వారిని ధరణిపై బుట్టుడని శపించెను. స్వర్గమును వీడుటకు వారుచింతించి శాపవిముక్తిని గల్పింపుఁడని యాసంయమిని వేడ, మీ యెనమండ్రలో మొదటి యేడుగురు పుడమిపై పుట్టిన వెంటనే చత్తురు. నా గోవునందెక్కుడు ఆసక్తిచూపిన యెనిమిదవ వసువు క్షితిపై చాలాకాలము జీవించి సర్వవిధముల ప్రసిద్ధుఁడగునని చెప్పి పంపెను. అవినీతివర్తనమరసి

నపుడు మునులాగ్రహులై నను సహజముగ కరుణామన స్కులుగదా- ఆ యెనిమిదవవసువే గంగాశంతనులకు దేవ వ్రతుఁడై జన్మించెను.

శంతనుఁ డొకనాడు గంగాతీరమున విహరించుచుండ గంగానది యొకసుందరాంగియై యాన్నపాలునిదృష్టి నాక ర్షించెను. వారిద్దరు పరిణయమాడిరి. ఇంతకుమున్నే, శప్తు లయిన వసువులు "తల్లీ గంగా భవానీ! నీగర్భమున మమ్ము జనింపనిమ్ము" అని వేడి యామె సమ్మతిఁబడసిరి. గంగ శంతనునిజూచి "నిన్ను పెండ్లాడుదునుసరే, ఒకనియమున్నది నేనేమి చేసినను నీ ఊరకుండవలయును" అని ఒప్పించినది- శంతనువలన గంగ వరుసగ మొదటియేడ్వురు వసువులను కని వెనువెంటనే గంగలో ద్రోసినది. ఎనిమిదవవసువు మహాసుందరుడు మహాతేజస్వియై జన్మించినాడు. ఆ బిడ్డను శంతనుడు వదలలేక గంగచర్య కడ్డుతగిలెను. నియమభంగ మొనర్చెను గాన గంగ శంతనుని విడచి యేఁగినది - ఆ శిశువే దేవవ్రతుడు-

ఒకానొక దేవకార్యమునకై ఇట్లు చేసితిని, నన్ను న్యథాతలంపకుము, నరనాథాయని గంగనుడివి ఆ శిశువును తనతోఁదోడ్కొనిపోయి పెంచిపెద్దచేసి వసిష్ఠునొద్ద సకలా గమశాస్త్రములు పరశురామునొద్ద సమరవిద్యలు అస్త్ర

శస్త్రాభ్యాసము చెప్పించి విజ్ఞానుని వీరుని జేసి, తిరిగి శంతనున కర్పించెను.

ఇది భీష్ముని జన్మకథ. సకలాఘములను సమయింప జేయు గంగామతల్లికి దేవేంద్రసముడగు మహాభిషుని వంశీయుడగు శంతనునికి తనయుడై జన్మించిన దేవవ్రతుడు సామాన్యుడగునా. పదునీ వశిష్ఠ పరశురాములంతటి పుణ్యపురుషులయొద్ద సుశిక్షితుడైన ధీశాలియు సుగుణోత్తముడతడు. ఈ యుత్తమగుణములే దేవవ్రతుని తరువాతి వర్తనమునకు ప్రోదయైనవి. ధరణినేలదగినవాడని యెంచి శంతను డా తనయుని యువరాజుగ నొనరించెను.

కాలక్రమమున శంతనుడు దాశరాజ పుత్రియగు సత్యవతియందు బద్ధానురాగుడయ్యెను. కాని దాశరాజు సత్యవతి తనయులే శంతనునితరువాత ధరణీశులు కావలెనని పట్టుబట్టెను. శంతనునకుతలకు గోకలిచుట్టుకొన్నటులైనది. ఇంట సర్వసమర్థుడైన కుమారుడు యువరాజయి యుండ దాశరాజు కోరికల కియ్యకొనుటయెట్లు ? దేవవ్రతుడు తండ్రి చింతనెఱిగి తాను స్వయముగ దాశరాజుకడకేగి, తనకు రాజ్యమక్కఱలేదనియు, తాను కుమారులులేకుండ నిత్యబ్రహ్మచారిగ నుందుననియు సత్యవతీ తనయులె జననాథులగుదురని పలువురముందు ముమ్మారు ప్రతిజ్ఞజేసి సత్యవతిని గొనివచ్చి శంతనునకు వివాహమొనరించెను. తండ్రికై యంతటి త్యాగమొనరించిన మహాపురుషుడా

దేవవ్రతుఁడు. తాను భీష్మముగఁజేసిన ప్రతిజ్ఞ కారణముగ భీష్ముఁడని కొనియాడబడెను - శంతనుఁడా భీష్ముని వర్తనమునుమెచ్చి కుమారా! నీవు కోరుకొనినపుడే నీకు మరణము కలుగునని స్వచ్ఛంద మరణము కలవానిగా వరమిచ్చెను- సత్యవతిపుత్రులు చిత్రాంగదుఁడు విచిత్రవీర్యులను భీష్ముడు తానవిమాటప్రకారము జనపతులనొనరించెను- ఆ ఇరువురు సోదరులకు వివాహములు చేయుంచు సందర్భమున, అనాలోచితముగ తనపై కరుదెంచిన తనగురువు పరశురాముని, మహాపరాక్రమముతో భీష్ముడు ధర్మదీక్షితుడై యెదిరించి యుద్ధము చేయగలిగిన న్యాయశీలి. విచిత్రవీర్యుని సతులందు గలిగిన ధృతరాష్ట్ర పాండుభూపతులకు సర్వవిద్యలు చెప్పించి వారితనయులగు దుర్యోధనాది కౌరవులకు ధర్మజాది పాండవులకు ధనుర్విద్యతో సహా సకల విద్యలు చెప్పియూ వంశమునకు మూలపురుషుఁడై మహా ప్రసిద్ధిఁగాంచెను. భీష్ముఁడెఱుఁగని శాస్త్రములేదు, యెఱుగని ధర్మములేదు, యెఱుగని నీతిలేదు; అధ్యాత్మ జ్ఞానమున అనంతమైనప్రజ్ఞ యాతనికిగలదు. చిరతరతపోనిమగ్నులగు సంయమీంద్రులనుమించిన చిత్తశుద్ధియు, పరమేశ్వర చింతనము, పరమాత్మ జ్ఞానము గలిగిన మహామనస్వియతడు.

ఇది సంగ్రహముగ భీష్ముని వ్యక్తిత్వము. త్రిజగములకు మూలము, ఆధారము ఆశ్రయము పరమాత్మ.

ఇదమిత్థమని చెప్పనలవి కాని, స్త్రీ పుంసభావాతీతము. సాకారము నగుణమై ధర్మసంస్థాపన మెట్లు జగమున నొనరించునో, నిర్గుణము నిరంజనము నిరాకారమై భక్తుల హృదయము లందట్లు భాసించును. సకలచరాచర స్థితమైనశక్తియు చైతన్యము ఆ పరమాత్మయే. సర్వాంతరామియై సర్వసాక్షియై యున్న ఆ జగన్నాథునాత్మలో నెఱిఁగియుండుటయే జ్ఞాన సంసిద్ధి. జ్ఞాని ఈశ్వరసమానుడు - నెఱుఁగుటయేగాదు ఆ పరమాత్మభావమును పరిస్ఫుటముగ గ్రహించుశక్తి గావలయును. ఆ బ్రహ్మభావమున తనసర్వస్వము సమర్పింపవలయును. ఇది మహాభక్తాగ్రణులకే సాధ్యము. ఈ సిద్ధినిఁ బడసిన పరమభాగవతుఁడు భీష్ముడు. ప్రహ్లాద నారద అంబరీషాదులకోవకు చెందిన జ్ఞానకోవిదుడు భీష్ముడు.

శ్రీకృష్ణుఁడు పరమాత్మ స్వరూపుఁడు. శ్రీమన్నారాయణుని యవతారము. జగదుద్ధరణకై జన్మమునందిన లీలామానుషవిగ్రహుడు. శ్రీకృష్ణుని మహిమలు కనులారఁ జూచియు, వీనులారవినియు, పరమాత్మరూపునిగా నెఱుఁగలేనివారనేకు లాకాలమందేయున్నారు. ఆ నిజము నెఱిగిన వారిలో భీష్ముడుత్తమభావుకుడు. పాండవాగ్రజుఁడు ధర్మరాజింద్రప్రస్థమున మహావైభవముగ రాజసూయమొనరంచుచున్నాడు. సకలదేశరాజన్యులా యుత్సవము జూచుటకేతెంచిరి. క్రతుదీక్షితుఁడైన ధర్మజుఁడు సంప్రదాయానుసారము మునుముందెవరినిపూజించి యాగనిర్వహణ కుపక్ర

మింపవలెనని అచటనున్న బుధజనుల నడిగెను. అనేకులనేక విధముల వచించిరి. కురువృద్ధుఁడగు భీష్ముండు లేచి, " ఈ పవిత్రకార్యమున పూజార్హుఁడగు పుణ్యపురుషుఁడు శ్రీకృష్ణుఁడొకఁడే. అతడు పరమాత్మ స్వరూపుఁడు జగదారాధ్యుడు. అతని పూజించి పరమార్థఫలమందుము " అని యుపదేశించెను. అది ఒకమహాభక్తుడు భగవానునిలో నెఱిగినమాట. అచటనున్న చాలామంది కాబోధము విరోధమయ్యెను. ఉత్తమరాజవంశీయులెందఱో ఇటనుండగా ఒక గొల్లవానికా ఈ మర్యాద అని శిశుపాలాదులు మహోగ్రులై మారణాయుధములు బూని శ్రీకృష్ణుపైఁబడిరి- శ్రీకృష్ణుని చక్రనిహతికి నిముషములో నిర్మూలమయిరి- భీష్ముని మాటప్రకారము ధర్మజుఁడు శ్రీకృష్ణుని పూజించి క్రతువును యథావిధి పూర్తిగావించెను- శ్రీకృష్ణుఁ డొనరించినది ధర్మపాలన. దానిని భీష్ముఁ డెఱుగును.

భీష్ముడు హస్తినలో ధృతరాష్ట్రునివద్దనే యుండువాడు, ఆ యంధరాజునకు ఒకహితబోధ సేయుచు. ధృతరాష్ట్రుని కుమారుడు దుర్యోధనుడు దురాలోచనాపరుడై దాయాదులు సజ్జనులగు ధర్మజాది పాండవులకు రాజ్యభాగములేకుండ అనేకబాధల పాలొనరించి చంపించుటకుఁ జూచెను. పాండవులు ధర్మవర్తనులు అయిదూళ్ళయిన చాలునని శ్రీకృష్ణునే సంధిచేయఁబంపిరి. భీష్మద్రోణాది వీరుల అండచూచుకొని దుర్యోధనుడామాత్రమును వదలక

సభాముఖమున శ్రీకృష్ణునిబంధింప యత్నించెను. మహాతేజ ముతో సహస్రభాస్కరకాంతిదీపింప శ్రీకృష్ణుడు తన విశ్వ రూపమునయెదుటఁ గన్పించుటతో దుర్మార్గులగు దుర్యోధ నాధులు పరువెత్తిరి. భీష్మాదులా దివ్యదర్శనమున కద్భు తానందమంది పాహి, పాహి, యని శ్రీకృష్ణుని ప్రస్తుతించి ధన్యులమైతిమనుకొనిరి.

కౌరవ పాండవులకు యుద్ధము తప్పలేదు. దుర్యోధ నునికి ధర్మమూర్తియగు భీష్ముడు అనేకవిధముల న్యాయ మార్గములు బోధించిచూచెను. "నీవు చేయునది అనుచితము నీ వపకీర్తియేగాక అపజయపరాభవ మొందెదవు. పరమా త్మయగు శ్రీకృష్ణుడు ధర్మోద్ధరణకై జన్మించిన యవతార పురుషుడు. ధర్మవర్తనులగు పాండవులకు సర్వవిధముల సాయమొనర్చు" నని - అవి దుర్యోధనుని చెవికెక్కలేదు.

యుద్ధమారంభమైనది. ధర్మరాజు మున్ముందు తాత భీష్మునికడకేగి యామహితాత్ముని పూజించెను. భీష్ముడు ధర్మజుని హృదయపూర్వకముగ ఆశీర్వదించి విజయవంతుఁ డవగుదువనిచెప్పి పంపెను.

కౌరవుల ఇంటివద్దనే మొదటినుండియు తానుండుటచే భీష్ముడు దుర్యోధనునిపక్షమున సమరనాయకత్వము వహిం చెను. అజేయపరాక్రమశాలియగు భీష్మునిముందు పాండవ సైన్యములేమియు చేయలేకపోయినవి. అర్జునుని బలవిక్ర మములు వ్యర్థమగుచున్నవి. పదిరోజులైనది. ఇరువాగుల

సైనికులు హతమగు చేగాని, భీష్ముని విజృంభణను పార్థుడు నిరోధింపలేకపోయెను. తుదకు శ్రీకృష్ణుడు తనచక్రమును బూని భీష్మునిపై కురుక సంసిద్ధుడగుదనుక వచ్చినది. మఱి యొకదిన మోపికపట్టుమని అర్జునుడు కృష్ణుని వారించెను. ఆనాటిరాత్రి ధర్మజుడు భీష్మునికడకేగి యావీరుని పాదము లంటి, మహాత్మా నీవు మాకెదురునిలచినంతవరకు మాకు విజయమబ్బదు- మాకొకదారిచూపుము అని ప్రార్థించెను. ధర్మచింతనుఁడు స్వార్థత్యాగియునగు భీష్ముడు తాను మర ణించు మార్గమును తెలిపి ధర్మజునంపెను - మఱునాఁడు శిఖండిని ముందిడుకొనివచ్చిన అర్జునునితో పోరుటకిష్టము లేక భీష్ముడస్త్రసన్యాసమొనరించి అర్జునుని సునిశితాస్త్ర పరంపరకాగలేగ నేలకొరగెను. సమరాంగణ సార్వభౌము డగు భీష్మునకానాడు రణరంగమున శరతల్పమే హంసతూ లికాతల్పమైనది- స్వచ్ఛందమరణమంద సమర్థుడైన భీష్ము డుత్తరాయణమువచ్చువర కాగదలంచెను. శ్రీకృష్ణుడా మహనీయునికి అంపశయ్యబాధలు, ఆకలిదప్పులబాధలు లేకుండ నిశ్చలచిత్తోపశాంతి నిచ్చెను-

ఆనాడు తండ్రికొరకై సామ్రాజ్యభాగ్యము త్యజించి సత్యప్రతిజ్ఞాపరిపాలకుఁడై నిశ్చలబ్రహ్మచారియైన భీష్ము డీనాఁడు ధర్మవిజయమునకై తన యసువుల నర్పించెను- మనుజమాత్రులకందని మహాత్ముల మార్గమిది-

పాండవ కౌరవ యుద్ధమంతమయినది. కౌరవులను రూపుమాపి పాండవులు విజయమందిరి. ధర్మరాజు సోదర సహితుఁడై శ్రీకృష్ణునితో గూడి రణరంగమధ్యమున శ్రీ హరిని చింతించుచు దివ్యతేజోవిరాజమానుడై తనమరణ పుణ్యకాలమునకై నిరీక్షించుచు శరతల్పగతుఁడైన భీష్ముని కడకేగి ప్రదక్షిణపూర్వకముఁగ ప్రణతులర్పించి పాదాక్రాంతుడై, "తాతా! నీవు బ్రహ్మభావుడవైన పరమభాగవతుఁడవు. నీ దర్శనము పుణ్యప్రదము. నీ మరణకారణుడనైన అపరాధిని నన్ను క్షమించి రాజ్యపాలనార్హుని జేయవే" యని దీనుఁడై వేడెను. భీష్ముని ముఖారవిందము వికసించినది. కనుగవనుండి ఆనందామృతవీక్షణములు ప్రసరించినవి. "ధర్మజా! విధినిర్ణయము బలీయమైనది. భూభారమణగినది. దుర్మతులగు దుర్యోధనాదులు నశించిరి. ధర్మరాజ్యము సకలప్రజలకు శ్రేయోరాజ్యము నీ పాలనలో విస్తరింపవలయును. నీవే అందులకు తగినవాడవని తానెఱిగిన ధర్మ బోధములన్నిటిని ధర్మరాజున కుపదేశించెను. ఐహికాముష్మికానంద సాధనములగు ధర్మసూత్రములు, రాజనీతి, పాలనావిధానము, న్యాయనిర్ణయము, వేదవేత్తల విధానములు, వర్ణాశ్రమ పద్ధతులు, దైవభక్తి మహిమము, అధ్యాత్మిక జ్ఞానము, ముక్తిమార్గము ఇదియది యననేల మానవునికి దివ్యత్వమాపాదించు సర్వము భీష్మునివాక్కుల నుండి అమృతధారలవలె వెలువడినది. ధర్మజుని హృద

యము తేలికబడినది. ధర్మరాజుడు భీష్ముని పాదములంటి "తాతా, ఏదేవు నుపాసించిన మానవజన్మసఫలమై గమ్య స్థానము చేరగలదని సూటిగ ప్రశ్నించినాడు. భీష్ముండు శ్రీకృష్ణుని దిక్కుమొగమై "ఆ శ్రీహరి మనయెదుటనే యున్నా"డని చూపుచు సహస్ర నామముల ఆ విష్ణుదేవుని కీర్తించెను.

భీష్ముడట్లు ధర్మరాజునికి ధర్మబోధ సేయుచునే హృదయ మంతయు శ్రీకృష్ణుని పదపంకజములందు లగ్నము చేసి నాడు. ఏ మహామహుడు శ్రీమన్నారాయణుని యవతారమై లీలామానుషవిగ్రహుడై ధర్మసంస్థాపన కవతరించెనో, ఏ పరమాత్మస్వరూపము తన హృదయపీఠమున నిరంతరము భాసమానమై యుండునో, ఎవని కృపాకటాక్షరేఖామృత ధారకై తపోనిధుల హృదయములు తహతహలాడుచుం డునో, ఆ చిదానందమూర్తి శ్రీకృష్ణభగవానుడు సుప్రసన్న మృదుమందహాసాననుడై తనవైపు చూచుచున్నాడు. ఇంతకాలము పరమాత్మస్వరూపునిగా ఎవనిని లోనెఱింగి, ఎవనిసాయుజ్యము తానందజూచెనో ఆ నారాయణుని సుం దరవిగ్రహము తన కన్నులముం దున్నది. ఆనాడు యుద్ధరం గమున మహాపరాక్రముడైన పార్థుడు తెన్నోంచలేని సమయ మున చక్రధారియై తన్ను పరిమార్చుట కరుదెంచు శ్రీకృష్ణ రూపము భీష్ముని కనులలో మెరసినది. శ్రీకృష్ణుని నానాటి

యుద్యమము తనను భవబంధములనుండి, లౌకిక పాశముల నుండి రక్షించుటకొఱకే యని భీష్మునికి తోచినది. ఇక కొలది క్షణములలో ఉత్తరాయణ పుణ్యకాలము మాఘ శుద్ధ ఏకాదశిరానున్నది. ఈ మరణకాలమున కృష్ణభగవానునికన్న ఆరాధ్యదైవము లేడుగదా - నిశ్చలబుద్ధితో, చిత్తశుద్ధితో, తన సర్వస్వము శ్రీకృష్ణునియందు లగ్నము జేసి చేతులుమోడ్చి ఇట్లు స్తుతించినాడు -

త్రిజగన్మోహననీలకాంతి దనువుద్దీపింప ప్రాభాతనీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెకాడు మదినావేశించు నెల్లప్పుడున్.

ఉదయభానుని పసిడికాంతుల మిసమిసలుగల పట్టు పుట్టమువాడు, ముంగురులు ముచ్చటలు గురియు మోము దమ్మివాడు, మా అర్జునుని తోడైయున్న శ్యామసుందరుడు త్రిజగన్మోహనుడు సదా నా హృదయపద్మమునం దుండు గాక -

హయరింఖాముఖ ధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయమున్ బార్థునకిచ్చువేడ్క నని నాశస్త్రాహతిం జాలనొ
చ్చియు బోరించు మహానుభావు నెదలోఁజింతింతు
నశ్రాంతమున్.

సమరమునం దర్జునుని విజయమే కోరి, అర్జునునకు రథసారథియై వచ్చిన ఆ కృష్ణభగవానుని మోము రణాంగణ మందు లేచిన ధూళి గ్రమ్మి, చిఱుచెమట చినుకులతో ప్రకాశించుచున్నది. నా బాణహతులతో ఆ మహనీయుని నొప్పించి నాను. ఆ దివ్యపూరుషునే నేను నా భావములందు నిల్పు కొనెదను.

నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలో
పరులీక్షింప రథమ్ము నిల్పి పరభూపాలావళి జూపుచుం
బరభూపాయువులెల్లఁ జూపులన శుంభత్కేలివంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుడై.

పాండవకౌరవసేనల మధ్య రథమునిల్పి పార్థున కా మహనీయుడు శత్రుపక్షమున నున్నవారిని చూపు చున్నాడు. ఆతని చూపులు సోకినంతనే శత్రురాజులు నిశ్చేష్టులగుచున్నారు. ఆ పార్థసారథి పరమేశ్వరుడు నా హృదయకమలమున సుస్థిరముగా నుండుగాక.

చక్రము చేపట్టి నామీదికి రాబోవు శ్రీకృష్ణుని రత్నకుండలములకాంతి గగనసీమల కెగసినది. జగన్నాథుఁడు రథమునుండి క్రిందికి ఉరుకుచో భుజములపైనున్న పసిడిపట్టము జారిపడుచున్నది, ఉదరములోనున్న జగముల బరువునకు భూగోళము కంపించుచున్నది, ఈ యుద్ధభారము నా కేవదలుము నీకేల కృష్ణా ఈ తొందర అని అర్జును డాపుచుండగా –

తే.గీ. కరికిలంఘించు సింహము క్రకరణి మెరసి
నేడు భీష్ముని౦జంపుదు నిన్నుగాతు
విడువుమర్జున యనుచు మద్విశిఖవృష్టి
తెరలి జనుడంచు దేవుండు దిక్కునాకు.

అని మనసార అచ్చట శ్రీకృష్ణరూపమున సాకా రుడై యున్న శ్రీహరిని భీష్ముండు ధ్యానించి తాదాత్మ్య మందుచున్నాడు.

ఇదియొక చిత్రాతిచిత్రమైన సన్నివేశము; అభిలాష లొక్కటైనను అన్యోన్యవిరుద్ధములగు వర్తనము లిం దున్నవి. భీష్ముడు పరమధర్మపరాయణుడు. హృదయ ములో పాండవులు విజయులు కావలెనని, అర్జునునకే విజ యము లభింపవలయునని అతని వాంఛ. కాని తాను సశర శరాసనుండై అజేయముగ పోరాడినది దుర్యోధనునిపక్షము వహించి అర్జును నెదిరించి, తాను కాలూని సంగరమున నిలిచినంతకాలము ఎంతమంది అర్జునులైన అసమర్థులే. భీష్ముండు నిరుపమాన హరిభక్తుండు. పరమాత్మ జ్ఞానమెఱి గిన భాగవతుండు. శ్రీకృష్ణున కంతకన్న ఇష్టు లెవరుం డురు- కాని అర్జునునకు విజయము లభింపవలయును లేకున్న ధర్మమే నశించును. భీష్ము నంతమొందించినగాని ఆ విజ యము లభించదు. చక్రము చేపట్టి తనభక్తుండైన భీష్ముని కడతేర్చుటకు శ్రీకృష్ణుడు లేచినాడు. ఆ కడతేరుటలో లభ్యముకానున్న అర్జునుని విజయము భీష్మునకు కావలసి

నదే, శ్రీకృష్ణునకు కావలసినదే. ఇన్ని పరస్పరవిరుద్ధపరిస్థితులలో భక్తునియొక్కయు, భగవానునియొక్కయు అభిమత మొక్కటియే.

తనను చంపుటకే తెంచఁదలఁచిన ఆదేవుడే దిక్కు నాకు అని ధ్యానించుచు శ్రీకృష్ణస్వామి విగ్రహము చిత్తమున నెలకొల్పి భీష్ముడు కనుమూసినాడు. ఆభక్తుని తేజము తనలో లీనముచేసికొనినాఁడా శ్రీమన్నారాయణుడు. ఒక మహత్తరతేజముతో దివినుండి భువికివచ్చిన ఒక మహామనస్వి, ఒక ధర్మదేవత. అంతకన్నను మహత్తర తేజముతో ఉర్విని వీడి ఊర్ధ్వలోకముల కేగినాఁడు. ఆమహానీయుని కీర్తి క్షితినెల్ల నిండినది. ఋషులుచేరి కీర్తించిరి. దేవతలు పుష్పవృష్టి కురిపించినారు. ధర్మజుడు శ్రద్ధాంజలి ఘటించి పితృకార్యము తీర్చినాడు.

భీష్ముని తేజమట్లు భువిపై వెలుగొందిన తుదిదినము భీష్మఏకాదశిగ సర్వభూమికి పర్వము పూజాదినమై నేఁటికిని మిగిలినది.

పురుషుని జన్మము సఫలమై చరితార్థత నందుటకు వలయు సద్గుణములన్నియు భీష్మునియందు పరిపూర్ణముగ నున్నవి. మాతాపితృభక్తి, త్యాగము, పరోపకారము, పౌరుషము, శౌర్యము, ధర్మనిరతి, న్యాయపాలన, రాజనీతిజ్ఞత, వివేకము, సర్వశాస్త్రపరిజ్ఞానము, పరమాత్మజ్ఞానము-మున్నగు ఉత్తమోత్తమ లక్షణములన్నియుమూర్తిభవించిన సమగ్రమహామనస్వియు పుణ్యపురుషుఁడతడు.

---

# 8. సంకీర్తనము - ప్రహ్లాదుఁడు

కం॥ గుణనిధియగు ప్రహ్లాదుని
గుణము లనేకములు గలవు గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు
ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్.

దానవపతియైన హిరణ్యకశిపుని కుమారుఁడు ప్రహ్లాదుఁడు సకలసద్గుణ సంపన్నుఁడు. ఆదిశేషుడు, బృహస్పతి తుదకు బ్రహ్మయైనను ఆ బాలునిసుగుణము లింతింతయని వర్ణింపఁజాలరు. సద్గుణనిధియగు ప్రహ్లాదునకు వాసుదేవుని యందు సహజసంవర్థమాన భక్తిధ్యానములు సంపూర్ణముగ ప్రకాశించినవి.

బ్రహ్మవరములచే మదోన్మత్తుఁడై లోకకంటకుడై హిరణ్యకశిపుడు ముల్లోకములకు పెద్దపీడగా పరిణమించెను. తపస్సిద్ధులైన మునులుగూడ ఆ రాక్షసునికి వెఱచి యూరకుండిరి. దేవత లారక్కసిబాధలకు తాళలేక రక్షింపుము దేవాయని శ్రీహరిచరణములంటి ప్రార్థించిరి. సాధుజనరక్షకుఁడు కరుణాళుఁడైన యా కేశవుడు, విపన్నులైన విబుధులఁజూచి-

మ॥ భయముం జెందకుఁ డయ్య నిర్జరవరుల్ భద్రంబు మీకయ్యెడున్
జయమున్‌లాభము భూతసంతతికి మత్సందర్శనప్రాప్తి న

వ్యయమై చేరు, నెఱుగుంచున్ దితిసుతవ్యాపార
భాషావిప
ర్యయముల్ కాలముగూడఁ జంపెద జనుండందాక
మిూత్రోవలన్.

హిరణ్యకశిపుని దురితము లాతనినే కట్టి కుడుపును. కాలము కూడిరావలెను. హరిభక్తుఁడైన యాతనిసుతుఁడగు ప్రహ్లాదుని నాతడెప్పుడు హింసింపఁదలచునో అప్పుడు నేనే స్వయముగ ఆ హిరణ్యకశిపుని పరిమార్తును అని అభయమిచ్చి పంపెను.

ఇది బాలభక్తుఁడు, హిరణ్యకశిపుని పుత్రుఁడునగు ప్రహ్లాదుని కథావస్తువు.

ప్రహ్లాదుఁడు పరమభాగవతులలో పరిగణింపఁబడిన మహాత్ముఁడు. శ్రీవిష్ణువును తనయెట్టయెదుట ప్రత్యక్షము జేసికోఁజాలిన భక్తవరేణ్యుఁడు. ఇంతటి భక్తిపారవశ్యము అయిదారేండ్ల చిఱుతప్రాయమునాఁడే పొందఁగలిగిన పుణ్యపురుషుఁడితడు. మహాక్రూరరాక్షసుఁడగు హిరణ్యకశిపుని కుమారుడు; అయిననేమి రాళ్ళగోతులనుండి రత్నముద్భవించిన చందమున భక్తాగ్రణియై ప్రఖ్యాతినందెను.

సర్వసంపదలకు నిలయము, సౌందర్యశోభితము, వర్ణనాతీతవైభవోపేతమని విష్ణుమూర్తి నెలవగు వైకుంఠమును తలచుకొనుచుందుము. అదియెచ్చటనో సుదూరమగు ఊర్ధ్వలోకమందున్నట్లు తలంతుము. ఇదియొక ఊహాసుందరమగు

యోచన. సర్వ జగన్నాథుఁడు లోకరక్షకుఁడైన ఆ మహా విష్ణు వెచ్చట నివసించుచున్న నేమి, భక్తుల హృదయము లందు, యోగిజనుల యుల్లములందు. మునీంద్రుల మానస మందు వసించుచు పిలిచినపుడెల్ల పలుకును. ఇది సత్యము. తగిన సాధనాపరిణతి సమకూడవలెయునేకాని భగవంతుఁడు భక్తసులభుఁడని ప్రతి భక్తుని చరిత్రము సుస్పష్టము చేయును.

అభ్యాసముచే భక్తినలవఱచుకొనవచ్చును. తప స్సాధనచే, శమదమ సద్గుణములచే, ధ్యాననిరతులై దైవ మునకు దగ్గఱగా చేరవచ్చును. అంత కాలవ్యవధిలేదు, అయిదేండ్ల బాలప్రహ్లాదుడే భక్తవరేణ్యుఁడయ్యెను. బలీ యమైన పూర్వవాసన యుండవలయును ఇట్టి సిద్ధికి. ఆకస్మి కముగ ఆకసమునందుండి ఊడి పడునదిగాదు భగవద్భక్తి.

ఒకయాఖ్యానమిట్లుచెప్పెదురు. హిరణ్యాక్ష హిరణ్య కశిపులు దితికుమారులు. మహాబలవంతులైన క్రూరాసు రులు. శ్రీహరియందు బద్ధవైరులు. హిరణ్యాక్షుని శ్వేతవ రాహరూపుడై శ్రీహరి వధించెను. ఆకారణమున హిరణ్య కశిపుడు మరింతక్రుద్ధుడై అజేయవిక్రమమునందగోరి తగిన వరములుబడయుటకై బ్రహ్మనుగూర్చి తీవ్రమైన దీర్ఘతప మొనరింపనేగను, ఆయదనుగన్పెట్టి దేవేంద్రుఁడు దైత్యు లపై దండెత్తి ఓడించి హిరణ్యకశిపునిభార్య గర్భవతియైన లీలావతిని గొనిపోయెను. నారదమునీంద్రుఁడమరేంద్రుని

కడ్డుపడి, ఇంద్రా! నీకిదితగదు, లీలావతి మహాసాధ్వి. ఆమె గర్భముననున్న శిశువు విష్ణుభక్తుడు. నీవుచేయగోరినను వీరినేమియు చేయలేవు. ఈమెను విడచుటయే నీకు శ్రేయమని నుడువగా ఇంద్రుడామెనువదలెను. నారదుడా లీలావతిని గొనిపోయి తనయాశ్రమమున ఆశ్రయమిచ్చెను.

ఇచ్చుటేకాదు, లీలావతికి ప్రతిదినము విష్ణుచింతనము, ఆధ్యాత్మికతత్త్వము, దైవభక్తి వైశిష్ట్యము, మానవనీతి వేదమార్గములు మున్నగు ఉత్తమ ధర్మమార్గములు బోధించుచుండెను. మున్యాశ్రమముల జీవనపద్ధతులు వాతావరణము ఆచారవిచారము లెట్టివి ?

సాధువాదసంకలితములు, సత్వగుణసమాశ్రయములు ప్రశాంతిసుందరప్రదేశములు, నిత్యహరికీర్తనానిలయములు. అందునను దేవమునీంద్రుడగు నారదముని యావాసమయ్యెనది- లీలావతి సహజముగ సాధుసద్గుణశీల. ఆ యాశ్రమమున నున్నంతవరకు ఆమెపీల్చిన ప్రతివాయులవము, ఆమెగ్రోలిన ప్రతిజలకణము, ఆమెవినిన ప్రతిపదము, ఆమె మనోవాక్కాయములందు విష్ణుభక్తిని పెంపొందించినవి. ఆమెకిపుడు తలంపులన్నియు శ్రీహరిమయములు - దుష్టుల దుర్మార్గముల నంతమొందించుటకు మూలకారణ బీజములనెచట నిక్షేపింపవలయునో జగద్రక్షకుడైన ఆ శ్రీహరికే తెలియును. లీలావతి గర్భస్థమయిన శిశుమూర్తి యాంతర్భక్తి

బీజము నాటెనవి. లీలావతి నిరంతర పుణ్యభావనాఫలము ఆమె గర్భమునుండి, పాలకడలినుండి అమృతభాండమువలె ప్రహ్లాదు డుదయించినాడు.

నందనారామ మందారమువలె అయిదేండ్ల వయసు నాటికే ప్రహ్లాదుని సద్గుణములు భాసించినవి. సకల ప్రాణులను సమబుద్ధితోఁ జూచును. పెద్దలను పూజించును. స్త్రీలందఱు తనకు మాతృసమానులు. మిత్రులందఱు సోదరప్రాయులు, గురువులు దైవసమానులు, దీనులకు తనకోలది సాయపడును. పరిహాసమునకైన అనృతమాడడు. రాజ్యసంపద యున్నది. సర్వభోగములున్నవి అని గర్వముగాని విషయవాంఛలుగాని మచ్చుకైన ఆ బాలునియందు గనబడవు. ప్రహ్లాదునకు తెలిసినది, ప్రహ్లాదుడు పాటించునది అనుక్షణము హరిచింతనము. ఆ బాలుని హరిపరతంత్రత హరిభక్తి పారవశ్యము దేవతలకే అద్భుతాశ్చర్యమనిపించినది.

ప్రహ్లాదుని హరిభక్తిపారమ్యము ఇట్టిదని వర్ణించి చెప్పుట కలవికానిదిగా పెంపొందినది. సహస్రజిహ్వలున్న సర్పరాజే వర్ణించలేడనిన అతిశయోక్తిగాదు. శ్రీహరి స్వయముగ తనతోనున్నట్లు తనతో ఆడుచున్నట్లు తనతో భాసించుచున్నట్లే తన్మయుఁడై తనయాటపాటలు మఱచును. ప్రహ్లాదునిసర్వము ఇప్పుడు హరిభక్తిమయము. శ్రీహరి కనుపించలేదే అని ఒంటరిగా కూర్చునియేడ్చును.

హరిని భావించి ఎలుగెత్తి పాడును. ఆ జగన్నాథుఁ డిడిగో నా వద్దనే యున్నాడని సంతసమున గంతులువేయును. ఆ భక్తి పారవశ్యమున పులకితసర్వాంగుడై కన్నులనుండి అశ్రువులు గార్చుచి ఏదియోసమాధిగ్రస్తుఁడైనట్లు కన్పట్టును. ప్రహ్లాదునివర్తనమునభావనమున శ్రీహరి సాంగత్యముతప్ప అన్యప్రసక్తియే లేదు-

శా॥ పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులుసేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుడేతద్విశ్వమున్ భూవరా!

హరిచింతామగ్నమానసుడు, హరికీర్తనాపారీణుడు, హరిభావనామృతాస్వాదపరితుష్టుడయిన ప్రహ్లాదున కన్య వర్తనమేల రుచించును. హరిభక్తిమాధురులతో ఆ బాలు హృదయము నిండినది. అది ప్రహ్లాదునిపూర్వజన్మ సుకృత ఫలము. అట్టి భక్తికితోడు సంసారబంధసాంగత్యాభిలాష లేని నిశ్చలవైరాగ్యభావము అలవడినది. తనయెదుటనున్న శ్రీహరియొక్కడు తక్క మఱియొకవస్తు వీ విశ్వమునన్న దనుతలంపే లేదు ప్రహ్లాదునకు-

తన తనయుడు తనకు మంచి పేరుకీర్తులు వచ్చునట్లు జేయును. తనకు లభ్యమయిన అమరలోక సామ్రాజ్యము నేలును. త్రిలోకములను తన కెదురులేక ఏకచ్ఛత్రముగ పాలించుననుకొని కలలు గాంచుచున్న హిరణ్యకశిపునికి ప్రహ్లాదుని ప్రవర్తన ఆశాభంగము కావించినది. ఈ వయసు నందే బాలురకు తగిన గురువులచే విద్య నేర్పించుట మంచి దని తలచి హిరణ్యకశిపుడు రాక్షసగురువగు శుక్రా చార్యుల పుత్రులైన చండామర్కుల రావించి, రాక్షసాధి పతికి వలయు విద్యలన్నియు ఈ బాలకునకు నేర్పుడని ప్రహ్లా దుని వారితో నంపెను. గురువులు చెప్పినదెల్లను ప్రహ్లా దుడు శ్రద్ధతో వినును. తనకు ఇష్టమగు ఈశ్వరభక్తి చెప్పుటలేదని తిరస్కరించడు. తన మనసున హరినామస్మర ణాము మానడు. కొన్నిదినములాగి తనయు డెంతవరకు విద్వాంసుడయ్యెనో తెలిసికొనుటకు హిరణ్యకశిపుడు ప్రహ్లా దుని బిలిపించి నీ చదువెంతవరకు వచ్చినది, నీకు తెలిసిన విషయము చెప్పుము నాయనా అని అడిగెను. అంత ప్రహ్లా దుడు "తండ్రీ ! ఈ విశ్వమంతయు శ్రీహరి దివ్యకళా మయము. ఆ విష్ణుదేవుని స్మరించి కీర్తించుటకన్న ఉత్తమ కార్యము నాకు కన్పడుటలేదు'' అనిన కుమారుని మాటలు విని హిరణ్యకశిడు భగ్గున మండిపడినాడు. "కుమారా ! నీకీ దుర్బోధ లెవరుచేసిరి, శ్రీవిష్ణువు మనకు శత్రువు. శిక్షార్హుడు. నీవు నేర్వవలసిన దిదికాదు; త్రిలోకములను

జయించి, దేవతలను ముప్పాతిప్పలు పెట్టి నర యక్ష కిన్నర గంధర్వాదులను రూపుమాపి మునివాటికలను ధ్వంసమొనర్చి అవక్రవిక్రమంబున పాలనము సాగించుట నీవు నేర్వవలసి నది, తెలిసినదా"యని తండ్రి ధట్టించి నుడువగనే ప్రహ్లా దుఁడు –

"తండ్రీ ! నీవు పొరబడుచున్నావు. మాయామోహా ములందు మునిఁగినవారు అజ్ఞానమున అచ్యుతుని మహిమ నెఱుఁగక మూఢులై యుందురు. వీనిని వదలిన జ్ఞాను లే దేవుని పాదపద్మములఁ జేర ఆసింతురో ఆ పరమేశ్వర ధ్యానము, కీర్తనమే నా లక్ష్యము. హరిభక్తి మాధుర్య మెఱుఁగక నీవట్లు మాటాడుచున్నావు, వినుము —

సీ. మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునె మదనములకు
నిర్మలమందాకినీ వీచికల దూగు
రాయంచసనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురిత చకోరకం
బరుగునే సాంద్రనీహారములకు
అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేష మత్త

చిత్తమేరీతి ఇతరమ్ము జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల.

తేనెటీగ సుమమకరందములకడకే యేగును. రాయంచ నిర్మలోదకములందే విహరించును. కోయిలకు లేలేతమావి చిగురులే యిష్టము. చకోరపక్షి చల్లని నిండువెన్నెల కాసపడును. మఱియొకచోటికి అవి పొమ్మన్నను పోవు. శ్రీవిష్ణుని పాదసేవామాధుర్య మెఱింగినవానికి మనస్సు మఱియొకచోటి కేగదు. నామనస్సు అట్టిదే. వేయిమార్లు చెప్పనేటిం దులకు'' అని నిర్భయముగా పలుకు ప్రహ్లాదుని చూడగనే హిరణ్యకశిపునకు అరకాలుమంట నెత్తికెక్కినది. ఛీ! నీచా! నీవు నాకు శత్రువుగాని కుమారుడవు గావని పడ ద్రోసినాడు. చండామర్కుల రావించి చీవాట్లు పెట్టినాడు. మీరీ బాలకుని సరిగా చదివింపలేదు. బుద్ధిగలిగి వీనికి తగిన నీతులుజెప్పి తీసికొనిరండని కోపోద్రేకుడై పంపినాడు.

చండామర్కులకీబాలుడు కంఠమున గుదిబండయే యైనాడు. వీరు చెప్పునది వేరు, ఆశిష్యునకు కావలసినది వేరు. సురభికుసుముతో పరిమళమరుగునట్లు ప్రహ్లాదుఁ డెచ్చటికేగిన అచ్చట విష్ణుభక్తి మాహాత్మ్యమే వర్ణించుచున్నాడు. తోటిబాలురను పిలుచును. "అన్నలారా! వినుడు, మనకీగురువు మంచిమార్గములు బోధించుటలేదు. మనచుట్టును చూడుడు– శిశుమరణములు, చిరకాలరోగము

లతో ఎందఱు బాధపడుతున్నారో. ఈబాధలు లేకుండ ప్రాణులకెల్లరకు ఐహికాముష్మిక సుఖశాంతులు ఆనందము నిచ్చు మార్గము మాధవుని పూజయే'' యని విష్ణుకీర్తనము వారికి నేర్పును. తనతో భాషించు నెల్లరతోడను ఈవిషయమే నుడువును. కర్ణాకర్ణిగ విని ఈసంగతులు హిరణ్యకశిపుడు కనుపెట్టుచునే యున్నాడు. తుదకు చండామార్కులకు మఱియొకమార్గము తోచక హిరణ్యకశిపుని కడకేగి ప్రభూ! మీబాలునికి మేమిటుపైని శిక్ష గఱపలేము. మేము చెప్పవలసిన రాక్షసవర్తన విధులన్నియు చెప్పితిమి. విరోధమార్గములు బోధింపలేదు అని ఆబాలుని నటవిడచి చనిరి.

హిరణ్యకశిపు డాయర్భకు నరసి "కుమారా! నీచదువు పూర్తియయినదా? ఏమితెలిసినది నీవు చదివిన శాస్త్రము లలో- పద్యం బొక్కటి చెప్పి సార్థముగ తాత్పర్యంబు భాషింపుమా అని యడిగిన తండ్రిని జూచి ప్రహ్లాదుఁడు తండ్రీ!

కం. చదివించిరి నను గురువులు
చదివితి నే ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నే
జదివినవిగలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ.

నేను సర్వశాస్త్రములు చదివితిని. వాని రహస్యములు తెలిసికొంటిని. ఆ చదువులలో నేను గ్రహింపఁగలిగిన మర్మ

మును వివరించెద వినుము. ఈ రాజ్యములు, ఈ అధికారములు, ఈ భోగభాగ్యములు వ్యర్థములు. మాయామోహ పాశములు. ఈ బంధములనుండి తప్పించుకొని శాశ్వతమైన ఆత్మానంద మనుభవించుటకు శ్రీహరి ధ్యానముతప్ప మఱి వేరు దారిలేదు. మన శక్తికొలంది ఏ మార్గముననైన మాధవుని సేవింపవచ్చును.

మ. తనువాఙ్మానసపూజనల్ సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనమున్ సేవయు నాత్మలోనెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచు దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా.

ఇట్లు వివిధమార్గములలో విష్ణుసేవ గావించి మహాభక్తులుగ జన్మము సఫలము జేసికొనినవా రున్నారు. తండ్రీ! నీవును అట్లు చేయుము. హరిభక్తి లేని జీవితములు బూడిదలో పోసిన పన్నీరువంటివి."

ప్రహ్లాదుఁ డెంతవరకు తనయాట సాగించునోయని తనలోని క్రోధము బిగబట్టి హిరణ్యాక్షు డట్లే చూచుచున్నాడు. తండ్రి మౌనముగాంచి ప్రహ్లాదుఁ డెలుగెత్తి శ్రీహరికీర్తనము నారంభించినాడు. ఆ బాలుని కేదో తన

ప్రార్థనము సఫలమై తనజన్మము చరితార్థమగు క్షణము సమీపముననే యున్నదను ఆశ యుదయించినది. ఆయాశతోపాటు ధైర్యము వచ్చినది. తండ్రిగాని, మఱొక్కరుగాని హరికీర్తనమునం దాసక్తి లేనివారితో తనకు పనిలేదు. శ్రీహరి విగ్రహము తన హృదయమున సుస్థిరముగనున్నది. తనముం దున్నది. తన కన్నులలో మెఱయుచున్నది. తనకున్న సర్వావయవములు శ్రీహరిసేవ కుపయోగపడినప్పుడే తన పుట్టువు ధన్యమగును. “తండ్రీ ! వినుము” అని ప్రహ్లాదుఁడు మరల తనభాషణము సాగించినాడు.

కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁజూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికిమ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁదవిలిన మనము మనము
భగవంతువలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి
దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడు గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁజేరుమనియెడు తండ్రి ! తండ్రి !

తండ్రీ ! నాకిట్టి హరిమార్గ ముపదేశ మిప్పింపుము. ఇంకను వినుము —

కమలాక్షునకుఁగాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మభస్త్రి గాక
వైకుంఠుబొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశుఁజూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాలరంధ్రములు గాక
చక్రిచింతనలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువుగాక.

హిరణ్యకశిపు డీమహోపన్యాసమును వినినాఁడు. తాను కనిన కుమారుడే తనను పశువుతో సమము జేసినాడు. ఇంకెట్టి మాట లాబాలునుండి వచ్చునో. ఈపైని తానొకపలుకైన వినఁజాలడు. క్రోధము పెల్లుబికి వచ్చినది. మొగము కందగడ్డ యయినది. కనులు నిప్పులు గ్రక్కినవి. ప్రహ్లాదు నొక్కతన్ను తన్నినాడు. "ఓరీ ! నీవు నాపుత్రుఁడవు గావురా. నా శత్రుఁడవు. నాకన్న అధిపతి ముల్లోకముల లేదు. రాక్షసకులమున విషపుతీగవలె జన్మించి

ఎవఁడో పాలుబోతు శ్రీహరిని మాటిమాటికి కీర్తింతువు. నిన్ను సైరించినచో అసురవంశనాశనమే యగును. నిన్ను నిర్బంధించి బుద్ధివచ్చువరకు పలుహింసల పాలుజేసెదను. నీకు దిక్కెవరో చూచెద"నని కఱకుగుండెల కింకరులను బిలచి ప్రహ్లాదుని దోడ్కొనిపోయి నిర్దాక్షిణ్యముగ హింసింపుఁడని కఠినాజ్ఞ నిచ్చెను.

ఆ కింకరులకు దేవేంద్రుఁడనినను లెక్కలేదు. జనులను మునులను హింసించి బాధించుటలో హిరణ్యకశిపుని కన్న ఆరితేరిన క్రూరులు- ప్రహ్లాదుని రెండు కాళ్లు త్రాటితో గట్టి ఈడ్చుకొనిపోయిరి. చూచినవారి గుండెలు చెరువులైనవి. ప్రహ్లాదుని నేలమీద బడవైచి కాళ్ళతో త్రొక్కి కత్తులతో పొడచి గదలతో మొత్తిరి. ఆబాలుని శరీరములో నేమున్నదో దేహముకందనైనలేదు. సముద్రమునఁద్రోసిరి. చిలుచేఁవలె పైకి వచ్చినాడు. పర్వతశృంగములనుండి పడ నెట్టిరి. చిటికిన వ్రేలికైన దెబ్బతగులలేదు. పాములచే కఱపించిరి. ఆ విష మమృతతుల్యమైనది. ఆ కింకరులకు విసువెత్తి ఆబాలు నగ్నిమంటలలోఁ బడవైచిరి. అగ్నిజ్వాలలు పూలపాన్పులైనవి. ఇక చేయునదిలేక జరిగినదెల్ల హిరణ్యకశిపునకు జెప్పిరి. ఆ బాలున నొకచెట్టునకుకట్టియుంచితిమి ఇకమీద మేమేమియు చేయఁజాలమని చేతులు జోడించి వెనుకకుఁ బోయిరి.

మఱునాడు సభాభవనమున ఒంటరిగ కూర్చున్న హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు తలపునకువచ్చుటతో మతి పోయినట్లయినది-

ఉ॥ ముంచితివార్ధులన్ గదలమొత్తితి శైలతటంబులందు ద్రో
బ్బించితి శస్త్రరాజిఁబొడిపించితి మీదనిభేంద్రపంక్తి ద్రొ
ప్పించితి ధిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందు ద్రో
యుంచితి బెక్కుపాట్లనలయించితి జావడిదేమి చిత్రమో.

చం॥ ఎఱుగడుజీవసౌషధము లెవ్వరుభర్తలు లేరు బాధలం
దరుగడు నైజతేజమునదర్పము జాడ్యము లేదు మిక్కిలిన్
మెఱయుచునున్నవాఁడొకనిమేషము దైన్యమునొందడింక నే
తెఱగున ద్రుంతు వేసరితి దివ్యము వీనిప్రభావమెట్టిదో-

ప్రహ్లాదునిగూర్చి యాలోచించిన కొలఁదియు హిరణ్యాక్షున కొకవిధమగు భయమే కలుగుచున్నది. చంపెదననుకొన్నను వీడు చచ్చుటలేదు. "తుట్టతుదకిది నాకే యేదియో విపత్తు తీసుకొనివచ్చునేమో"- ఇట్లనుకొనుచు తలపట్టుకొని చింతించుచు కూరుచుండెను-

కింకరులచే నిర్బంధితుడైన ప్రహ్లాదుఁడెట్లువచ్చునో తండ్రికూరుచున్న సభాగారమునకు వచ్చెను. ఈనాఁడు

ప్రహ్లాదుని వేషమే వేరు. పట్టుపీతాంబరము ఆపైని బంగారు జలతారు, నీలిరంగు ఉత్తరీయమొకయందముగా నడుమునకు చుట్టుకొనెను. మెడలో పూలమాలలు, ఫాలమున ఊర్ధ్వపుండ్రములు, కాళ్ళకు గజ్జెలు, ఎడమ చేతిలో చిడతలు, కుడిచేతి నొకయందముగా త్రిప్పుకొనుచు విష్ణుమూర్తిపై పాటలు పాడుకొనుచు వచ్చెను. ప్రహ్లాదుని మొగమున ఒక కాంతిమంతమగు తేజ ముట్టిపడుచున్నది. అధరములపై మధువులొలుకు మందహాసము భాసించుచున్నది. నిరంతర హరికీర్తనాపరుడగు ఒకచిన్ని నారదునివలె ఆబాలుడచటకనుపట్టెను. ఊరివారందరు అతనివెంటఁబడిరి. ప్రహ్లాదునిలో కనుపట్టు ఆకర్షణకు ఆశ్చర్యపడుచుండిరి. ఎవరో కొందరు ముఖ్యపౌరులు మాత్రము ప్రహ్లాదునివెంట ఆ సభాభవనమున ప్రవేశించిరి.

ప్రహ్లాదుఁ డాపగిది ఒకనూత్నవర్తనమున నర్తించుచు, ఒకభద్రాసనమున చింతాముద్రనున్న హిరణ్యకశిపుని తండ్రీ! యని కూరిమిమై సంబోధించగనె మేలుకువ దెచ్చుకొని కుమారునివైపు మొగమై, హిరణ్యకశిపుడు ఆకాంతిసందీపిత విగ్రహమును ఆముఖతేజమును చూడలేక మారొమొగమిడి, "ఆహా! యేమిది ముల్లోకముల గెలిచిన నేను నా కుమారుని ముఖతేజమే చూడలేకున్నాను" అనుకొనునంతలో ప్రహ్లాదుడు తండ్రీ! నేను చదివిన చదువులలో సారమేదియో ఒకటి రెండుసార్లు చెప్పితిని. నాకు

తెలిసిన విషయము నీకు నచ్చినట్టులలేదు. తుదిసారి మఱి యొకమాటు వినుము. ప్రాణులెల్లరు హరిభక్తివలన లభించు ముక్తిమార్గమునఁగాని సంసార బంధములువీడి శాశ్వతా నందముగలుగదు. లౌకికసుఖములు అశాశ్వతములు సంసా రము నిజమునకొక నరకకూపము అని తనచిన్ని పాదములందలి గజ్జెలుఘల్లని మ్రోయనాడుచు పాడ మొదలిడినాడు.

సీ॥ సంసార జీమూతసంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీలదావాగ్ను లారునే
విష్ణుసేవామృత వృష్టి లేక
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే
హరిమనీషా బడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారము లడగునే
పద్మాక్షునుతి రవిప్రభలు లేక
నిరుపమాన పునరావృత్తి నిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గ కోదండ చింతనాంజనము లేక
తామరసగర్భునకు నైన దానవేంద్ర !

మనకెల్లరకు ఆ విష్ణుదాస్యమే శరణ్యము. ఆ ముక్తిని చూఱగొనుటే లక్ష్యము తండ్రీ ! అని ప్రహ్లాదుడింకేమేమి యోనుడువబోవుచుండ హిరణ్యకశిపుడు మహోగ్రుడై లేచి ఓరీ డింభకా, మూఢా ! కులవిధ్వంసకా ! శత్రుపక్షపాతీ!

నీవా, ప్రేలెదు లేవు, నాకు చెప్పువాడవు. మా తమ్ముని జంపి పందియై పారిపోయిన ఆ విష్ణువా నీకు జగన్నాథుఁడు- నా కన్న వీరుఁడు ధీరుఁడు అధిపతి ఈ యఖిల బ్రహ్మాండమున వేఱొకఁడు లేడు. శ్రీహరి! శ్రీహరి! యని కారులు ప్రేలు చున్నావు. ఎక్కడరా నీహరి, గిరి, కనపడినచో ఇదే ఆ శ్రీహరిని నాగదాదండమున తల పగులగొట్టెదను. లేకున్న నీతల బ్రద్దలగును. నా బాధలడఁగును. శ్రీహరియందు నీ కంత విశ్వాసమున్నచో ఈ క్షణములోనే ఆతడెందున్నాడో చూపుము. వానిరక్తము రుచిచూచెదను- అని వజ్రాయుధ మునుబోని ఒకఇనుపగదనుదాల్చి తాళవృక్షమెత్తున లేచి హిరణ్యకశిపుడు దిక్కులు పిక్కటిల్లు గర్జనతో ముందున కురికినాడు. ఆ మహారాక్షసుని పాదఘట్టనకు భూమి కదలాడిపోయినది-

ప్రహ్లాదుడు చిఱునవ్వు, తండ్రీ! నీమాటలు విని నా కమిత సంతోషము కలిగినది. ఈనాఁటికైనను శ్రీహరి యెక్కడున్నాడని నినోటితో అడిగితివి. నీకే కాదు మఱెవ్వరికికూడ ఈ ప్రశ్నకు తావులేదు- ఆ జగన్నాథుఁడు ఆ భక్తరక్షకుఁడు ఆ శ్రీహరి-

మ॥ కలడంభోధి గలండు గాలి గలడాకాశంబున గుంభినిం
గలదగ్నిం దిశలన్ బగళ్ళ నిశలన్ ఖద్యోత
చంద్రాత్మలం

గల డోంకారమునం ద్రిమూర్తుల ద్రిలింగవ్యక్తు లం
దంతటన్
గలడీశుండు గలండు తండ్రి వెదకంగా నేలయీయా
యెడన్.

ఆ శ్రీహరి ఆ భక్తరక్షకుడు ఆముక్తి ప్రదాత అన్ని చోటులను కలడు తండ్రీ—

కం॥ ఇందుగల డందు లేడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
అందందే గలఁడు దానవాగ్రణి వింటే.

మఱునిముసములో తనతండ్రి గదాహతికి తలపగుల వలసిన ప్రహ్లాదుఁడు అయిదేండ్ల బాలుడు నిర్భయముగ ఈ మాటలనెను. ఎంత ఆత్మవిశ్వాసము! ఎంత ధైర్యము—

హరిలేడను తండ్రికి, హరి అంతటనుగలఁడను కుమారునిమాటలకు మధ్య లోకోత్తరమగు ఒకమహత్తర విశేషమున్నది. భక్తుని భక్తి యెంత నిశ్చలమైనదో యెంతనిర్మలమైనదో యెంత పరిణతినందినదో తుదివరకు పరీక్ష చేసినఁగాని భగవంతునికి తృప్తిలేదు. ఆ పరీక్ష నిజముగ ప్రాణాపదయే. గజేంద్రుని కట్లైనది. అంబరీషున కట్లైనది. మహాభక్తుల కథలన్నియు ఇట్లేయుండును. ఈ సంబంధమిక్కడ తారుమారైనది. తనభక్తుఁడైన ప్రహ్లాదుడనిన శ్రీహరి చెవులలో పెద్దపరీక్షలై మారుమ్రోగినవి. "శ్రీహరి

ఎందుజూచిన అందేయుండును" అని ప్రహ్లాదుఁడు తండ్రితో ననెను. ఈ పరీక్షకు తాను నిలవవలయును. లేకున్న ఆ చిట్టి ప్రహ్లాదుని తలబ్రద్దలగును. హిరణ్యకశిపుని ఇనుపపాద ములక్రింద ముల్లోకములు నలిగి చూర్ణమగును. లోకమున ధర్మవ్యవస్థ ఇంతటితో సరి— హిరణ్యకశిపుడు ఎచ్చట శ్రీ హరిని చూపమని అడుగునో ఇంత విశాల విశ్వమున తానెందుండవలయును ? ఆలోచనలకు అరనిముసమైనను తావులేదు—

మ॥ హరిసర్వాకృతులం గలండనుచు ప్రహ్లాదుండు
భాషింప స
త్వరుడై యెందును లేడు లేడని సుతున్ దైత్యుండు
తర్జింప శ్రీ
నరసింహాకృతినుండె నచ్యుతుడు నానాజంగమస్థావరో
త్కరగర్భంబుల నన్ని దేశముల నుద్దండప్రభావంబునన్.

శ్రీవిష్ణువు విశ్వమయుడు, విశ్వాత్మకుడు. విశ్వవిశ్వ మున ప్రతి అణువునందు నృసింహాకృతి నుండెనట. నరుడు, మృగము కాని ఆరూపమేలనో, ఆ భీకరాకార మెందులకో ? ఈక్షణ మదియే అవసరము వచ్చినది. నరులు సురలు అసురులు యక్ష కిన్నర గంధర్వాదులు ఇతరు లెవ్వరిచేతను, జంతువులచేతను గూడ చావులేని వరబలమున్న దర్పోద్ధ

తుఁడు హిరణ్యకశిపుడు. అతనినిఁ జంపుటకు నరుడు మృగము గాని రూపమే ఆవశ్యకమైనది.

ప్రహ్లాదా! నీ శ్రీహరి అన్నిచోటులను గలఁడని అరచు చున్నావు, ఈ స్తంభమున శ్రీహరిని చూపగలవా, లేదేని ఈ నిముషముతో నీ కాయువు సరి- అని హిరణ్యకశిపుఁడు వేయి మేఘములు చేసిన ప్రళయగర్జనవలె హుంకరించి, ప్రహ్లాదుని ధిక్కరించి, ఒక మహాఖడ్గమును గైకొని ఆ యెదుటనున్న స్తంభము నొక్క వేటున విఱుగఁగొట్టెను. ఆకాశమే బ్రద్దలై పడినట్లు స్తంభము ఫెళఫెళమని ముక్క లైనది. ఆ స్తంభగర్భము నుండి బ్రహ్మాండకటాహంబు బ్రద్దలై చిటచిటమను మహోత్కటారవం బొప్ప భూన భోంతరము లాక్రమించు సహస్రభానుప్రభా సమాన తేజం బెసంగ మహాగ్నికుండజాజ్వల్యమానశిఖశిఖాసన్నిభ నేత్ర యుగ్మముగ్రమై దీపింప, కరాళవహ్నిజ్వాలాచేలవిలాసా లోలజిహ్వాంచలమున కిరుదెసల ప్రళయాభ్రప్రభూతోరు విద్యుత్ప్రభాధగద్ధగాయమాన దంష్ట్రాంకూరమ్ములు మెరయ, కంఠస్థలాలంకారిత సటాజటోత్కటాటోప పాటవం బతిశ యింప, శంఖ చక్ర గదా శార్ఙ్గాయుధ హస్తుఁడై, వైజయంతీ కౌస్తుభహార కేయూర మణిభూష దుకూలాద్యలంకార కాంతి సంయుతుండై యుద్భవించిన నృసింహాకారుండైన నారాయ ణుండు హిరణ్యకశిపున కెదురై తన పాదహాతికి సప్త

పాదోధి సమావృతాఖిల వసుధాతలం బుత్కంపించు మహా విజృంభణమున దుస్సహ దుర్దాంత దుర్నిరీక్ష్య తేజమ్మున,

"ఓరోరి పాపీ! హిరణ్యకశిపా! ఇదే చూడుము. నేను శ్రీహరిని. ఈ చిఱుతబాలకునిపై నిరర్థకశుష్కార్భటులు కాదు, నీకు శక్తియున్నచో నాతో పోరుము'' అని హిరణ్యకశిపుపై లంఘించి తన యంకతలమున కీడ్చి నిశితనఖముఖాగ్రములతో జీల్చి హిరణ్యకశిపుని ఖండఖండములుచేసి దేహభాగమ్ము లెక్కడివక్కడ ముక్కలై రాలి, రక్తంబు లేరులై పార మాంసపుముద్దలు రాశులై పడి, ప్రేగులు ప్రోగులై ప్రేళి యా సభాభవన మొక పీనుగుపెంట యయినది. పరమ భాగవతశిఖామణియగు నొకపసి నిగ్గులారని బాలుని హింసింపబోవు దుష్టునికి జరిగిన శిక్షయది. రాక్షస కులమున హాహాకారములు రేగినవి, భక్తునియెడ భగవానునికిగల వాత్సల్యమున కాహా యని సుజను లాశ్చర్యపడిరి.

భక్తరక్షకుడై యేతెంచిన యా పరమేశ్వరుని తిలకించు మహాభాగ్యమునకై బ్రహ్మ వచ్చెను. ఇంద్రాది దిక్పతు లరుదెంచిరి. సర్వామర యక్ష కిన్నర గంధర్వ ముఖ్యు లేతెంచిరి. వైష్ణవగణములు విచ్చేసిరి. ముని ముఖ్యులు చనుదెంచిరి. చేతులు జోడించి, "దేవా! దేవాది దేవా! నీవు విశ్వకారణుడవు, విశ్వమయుడవు. విశ్వసృష్టి స్థితిలయములు నీలీలలు. దుష్టశిక్షణ భక్తరక్షణములు నీనియమములు, సాధుజనోద్ధరణము నీ యుద్యమము. నీ మహిమ

వర్ణింప మేమెంత ? మమ్మనుగ్రహింపవే" యని పలు విధముల బ్రార్థించిరి.

ప్రహ్లాదుని పూర్వజన్మకృతమయిన తపోనియతియు ఈ పుట్టువున నొనరించిన హరికీర్తనములు ఫలించినవి. శ్రీమన్నారాయణుడు తనకై యవతరించినాడు. యాతని తనువెల్ల హరిభావమున పులకించి యా నృసింహుని పాదములపై వ్రాలి బహుప్రకారముల ప్రస్తుతించెను. "జగన్నాథా నేనొక రక్షస్తనూజుఁడనైన జడమతిని. దర్పాతిశయములేని నిర్మలభక్తిగదా నిన్ను సంతుష్టి జేయునది. భక్తబాంధవుఁడ వీవు. నిత్యకరుణాళుడవు. నీమహిమ వర్ణించు సంస్తుతులుగదా ముక్తిమార్గములు. నాకట్టి సద్గుణమ్ము లొసగి కామక్రోధలోభమోహాది దుర్గుణమ్ములు దూరమొనర్చి నన్ను ధన్యుఁజేయుము, నీ దాసుడను. కలుషుడైన యసురుని మర్దించి నన్ను రక్షించితివి. ఇంద్రాద్యమరులకుఁగూడ భీతిఁగొలుపు నీ యుగ్రాకృతి నిక నుపసంహరించి మమ్మనుగ్రహింపవే" యని ప్రణతు లర్పించెను. ఆ మణునిముషమే ఆ నృసింహాకార మదృశ్యమై భక్తసులభుఁడు, భక్తప్రియుఁడైన మాధవుని సుందర సుప్రసన్న ప్రశాంతరూప మచ్చట నిల్చి ఆ బాలభక్తుని శిరమునం దభయహస్త ముంచి, "ప్రహ్లాదా ! నీవు పరమభాగవతశిఖామణివి. నీ చరిత్రమ్ము నేను మెచ్చుటేగాదు, సర్వజనసంస్తుత్యమానమై సకల కాలమ్ము వర్ధిల్లును; ఈ మన్వంతర సమయమెల్ల యసురేం

ద్రుఁడవై సామ్రాజ్యభోగము లనుభవించెదవు. నన్నాత్మ
నిలిపి ధ్యానించి నాకథలు వినుచు వినుపించుచు కాలమ్ము
గడపుము. తుదకు నన్ను జేరగలవు. నిన్ను గనిన నీ జనకుం
డును నాకృపకు పాత్రుఁడగు''నని దీవించి యంతర్ధానుఁ
డయ్యెను.

బాలుడయ్యు కేవలము తనభక్తి ప్రభావమున శ్రీమ
న్నారాయణుని సాక్షాత్కరింపఁజేసికొని చరితార్థుఁడైన
పరమభాగవతోత్తముఁడు ప్రహ్లాదుడు. బాలుర కుండఁదగిన
వినయము, పెద్దలయెడల భక్తి, సద్విద్య, దైవచింతనము
అతనియందు పూర్ణముగ భాసించి ఆతని సత్కీర్తిని ముల్లోక
ముల వ్యాపింప జేసినవి.



# 9. చింతనము - గోపికలు

మ. శ్రవణోదంచితకర్ణికారకముతో స్వర్ణాభచేలంబుతో
నవతంసాయితకేకిపింఛకముతో నంభోజదామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే వంశంబు
బూరించుచు
న్నవిదా ! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడుం
జూచితే.

ఉ. గోపదరేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛు ను
ద్దీపిత మందహాసశుభదృష్టిలసన్ముఖు నవ్యపుష్పమా
లాపరిపూర్ణు గోపజనలాలితవేణురవాభిరాము నా
గోపకుమారునిం గనిరి గోపసతుల్ నయనోత్సవంబుగన్

ఆ. కమలనయను వదనకమల మరందంబుఁ
దవిలి నయనషట్పదముల వలనఁ
ద్రావి దినవియోగతాపంబు మానిరి
గోపకాంతలెల్లఁ గోర్కు లలర.

తలపై నెమలిపింఛము, మెడలో పూలదండ, చెవి సందున చక్కని పూవు, కాంచనచేలము, పెదవులపై మురళి- ఈ మోహనవేషముతో శ్రీకృష్ణమూర్తి ఆలవెంట వనములకుఁ బోవును. గోపసుందరు లాతనిని దృష్టి సోకు నంతవరకు చూతురు. శ్రీకృష్ణుఁ డింకను తిరిగి రాలేదే యని దినమంతయు శ్రీకృష్ణునే చింతించుచు, ఆతడు గోపద

ధూళివర్ణుఁడై, మందహాససుందరుఁడై ఇంటికి తిరిగివచ్చు నపుడు తనివితీర నయనోత్సవముగ చూతురు. శ్రీకృష్ణుని వేణుగానము ఆ గోపలీలావతుల మనసులు కరగించును. ఆ మోహనవిగ్రహము మధురమనోహరముగ గనుపించును; తేనెలు ద్రావుటకు పరువిడు తుమ్మెదలవలె వారి కనులు ఆ బాలకృష్ణుని వదనారవిందమును జూచుచు మరలిరావు.

ఆకృష్ణుఁడెవరు? ఆతని మురళీమధురగానములో నేమున్నది? ఆతని రూపుకొఱకు, చూపుకొఱకు అహర్నిశ లట్లు తపించు గోపవనితల మనోచింతనమునందుగల పరమార్థ మెయ్యది? ఆతని దర్శనము గోపికలకు నేత్రపర్వము, ఆమురళీరవము మనోహరము, ఆదివ్యవిగ్రహము లోకాభిరామము. ఇదియే గోపికల ఆలోచన. ఆకృష్ణసౌందర్యములో తాము కలసిపోయి ఒకటికావలెను. అంతవరకు వారికి తృప్తిలేదు. కృష్ణుఁడెచ్చటనున్న అచ్చటికే వారి దృష్టులు, మనసు పోయి చేరును. ఇదియొక మధురశృంగార భరితమయిన ఆధ్యాత్మిక చింతనము. జగదీశ్వరుడగు కృష్ణుడు వారికి సర్వస్వము. వారి హృదయేశ్వరుఁడైన పరమాత్మ స్వరూపము.

క్రమక్రమముగా ఈ చింతనమెట్లు గోపికల యుల్లములందు సంఫుల్లమయినదో చూడుడు.

గోపికాకృష్ణుల సంబంధమొక రసోత్తరమగు మధుర భావ ప్రభావితమైన జీవనము; నందకృష్ణుని మధురవర్తన

ములో గోపికల శ్రీకృష్ణచింతనము లీనమై యేక ప్రవాహ
ముగ పొంగి ఇరుగట్లొరసిపాఱిన విశ్వప్రేమవాహిని-
శ్రీకృష్ణుని చరిత్రములో మూడు భిన్నభాగములున్నవి.
మొదటిది గోపికలతో సంబంధము. రెండవది కంస శిశుపాల
జరాసంధ దుర్యోధన నరకాసురాది దుర్మతుల నిర్మూల
నము - మూడవది సర్వమానవజాతికి, అర్జునునికొసగిన
గీతాప్రబోధముద్వారా, ప్రసాదించిన ఆధ్యాత్మిక చింత
నము- దుష్టులదునుమాడుటతో వారిదురాగ్రములడగినవి.
అది కేవలము లౌకికము. భూదేవికా పాపభార ముడిగినది.
ఆధ్యాత్మికచింతనకై గీతోపదేశములో భాసించినవి కర్మ,
భక్తి, జ్ఞాన యోగ మార్గములు. ఇవి ఆముష్మికానందదా
యకములు. ప్రాపంచికవర్తనము తప్పనివారికి మోక్షసాధ
నకు భక్తిమార్గముసులభము. భగవంతుఁడు భక్తసులభుఁడు.
భక్తుఁడు భగవంతునికి ప్రియుఁడు - సుందరాంగనలైన
గోకుల గోపికాబృందముల డెందములు వంశీమోహనుఁ
డైన బాలగోపాలుని యాశ్రయము పొందినవి, ఆలంబ
మర్దించినవి, ఒకఅపురూపమైన విలక్షణమైన భక్తిమార్గ
మున తాదాత్మ్యము చెందినవి. మురళీనాదములో రాస
విలాసములలో బాలగోపాలుడు విశ్వప్రేమాంబుధుల గురి
పించినాడు- ఆ సుందరభావములో ఆ సుందరాకారములో
ఏకాకారులైన గోపికలభావములు ఆ విశ్వప్రేమను చూఱ
గొన్న మధురాతిమధురములు- అచ్చట స్త్రీపుంస భావము

లను తావులేదు. తదతీతమైన సౌందర్యావధి యది- నిత్య వర్తనమున ఇట్లొకమనోజ్ఞమార్గమున శ్రీకృష్ణునిలో భగవత్సాయుజ్యమును పొందగలిగిన గోపికాంగనల హృదయాంగణములు, నిత్యతపోనిష్ఠాగరిష్టములై శుష్కములై భగవచ్చింతనామృతాసేచనమున ఆర్ద్రములైన మునిమనములవంటివికావు. శ్రీకృష్ణతత్త్వానంద మకరందరసాస్వాద తుందిలములైన నందనారామమందారములు. స్వచ్ఛకాంతులారవోయు శరత్కౌముదులు, అమృతపూర్ణములైన క్షీర సాగరములు-

గోకులవాసి నందుని ఇంట అందాలరాశిగా పెరిగిన ఈ సుందరగోపాలుడెట్టివాడు. గోకులబృందావనములందు సౌందర్య దీపికలవలె వెలుగొందుకోమలాకృతులాగోపికలెటనుండివచ్చిరి. దివినుండి భువికిదిగిన దివ్యసౌందర్యము మూర్తిభవించిన ముగ్ధమోహనాకృతులువారెల్లరును -పుణ్యస్థలములైన ఊర్ధ్వలోకములయందు గోలోకమత్యుత్తమము. విశ్వప్రళయమునకూడ రూపుమాయని రుచిర ప్రదేశము. మురళీధరుడు నృత్యవినోదుడు సకలలోకముల కారణుడైన కృష్ణుడు గోలోకపతి సౌందర్యనిధి; శక్తిస్వరూపిణి రాధ కృష్ణునితో సహవాసిని. ఆ రాధామాధవ యుగళము, ప్రకృతిపురుషుల సంయోగము, రాధలేని కృష్ణరూపము కృష్ణుడులేని రాధాకృతి అనూహ్యము- క్షీరసాగ

రశయనుఁడైన నారాయణుడు కృష్ణాంశ. వైష్ణవీజనములు దేవతాంగనలు రాధాకళావిలాసినులు. భూమిపై కంసాది విమతుల పాపభారము మేరమీఱి, "దేవా! ఈ భారమును నీవు పరిహరింపనిచో నీశ్వేతవరాహావతారమున నిలబెట్టిన నేను అధోగతిపాలుకావలసినదే, నన్ను గాపాడవలసిన సమయమేతెంచినది" యని ప్రార్థించిన వసుధామాతల్లి వినతులు విష్ణుదేవునికి హితములైనవి – ఆ నారాయణుఁడు గోకుల శ్రీకృష్ణుడైనాడు. ఆదివ్యరూపుని అనుసరింప అవతరించిన వైష్ణవీజనము అమరాంగనలు గోకుల గోపికలు, దేవతా కార్యమునకై మానవాకారులై మహికేతెంచిన పవిత్ర మూర్తులు. వీరలరాకతో గోలోకము గోకులమైనది. రాధా మాధవ రమ్యసంబంధము గోపికా కృష్ణుల జీవనరాగమైనది– వీరివర్తనమున విశ్వప్రేమ బీజములు విస్తృతములై మర్త్యలోకమును ఆత్మానందపూరితమైన రమ్యాలోక సర్వస్వము కావింపవలెను–

వీరు వచ్చినది మర్త్యలోకము, వీరు మానవులు. మానవులవలె పుట్టుదురు, పెరుగుదురు, అనుభవములు పొందుదురు. ఆసించిన ధర్మము లాచరింతురు, ఆచరింపవలయును. ఇది ప్రకృతిరహస్యము.

కొందఱు బాలురు బుద్ధిమంతులై అల్లరిలేకుండ నమ్రములై యున్నను మనముల నాకర్షింపరు. కొందఱు పిల్లలుచేయు అల్లరిపను లొకయందముగా నుండును. ఆ

యల్లరి కందఱును ఆకర్షితు లగుదురు. ఆ యల్లరిపను లొక ప్పుడు కొంత కష్టము కలిగించినను ఇష్టముతో సహింతురు. మరల మరల ఆబాలురచే అట్టి అల్లరిపనుల కవకాశము కల్పింతురు. ఇది మానవస్వభావము. ఆ బాలునియందొక ఆకర్షణ ఆ పనులయందొక అందము ఆనందము. నంద కుమారుడు శ్రీకృష్ణుఁ డిట్టివాడు. ఇసుమంత పెరిగి పొరు గిండ్లకేగ నేర్చిన నాటినుండియు చిన్న చిన్న అల్లరులే గాదు పెద్దపెద్ద అల్లరులే చేయును. ఆ గోకులవాసుల ఇళ్ళలో పాలు వెన్న పెరుగులు ఉండనీయడు. ఆ కడవలను ముక్కలు జేయును. ఆ పాలు పెరుగులను తాను తినును, లేగదూడలకు త్రాగించును; కోతులకు పెట్టును: గోపబాలురకు పంచి పెట్టును. బయటకు పారిపోవుచు ఏ గోపిక ముఖముమీదనో ఆ వెన్న వ్రాయును. ఆమె నాకస్మికముగ కౌగలించుకొని విడిపించుకొనులోపున ముద్దుపెట్టుకొని పారిపోవును. ఈ ముద్దులకృష్ణుని ముద్దులాడనుకొందురా, ఆతతాయి అను కొందురా. ఆగోపికల కేమాత్ర మాగ్రహము కలిగినను మఱుక్షణములో మఱచిపోదురు. ఆకోపము మనసునకు తాపము కల్గించిన ఏ నిముసమునందో గోపికలేగి యశో దతో చెప్పుదురు. ఆమె తన అల్లారుముద్దుబిడ్డను మందలిం చును. మందలించడు– "మాకుర్రవాడు మంచివాడమ్మా, వీథిలోనికి కాలుపెట్టి యెఱుగడు పొరుగిండ్ల కెట్లుపోగలడు? ఇటువంటి మాటలు నాతో చెప్పకుడు" అని యశోద

కృష్ణుని ముద్దాడి లోనికికొనిపోవును. ప్రతిదిన మిట్లు జరుగు చున్నను మఱునా డాచిన్నికృష్ణుం డెచట గన్పడినను చిఱు నవ్వుతో వానిచేతులు పట్టుకొని వారియిండ్లకు తీసికొనిపోవు వారే గోపికలందఱును. ఇంటి యజమానులు, పెద్దగోప కులు పొలములకు పోదురు; ఆలమందలతో అడవుల కేగు దురు. ఇంటిపనులు పెందలకడనే ముగించిన గోపికల కిక ఆకృష్ణునితోనే లోకము. ఆతడు అనుదినము రావలెను. ఆత నితో కాలము గడపవలెను. అబ్బా. ఎంతమంది గోపికలు! అందఱు సంతుష్టు లగుచున్నవారే. అంతమంది కృష్ణులా ఏమో.

కృష్ణుడు కొంచెము పెరిగెను. పెద్దపెద్ద అల్లరులే చేయును. యశోదతో గోపికలేవో నేరములు చెప్పెదురు. మరల ఆ ధూర్తగోపాలుండే కనుపించినచో ఆ చిఱునవ్వు లకు ఆ చిలికి చూపులకు కరగిపోవుదురు. శ్రీకృష్ణుని మంద లించుటా, మానుటా ఇది యశోద సంశయము. ఆ చిన్ని బాలుని పనులలో ఏదో గొప్పతన మున్నట్లు కనుపించును. ఈభావము గోపికలలోను ప్రబలమగుచున్నది. పసినిసుగుగా ఉన్న కృష్ణునకు పాలీయవచ్చిన ఒక రక్కసి తనంత తాను క్రిందబడి చచ్చినది. కృష్ణుని కాలుతగిలి ఒక శకటము ముక్కలైనది. రెండుచెట్లు నేలకూలినవి. ఒకనాడు సుడి గాలిలో ఉపవీధికెగిరిపోయి సురక్షితముగా క్రిందకు వచ్చి నాడు. ఈపను లితడే సాధించెనా లేక తమంత నవి జరిగి

నవా. ఇన్ని ఆశ్చర్యకములగు పనులు వరుసవరుసగా ఎట్లు జరుగును ? పొరుగిండ్ల కేగిన శ్రీకృష్ణుని దుడుకుపను లెక్కువయినవి. చిన్నికృష్ణుడు యశోద కొకసమస్యయే యయ్యెను. ఏమిచేయుటకు పాలుపోక యశోద —

సీ. బాలు డీతండని భావింతునందునా
యేపెద్దలును నేర రీక్రమంబు
వెఱపెఱుంగుటకునై వెఱపింతునందునా
కలిగి వేరొక్కడుగాని లేడు
వెఱవంగ నాబుద్ధి వినిపింతునందునా
తనుదానయై బుద్ధిఁ దప్పకుండు
ఒండెఱుంగక యింట నుండెడినందునా
చొచ్చి చూడని దొకచోటు లేదు
తన్ను నెవ్వడైన తలపోయ బాలెడి
యోజలేదు భీతి యొకటి యెఱుగఁ
డెలమి నూఱకుండఁ డెక్కసక్కములాడు
పట్టి శాస్తిసేయు భంగి యెట్లు.

ఇట్లు ఒకప్రక్క మందలింప నుంకించియు వేఱొకవంక మందలింపరాని వాత్సల్యభావముతో యశోద దూగాడుచున్నది. ఈ అల్లరులు, ఈ విపత్తులు తగ్గునేమో అను నాసతో నందాదులు గోకులమును వీడి కుటుంబములతో, గోగణములతో బృందావనమునకు వలసపోయిరి.

కృష్ణుఁ డిప్పుడు కొంచె మెదిగెను. గోపికల యిండ్ల కంతగా పోవఁడు. బలరామునిగూడి గోపబాలురనుగూడి అనుదినము ఆలమందతో అడవులకు పోయి తిరిగి వచ్చు చుండును. కృష్ణుఁడు వచ్చుట మానినప్పటినుండియు కృష్ణునిపై గోపికలకు మక్కువ యెక్కువైనది. మానవస్వభావమట్లే యుండును. మనసున కిష్టమైన వస్తువు దూరమైన కొలఁదియు దానియందు మమత యెక్కువగును. శ్రీకృష్ణుఁడు మురళి నూదుచు గోగణములతో వనములకు బోవును. మురళి నూదుచు సాయంతనము తిరిగి వచ్చును.

సీ. రా పూర్ణచంద్రిక రా గౌతమీగంగ
రమ్మ భగీరథరాజతనయ
రా సుధాజలరాశి రా మేఘబాలిక
రమ్మ చింతామణి రమ్మ సురభి
రా మనోహారిణి రా సర్వమంగళ
రా భారతీదేవి రా ధరిత్రి
రా శ్రీమహాలక్ష్మి రా మందమారుతి
రమ్మ మందాకిని రా శుభాంగి ! ....

దూరముగానున్న గోవులను ఈపగిది ప్రియమొలుకు పేరులతో పిలుచును. గోపికల కామురళీనాదము వినినను, ఆ పిలుపులు వినినను ఒడలు రోమాంచమగును. ఆ చిన్ని కృష్ణుఁడు పెద్దకృష్ణుఁడైనాఁడు. అవంశీనాదములో సుధా మోదమాధుర్యము లున్నవి. తమ నాపేరులతో పిలచు

చున్నట్లు తమకొఱకే ఆమురళి మ్రోయించుచున్నట్లు గోపికలలో ఒక క్రొత్తభావ ముదయించినది. ఆహా! ఆ గోవులు గోవత్సములు ఎంతపుణ్యజీవులు కృష్ణునివెంటఁ దిరుగుచున్నవి. కృష్ణుని అటునిటు తాకుచు తిరుగుచున్నవి. కృష్ణుని గానమాధుర్యముల సొక్కిసోలుచున్నవి. తమకట్టి భాగ్యము కలుగవలెను. తామా మాధుర్యమును గ్రోలవలయును. తామును కృష్ణునంటిపెట్టుకొనియే యుండవలెను. తమ యిళ్ళవద్ద పాలుపెరుగులు దొంగిలి పారిపోవు చిన్నికృష్ణు డెంతవాడయ్యెనే! అనుతలపులో తమ మనస్సులు మెల్లగాఁ దోచుకొనుచున్నాఁడను మధురభావములో గోపికలూగిసలాడుచున్నారు. చిఱుపాపఁడైన శ్రీకృష్ణుఁడు తానే మునుముందు పొరుగిండ్లకు పరువెత్తి చుట్టివచ్చువాడు. ఇప్పుడు వారందఱు తనకొఱకే యెదురుచూచున ట్లురులు పన్నుచున్నాడు. శ్రీకృష్ణుని లీలలలో నిదియొక ముఖ్య విశేషము. ఒక్కసారిగా తానొక మధురమూర్తిగా మాధవ స్వరూపునిగా వారిని తలపింపఁజేయుచో వారి భావములలో ఇప్పుడున్నంతటి గాంభీర్యము ఉదాత్తత ఉండకపోవచ్చును. ఏదేనొకభావము క్రమక్రమముగా బలపడుటలోఁగల స్థైర్యము వేరు.

క్రమక్రమమున శ్రీకృష్ణుని మరికొన్ని చేష్టితములు విదితములైనవి – కాళియుని చంపెను, కార్చిచ్చును రూపు

మాపి దావాగ్నిని క్షణములో నణచెను. అజగరమగు పెద్ద చిలువను పొలియించెను. కేశివ్యోమ్యములను ఉద్ధతులను జంపెను. గోవర్ధనమునెత్తెను. సామాన్యబాలకుఁడొకడు చేయ దగినవికావివి - కాళిందిలో మునిగిపోయిన నందుని తిరిగి తీసుకొనివచ్చెను - స్నేహపాత్రుఁడు ప్రేమపాత్రుఁడయిన శ్రీకృష్ణునిలో ఒక తెలియని మహత్త్వమున్నది. ఇతఁడా భగవంతుడే యేమో - గోపికల చింతనము శ్రీకృష్ణునెడ ప్రియతమభావముతో పాటు ఒకభక్తిభావరేఖను సంతరించు కొనునది. ఒకప్పుడు నల్లని ముద్దులాడు, మరియొకప్పుడు ఇష్టమైనబాలుడు, తరువాత తమలో మధురభావము లేవో రేకెత్తించిన మురళీమోహనుడు. ఇప్పుడతనిలో దేవత్వమును కూడ చూచుచుండిన గోపికల మనోభావములు మరింత ముందునకు పోయినవి-

శ్రీకృష్ణునియందే గోపికల ఆలోచనలు. ఆ చిన్ని బాలుని మనోహరాకృతినే మరల మరల ఊహించుకొందురు. ఆ కృష్ణుని పింఛము పూలమాలలు ఆ చిఱునవ్వు ఆ మురళీనాదము ఇవియే వారిహృదయములలో కదలాడును- సన్నసన్నగ గోధూళిపడిన ఆ బాలగోపాలునిమోముపై నులిసంజపసిడివన్నెలు మరింత అందము చిందుచుండును. ఆతనిని చూచుకోరిక, మరల సిగ్గు, ఆ మధురమూర్తిని చూడక తప్పదు-

ఉ॥ గోపదరేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛు ను
ద్దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖు నవ్యపుష్పమా
లాపరిపూర్ణు గోపజనలాలితవేణురవాభిరాము నా
గోపకుమారునిం గనిరి గోపసతుల్ నయనోత్సవమ్ముగ
గన్ -

ఇట్లున్న కృష్ణవిగ్రహము గోపసతుల హృదయము లపై స్థిరపడినది - ఆ మనోహరత్వము వారినెచ్చటికో మున్ముందుకు లాగికొనిపోవుచున్నది - కృష్ణునిఁగూర్చి వారొకరితో నొకరు చర్చించుకొందురు. అందరిడెందమ్ము లందాయందగాని భావములొకటిరే. ఒకరియెడ మరియొకరి కీర్ష్యయులేదు- ఆ నూతన మధురభక్తి భావమునకు వారి హృదయములు అంకితములైనవి-

మంగళస్వరూప, మనములందున్నకోరికల నీడేర్చు తల్లి కాత్యాయని. గోపకుమారికలు హేమంత పుణ్యకాలా రంభమరసి కాళిందితీరముజేరి ఇసుకతో కాత్యాయని విగ్ర హము నిర్మించి ఒకనెల ధూపదీపగంధ నైవేద్యంబు లిడి పూజాదికములు పూర్తిగావించి-

కం॥ ఓ కాత్యాయని భగవతి
నీకున్ మ్రొక్కెదము నేము నేడనుకంపన్
మాకిందఱకును వైళమ
శ్రీకృష్ణుఁడు మగడుగాగ జేయుముతల్లీ!

మధురానురాగమూర్తి కృష్ణునెడ మానసంబులు నిల్పి గోపిక లనినపల్కులివ్వి. మానసికముగ వారు కృష్ణునే చింతించుచు కృష్ణునికి దగ్గఱగుచుండిరి. కాని ఒకవిధమగు దేహాభిమానము, సిగ్గు వారినలముకొనియున్నది. ఆ తెరలు తొలగినగాని యీ పరమపురుషునియందు తాదాత్మ్యము సిద్ధింపదు. ఆ చింతనమునకు సాఫల్యము లభింపదు.

ఆ మఱునాడు ప్రొద్దున గోపరమణులు చేరి ఒయ్యారముగ ఒకరిచేతులొకరు పట్టుకొని శ్రీకృష్ణునిగూర్చిమాటాడుకొనుచు పాటలు పాడుకొనుచు యమునాతీరము జేరి మేనివలువలువిడిచి గట్టునబెట్టి, స్నానాతురలై నదీ జలంబులసొచ్చి పలువితమ్ములజలక్రీడలాడిరి-

నీవు కృష్ణుడవనగా నీవు కృష్ణుడవని ఒకరిపై నొకరు నీరము చల్లుకొని, ఒకరి నొకరు పట్టుకొని జలకములు ముగించి వెనుదిరిగిచూచుసరికి గట్టున వారిచీరలులేవు. ఏమైనవి ? ఎవరు దొంగిలిరి ? విభ్రాంతలై వారిటునటు నల్గడల కలయతిలకించుచుండ తీరముననున్న వృక్షశాఖలనుండి కృష్ణుని మురళి సన్నసన్నగ వినిపించినది. అటుచూచిరి. అచట బాలకృష్ణుడు ఆ ప్రక్కనే వారిచీరలు. ఎచటనుండి యీ బాలుఁడువచ్చెను. ఎపుడచటికి చీరలు గొంపోయెను. అందఱికాశ్చర్యమే. ఇపుడేమిసేయుట. ఒకరిమొగమొకరు చూచుకొనిరి. ఆ సిగ్గుతో కంఠప్రమాణజలంబు లందుండి-

"ఏమయ్యా శ్రీకృష్ణా ! ఇది యేమియాగడము, నీ వెన్నెన్నో ఘనకార్యములు లొనరించిన గొప్పవాడవని యెఱుగుదుము, నీ ధర్మనిరతి యేమైనది—

శా॥ ఇంతుల్ తోయములాడుచుండ మగవా రేతెంతు రే వచ్చిరా
యింతల్ సేయుదురే కృపారహితులై యేలోకమందైన ఈ
వింతల్ నీతలఁ బుట్టెగాక మఱియేవీ కృష్ణయో చెల్ల నీ
చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే.

కం॥ వచ్చెదము నీవు పిలిచిన
ఇచ్చెదమేమైనగాని యెటజొరుమనివం
జొచ్చెదము నేడు వస్త్రము
లిచ్చి మము గరుణతోడ నేలుముగృష్ణా.

అని ప్రార్థించి, కృష్ణా మేము నీవారమేయని చెప్పుచు ఇంకను తమ దేహాభిమానము చూపుచున్న గోపవనితలజూచి శ్రీకృష్ణుడు చిఱునవ్వి—

" మీ మాటలుసరియే, మీ వలువలకేమి అనియే వచ్చును. మీరీ వ్రత మెవ్వనిపై మోహాముననచేసినారు. ఎవరు మీకు ప్రియుఁడగుటకు దేవిని వేడుకొనిరి. నేను అన్యుఁడనా. మిమ్ములను మీ హృదయములనెఱుఁగని వాడనా, అయినను ఈ బహిరంగస్థలమున మీరిట్లునగ్నలై

స్నానమాడుటయేల, మీ వ్రతఫలము మీకు కావలయుచో చేతులెత్తి నమస్కారములతో వెలుపలికి రండు మీ వలువలు చేకొండు అని మర్మంబులు నాటుమాటలనుసరికి ఆ గోపాంగనలకేదో అన్యలోకమునకే పోయినట్లయినది. ఇది యొకహృదయపరీక్ష అయినది. తామెవరు తాము వాంఛించిన ఆ తరుణుఁడెవరు- ఆ హృదయములమధ్య అవరోధములు లేవు; తనువులాటంకములగునా, కావు. ఆ కృష్ణభావములో సమాకృష్టలై వారొక్కక్కరే మాధురీభరమైన శృంగారజాలమునచిక్కుకున్నారు. మానభంగమనుమాట కాని, సిగ్గనువ[illegible]గాని అచ్చట అర్థములేదు. వారర్థించిన రూపమచ్చటనున్నది. అది పరమాత్మ సన్నిభము. ఇతర ఆలోచనల కటతావు లేదు. వారు విగతవస్త్రలనుమాట వారికి తెలియని ఒక తాదాత్మ్యస్థితివారిచింతనమునందున్నది. ఒకరి విషయము మఱొకరి కక్కఱలేదు. శ్రీకృష్ణ విగ్రహము చిత్తములందు వెలుగుచుండ చేతులెత్తి నమస్కరించి నీరములనుండి వెలువడి వచ్చిరో లేదో వారివలువలు వారి చేతులందున్నవి.”

ఆ. వె. చీర లపహరించి సిగ్గులు విడిపించి
పరిహాసించి యైన బరఁగమనకు
ఘనుఁడు నోముగొఱత గాకుండ మ్రొక్కించె
ననుచు హరి నుతించి రబల లెల్ల.

వల్లభులు సేయుపనులు వల్లభులకు ఎగ్గుగాదు. కృష్ణుని హృదయపూర్వకముగ వారు నిజమనోవల్లభునిగ స్వీకరించిరి.

యమునాతీరముననున్న బృందావన మొక అందాల కోన. అది నిక్కువముగ మధురభావుక బృందావనము. పూబొదలు, పూలు, పుప్పొళ్ళు, పూవులతావులు, పులినసీమలు తిలకించు ఒక సౌందర్యసీమ. మందమలయానిలములు, ఆ వీచికలకు కదలాడు యమునాజలముల చిఱుతరగలు, ఆ స్థలమున కొక ఆకర్షణ. శ్రీకృష్ణుని విహారములతో ఆ ప్రదేశములు మఱింత సుందరములు. ఆగోపకిశోరుడు మురళి నూదును. ఆ మధురనాదములు బృందావనము మూలమూలల కేగును. గోపకాంతల హృదయతంత్రులు కదలించును. ఆ స్పందనకు వారు నిలువలేరు. శ్రీకృష్ణుడు దూరమున నున్న కొలఁదియు ఆ మురళీరవభరమును వారు మోయలేరు. ఆనాదము వారిని పేరుపేరున పిలుచుచున్నట్లుండును. చేతులు పట్టుకొని యమునాతీరమునకు లాగుచున్నట్లుండును. ఇప్పుడు వారి సర్వస్వము శ్రీకృష్ణుఁడు. అచ్చటికి పోక యెట్లుండఁగలరు? తమ ఆత్మీయుని వద్దకు పోవునప్పు డొకరి యనుజ్ఞ యేల? కృష్ణుని వంశీరవాహ్వానములు చాలు.

కాలచక్రము తిరిగి శరత్కాల మరుదెంచినది. వర్షములు వరదలులేవు. మబ్బుపొరగూడ లేని వినువీథిని నిండు

చంద్రుడు డానాడు లక్ష్మీదేవి ముఖమండలమువలె వెలుగు లారబోయుచున్నాడు. ఆశరచ్చంద్రకాకౌముదులలో అచటనున్న లతావల్లరులు పూబొదలు క్రొంబూవులతీయ తావులతో మఱింత భాసించినవి. నిర్మలములు ప్రశాంతములై యమునాజలములు మిలమిల మెఱయుచు కదలుచున్నవి. ఆనాఁడచటికి వచ్చిన శ్రీకృష్ణుని యందమే వేరు. ప్రకృతి సర్వము ఆ బాలగోపాలుని మోహించి తన సర్వాంగసౌంద ర్యము చుట్టుముట్టినట్లున్నది. తన మురళిని కృష్ణుడు పూరించి ఒక గీతమును పాడెను. మురళీనాళోద్గతవాయునాద ములు జగన్మోహన గానస్వరములతో నిలువడినవి. వల యములైనవి విరళీకృతములైనవి నలుగడలు నిండినవి. బృం దావన మెల్లెడల ఇంటింట మధురాతిమధుర మధువులు జల్లు లాడినవి. ఒక్కడే కృష్ణుడు, ఒక్కటే మురళి గోపవనితల కోటి గుండెలు మోయించినవి. వారెవరియిండ్లను వారు వదలిరి. పనులను విడచిరి. బంధుగులను మఱచిరి. గానపరా యత్తలై దత్తఱమున పరువిడి తమ ప్రియతముని జేరిరి. మేనులు కంపమొందుచున్నవి. కనులు చెమ్మగిలుచున్నవి. కృష్ణా! కృష్ణా! అని కృష్ణుని జేరిరి. ఆ పారవశ్యములో అన్యచింతనమే లేదు వారికి.

ఆ గోపకాంతలు తమ ప్రణయభావమున కేంద్రస్థాన మును జేరిరి. ఇక వారికదియే ఆవాసము. ఆ లీలావతుల భావము లెంతపరిణద్ధములో శ్రీకృష్ణుడు కనుగొనవలయును.

వారి నా లక్ష్యమునకుఁ జేర్చవలయును. శ్రీకృష్ణుడు పరమ పురుషుడు, యోగేశ్వరుడు, నిర్వికారుఁడను భావస్థితి కా భామలింకను రాలేదు. కృష్ణునెడ వారొక ప్రణయావేశములో నున్నారు. ఇదియే అదను. వారి నాయవధికి తీసికొనిరావలెను. శ్రీకృష్ణుఁ డొకనేర్పుగ వారితో ననెను.

మీరీ రాత్రిసమయమున యిక్లేల వచ్చిరి ? మీ మంద లం దేక్రూరమృగములయిన రావచ్చును. మీకు భయము వేయుటలేదా ? ఇల్లు వదలి, పిల్లలను వదలి, బంధుగుల మాటలు పాటిచేయక తుదకు మీ భర్తలనుకూడ వదలి నామీద కోరికతో ఇట్లు పరువెత్తుకొని వత్తురా, వారేమను కొందురు ? సత్కులాంగనల కిది తగినవర్తనము కాదుసుడీ. మీ రీరీతి జారవాంఛలతో నాకడకు వచ్చిరని తెలిసినచో ఊరకుందురా ? చులకనగా జూతురు. మీరు శిక్షార్హ లగుదురు. నామాట యందురా నాకందరు ప్రియులే. మీ తలఁపులు, మీ ధ్యానము నాయందున్న చాలు. మీరు కృతార్థులే అని మొదట వారి వర్తనమునం దొకభీతి గలిగించినాడు. తరువాత మరల ఒక ధైర్యపుమాట. తనయందు ధ్యానాకర్ణనదర్శనాభిలాష యుండవలెనని ఒకమాట- వారి ముఖములు పరీక్షించుచున్నాడు. వారి నొక్కొక్కమెట్టే ఎక్కించుచున్నాడు- మరల మొదటికి తీసికొని వచ్చుచున్నాడు. మీ రనవసరముగా సాహసముతో ఇంతదూర మేతెంచిరి.

చం॥ ఇది యమునానదీజలసమేధిత పాదపపల్లవప్రసూ
నదళవిరాజితంబగు వనంబు మనంబులు మేరదప్పెనో
పొదిగిట నేడ్చు బిడ్డలకు పోయుడుపాలు విడుండు లేగలన్
మొదవులకున్ నిజేశ్వరుల ముద్దియలార భజింపు
డింపుగన్.

అని కృష్ణుడు ప్రస్ఫుటముగా పలికినాడు. ఈ పలుకులవెనుక ఏదో ఒక అభయము దాగియున్నది. ఇది చక్కని చల్లని యమునాతీరము. తీయని పూతావులు ఎగయుచున్న వనుటలో గోపలీలావతుల ఆసలకొక దోహాలము చూపించును. వెనువెంటనే మీకు మతిపోయినదా యేమి? మీ యిండ్లకు పొండు, మీ పిల్లలను వల్లభులను చూచుకొనుడు అనును.

గోపికల కాక్షణమున నిజముగనే మతిపోయినది. ఆపోవుట పోయిపోయి శ్రీకృష్ణునియందే చేరినది. అన్నియు మఱచి, తనకొఱకై చనుదెంచినవారిని ఆ ప్రణయమూర్తి యిట్లాడునా? ఆమాటలు రుచించలేదు వారికి రుచించక పోవుటేకాదు, వారి నొక విచారమున ముంచుచున్నది. ఆ విచారములో ఒకింతకోపము. ఆ కోపములో మరల భయము- అన్నియు కలసిన ఒక తొట్రుపాటులో తనువులు కంపించి కన్నీరు కాల్వలైనవి. కృష్ణుని అప్రియవచనములకు తెలతెలబోవు మోములతో గద్గదస్వనముతో ఇట్లను చున్నారు-

శ్రీకృష్ణా ! మనోవల్లభా ! అన్నియు వదలి నిన్నె నమ్ముకొని నీకడకు పరువిడి వచ్చిన మమ్ము వెనుకకుఁ బొమ్మందువు. నిన్నే మనగలము ? నీ పాదారవిందములకడ కీనాటికి రాగలిగి మాతపము పండినదనుకొంటిమి. నీవుదక్క మా మాటలందు తలఁపులందు మఱి వేఱొండు లేదు. మాకు గావలసినది నీవే.”

శ్రీకృష్ణునికన్న గోపిక లొకయాకు ఎక్కువగానే చదివిరి. మరల వారి వాదము నారంభించిరి.

కృష్ణా ! నీవేవో మాయమాటలతో మమ్ము మఱపింపఁ జూచుచున్నావు. ఈ యాటలు సాగవు. సతులకు పతులు బిడ్డలు మాన్యులంటివి. అట్లయినచో వినుము.

మ॥ పతులన్ బిడ్డల బంధులన్ సతులకున్ బాటించుటే ధర్మ ప
ద్ధతియానంటివి దేహధారిణులకున్ ధర్మజ్ఞ చింతింపుమా
పతిపుత్రాదికనామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁ ద
త్పతిపుత్రాదికవాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే.

మాకు పతిపుత్రాదికరూపములన్నియు నీవే. మా కనులముందుగాని మనసునందుగాని మఱియొకరు లేరు. మోహాసక్తులగు తపోనిధులను గా పాడినట్లు మమ్ము గాపా

చుము. మా తపస్సంతయు నీకొఱకే. మా ఇండ్లవద్ద సక
లమువదలి నీకొఱకై వచ్చినమాట యెఱుఁగవా. మా జీవన
సర్వస్వములు నీ పాదములకడ సమర్పించుటకే వచ్చితిమి.
ఇంకను వివరించి వచింపమందువా వినుము—

మ॥ భవదాలోకనహాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధరపల్లవామృతముచే బాపందగుం బాపవే
ని వియోగానలహేతి సంహతులచే నీఱై భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథి బొందెదము నీ పాదంబు
లానంబ్రియా.

సీ॥ నీపాదకమలంబు నెమ్మిదగ్గఱగాని
తరలిపోవంగ పాదములు రావు
నీకరాబ్జంబుల నెఱినంటితిమగాని
తక్కినపనికి హస్తములుసారవు
నీనాగమృతధార నిండగ్రోలగగాని
చెవు లన్యభాషల సేరివినవు
నీసుందరాకృతి నియతిసూడగగాని
చూడవన్యంబులు చూడ్కిగవలు
నిన్నెగాని పలుకనేరవు మాజిహ్వా
లొల్లననుచు పలుక నోడ వీవు
మామనంబు లెల్ల మరపించి దొంగిలి
తేమిసేయువార మింక కృష్ణ !

కృష్ణా మాకు నీ తరువాతనే విశ్వమందేదియైనను- నీ దాసులముస్వామీ! నీ మాటలతో నీ చూపులతో నీ చేతలతో మమ్మాదరింపకున్న మతిదిక్కు లేదు. నీ వియోగ చింతానలతాపమునగ్రుగ్గి నీ ముందు మా ప్రాణములర్పింప వలసినదే. నీ యభయహస్తము మా శిరముల, మా యురముల నిడుము. చిన్ననాటినుండి మా మనసులు దోచుకొనిన వాడ వీనాడు కాదందువా అని నిశ్చేష్టులై గోపిక లెడలి కృష్ణునిముందు వ్రాలిరి-

గోపికల ప్రేమ తపస్సు పండినది. వారి మధురభక్తి కృష్ణతత్త్వమున తాదాత్మ్య మందినది - వారిశృంగారము శ్రీకృష్ణహృదయమున క్రొత్త అందములు వన్నెలీనినది- శ్రీకృష్ణుడు వారిని పేమార్ద్రదృష్టులతో చూచును. వారి చేలాంచలములాకర్షించును. బాహుబంధములగౌరవించును. నవ్వును, నవ్వించును, ముద్దుకొనును - అచట భావైక్యమే గాని తనుసౌఖ్యములకు కామవాంఛలకు తావులేదు. భగవంతుని మూర్తిత్వమున భక్తులనుభవించు వాత్సల్యమది - గోపికాచింతనము శ్రీకృష్ణభావములో చిదానంద సిద్ధినందినక్షణము - శ్రీకృష్ణుడొక్కరియందు వారి వారి ఆత్మారాముడై వారి నానందాబ్ధిలో నోలలాడించెను-

పరమావధినందిన ఆ మధురభావస్థితిలో గోపికలొడలెఱుగరు. కృష్ణలీనములయిన మనసులేగాని వారికిప్పుడు తనువులులేవు. శృంగారమార్గమున శ్రీకృష్ణచింతనామృత

సరసిలో వారుకరగిపోయిన అమృతక్షణమది. ఆత్మానంద మూర్తియై ఆ యోగిరాజు వారి మనోవీథుల వెలుగు చున్నాడు—

మఱుక్షణములో కృష్ణుఁడచ్చటలేడు. ఆ వేణు గానము దూరమునుండియైన వినిపించుటలేదు. గోపిక లొకరి మొగమొకరు చూచుకొనిరి. ఒకరివెనుక నొకరు వెదకిరి. కృష్ణుఁ డెక్కడ దాగెను ? ఏమయ్యెను ? మరల నిదియొక పరీక్షయా ? కృష్ణు డెక్కడనున్నను పట్టుకొనవలయును. పట్టుకొని వారినడుమ బంధింపవలెను. వారి యన్వేషణ ఆ యమునాప్రాంతమంతయు సాగినది. వెదకినచోటనే మరల వెదకుదురు— తిరిగినచోటనే మరల తిరిగెదరు. చెట్టుచెట్టున కొమ్మకొమ్మను రెమ్మరెమ్మను ఆకుఆకున పరిశీలింతురు. ఉన్మాదినులవలె దారి కడ్డుగనున్న జడవస్తువులను గూడ కృష్ణుని జూచితివా అని ప్రశ్నింతురు.

"పున్నాగ కానవే పున్నాగవందితు
తిలకంబ కానవే తిలకనిటలు ...."

అని ప్రతి పుష్పలతవద్దకుపోయి అడుగుదురు.

"మానినీమన్మథు మాధవుగాననే
సలలితోదారవత్సకము లార ..."

అని మొక్కమొక్కకు బోయి ప్రార్థింతురు.

"అదె నందనందనుం డంతర్హితుం డయ్యె
పాటలీతరులార పట్టరమ్మ ...."

అని ప్రతితరువును హెచ్చరింతురు. ఆ యడుగుటకు ఆ ప్రార్థించుటకు అంతులేదు. శ్రీకృష్ణుఁ డిట్లు నవ్వును, ఇట్లు నడచును, ఇట్లు నిలచును, ఇట్లు మాట్లాడును అని అనుకరించి చెప్పెదురు. కృష్ణుడు చేసిన పనులు తలచుకొందురు. నీవు కృష్ణుఁడవు, నేను గోపికను అని ఒకరినొకరు పట్టుకొందురు. ఇంతలో మరల కృష్ణునికై పూఁబొదలు వెదకుదురు. కృష్ణుని వర్ణించి చెప్పెదురు. మా కృష్ణుడు చాల అందమైనవాడమ్మా! మీరంద రెఱుగుదురు. ఎప్పుడును చిఱునవ్వుచునే ఉండును. కనులు కమలములే. శిరమున నెమలిపించ మున్నది. ఎవరినైనను లోఁబరచుకొను జగన్మోహనావతారమది. మాయందు దయఉంచి చూచి చెప్పుడు. మీచాటున లేడుగదా —

ఉ. నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబుపైఁ
జల్లెడువాడు మౌళిసరిచ్ఛితపింఛమువాడు నవ్వురా
జిల్లెడుమోమువాఁడొకఁడు చెల్వలమానధనంబుఁ దెచ్చెనో
మల్లియలార మీపొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే.

ఉ. అంగజునైనఁ జూడ హృదయంగముడై కరగించువాడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగువేణురవంబువాఁడు మ
మ్మంగజుపూవుదూపులకు నగ్గముసేసి లవంగలుంగనా
రంగములార మీకడకు రాఁడుగదా కృపయుంచి చూపరే.

గోపికల అన్వేషణ మిట్లు శ్రీకృష్ణుని భౌతికరూప మునే వెదకుచున్నది. వారి చింతన మొకతరుణమున శ్రీకృష్ణ తత్త్వము రుచిచూచి మరల మోహాచ్ఛాదితమైనది. ఆధ్యాత్మిక భావప్రకాశపు వెలుగుదారుల వెదకినగాని ఈ అన్వేషణ మిట్లే యుండును. గోపికల తపస్సింకను పరిపక్వము గావలెను.

ఇంకను ముందునకు ఆ బృందావన తరువీథులఁబడి శ్రీకృష్ణుని వారు వెదకుచున్నారు. నింగిని చూచుచున్నారు. నేలను జూచుచున్నారు. ఒకచో ఏవో ఆకర్షణీయములైన అడుగులు కనపడినవి. ఆ అడుగులు ముందునకు సాగినవి. ఆహా! ఈ అడుగు లెవరివి? ఇంత అందమైన అడుగులు కృష్ణునివే. తప్పక కృష్ణునివే. ఇవే హలకులిశకలశాంకుశాది చిహ్నములని ఒకతె చూపును. ఇవే సరోజాతకేతన చిహ్నములని మఱియొకతె చూపును. ఇవే ఈచెట్టుక్రింద ఈ అడుగులున్నవి. ఇక్కడాతడు పూవులు కోసినాడు. ఇచ్చట నాలుగు అడుగులు ఎదురెదురుగ నున్నవి. ఎవరినో కలసినాడు అని వారా అడుగుముద్రలకడనే ఉందురు. తప్పక కృష్ణుడీప్రాంతములందే ఉండుననుకొందురు. నే నెఱుగుదును ఈపాదముద్రలు మన కృష్ణునివే. ఈ శుభలక్షణలక్షితములైన లలితచరణము లావిశ్వమోహనునివే అని ఒకతె నుడువును. మెఱపు మెఱసినయట్లు వారిభావము లాజగన్నాథుని ఆ సర్వభూతమహేశ్వరుని ఆ నిర్వికారనిర్గుణనిరంజనుని

పాదములందు లగ్నములైనవి. ఆ పాదములు సకలభక్త జనాశ్రయములు ముముక్షుజనమనోవాసములు ముక్తిప్రద ములు. గోపవనితల హృదయభావము లోకనూతనమార్గము ద్రొక్కినవి. ఆపాదములే తమకు జీవనలక్ష్య మిచ్చుననిన ధైర్యము వారిలో కలుగుచున్నది. యమునాసైకతములం దున ఆ పాదముద్రలలో శ్రీకృష్ణుని శ్రీపాదములే, పూర్ణ విగ్రహామే వెలుగొందుచున్నట్లు వారిలో ఒకదివ్యానుభూతి కలిగినది. ఒకరికొకరు వర్ణించి చెప్పుచున్నారు.

సీ. ఈచరణమ్ములే యిందునిభానన
సనకాది మునియోగసరణి నొప్ప
ఈపాదతలములే యెలనాగ శ్రుతివధూ
సీమంతవీథుల చెన్నుమిగులు
ఈపదాబ్జంబులే యిభకులోత్తమయాన
పాలేటిరాచూలిపట్టుగొమ్మ
ఈసుందరాంఘ్రులే యిందీవరేక్షణ
ముక్తికాంతామనోమోహనమ్మ
ఈయడుగులరజమె యింతి బ్రహ్మేశాది
దివిజవరులు వహాళిదిశల దాల్తు
రనుచు కొందఱబల లబ్జాక్షుజేగిన
క్రమముగనియు నతనిగానరైరి.

అక్కా! ఈ పాదాబ్జములు నిజముగ వేదాంతవేద్య ములు. ఈ చరణాబ్జధూళినిగదా బ్రహ్మాదులు శిరోవీథుల

తాల్పనెంతురు. రండు రండు వెదకుమని గోపికలు బయలు దేరిరి. వారికి సరియైన దారి దొరకినది. చిత్తశుద్ధినందిన భావనిశ్చలత కావలయును. ఆ పరమాత్ముడే వారిదరి నుండును.

బృందావనమంతయు వెదకిరి. కృష్ణుడు కానరాడు. గోపికలకు వారిశృంగార కృష్ణుని చూడక వానితో నాడక ఇండ్లకుపోవు ఇచ్ఛయే లేదు. మరల మనోవాక్కాయకర్మ శుద్ధిగ, యమునా సైకతములఁజేరి, కృష్ణుని కీర్తింప దొడగిరి.

"కృష్ణా నీవు లక్ష్మీనివాసుడవు. నీ వలన మా మందలు డెందములు లక్ష్మీనివాసములయినవి. మా మనము లేనాడో చూఱగొంటివి. తలపగారాని పెక్కు ఉత్పాతములనుండి మమ్ముగాపాడితివి. ఈ వియోగబాధను మమ్మేల పాలుసేతువు" అని గోపికల విరహామిప్పుడు ప్రేయసీప్రియుల వియోగపరిధులదాటి భగవంతునికై భక్తుడువిలపించు తీరము లందుకొనినది – ఆ భక్తిలో ఒకమాధుర్యము ఒక శృంగారము–

"లోకరక్షకై యుద్భవించిన జగన్నాథుఁడవు నీవు కృష్ణా! దుష్టభుజంగఫణమిష్టమైన నీ చరణములకు మా వక్షములింపుగావా. నీ నగవులు నీ చూపుల్కులు నీ కథామృతములు మా కాస్వాద్యములుకానిమ్ము. మా తాపము నీ వంశీనాదమధురధారలగాని శమింపదు. గృహములందు

విడచి నీకై వచ్చిన మాకీప్రాణవ్యధయా. నీ చింతనమున మా హృదయములు మృదులములయినవి. మా కీర్తన ములయందున్న మృదుమధుర ప్రేమ భావార్ద్రమయిన నీ హృదయము కఠినమగుట అసంభవము, నీవు పాపుల నెందఱనో ప్రమదించితివి. దుష్టరాక్షసులను దునుమాడి తివి. మాలోనేమైన పాపములున్న భంజింపుము. నీభక్తులము నీ దాసులము దీనులము నిశ్చయముగ నీవారము నమ్మలేని ఇదే ప్రాణములాన అని నిస్సహాయలై కృష్ణుడుగాక వేఱు దిక్కులేక కన్నీరు కాల్వలుగట్టు ఆ ఇసుకగట్టుల విలపించు చున్న గీతలలో వారిచేతనములుగరగి పారినవి. ఒకఉన్మాదా వస్థలో వారెల్లరు కృష్ణా ! కృష్ణా ! యనుటదప్ప అన్యము లేదు- శ్రీకృష్ణనామ సంస్మరణలో భక్తరక్షకా! బ్రోవవే!

మ॥ అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం
బాడుచున్
దను రావే యని చీరి యేడువ జగత్త్రాణుండు
త్రైలోక్యమో
హనుడై మన్మథ మన్మథుండయి మనోజ్ఞాకారియై
హారియై
ఘనపీతాంబరధారియై పొడమె తత్కాంతా
సమీపంబునన్.

గోపికల ప్రణయ తపస్సు పూర్ణముగ ఫలించినది. గోపికలముందు ప్రత్యక్షమైన శ్రీకృష్ణవిగ్రహము అభయ హస్త ముద్రాంకితమైన వరదాకారముగాదు. మనోహరము మనోఽభిరామమునైన త్రైలోక్యమోహనాకారము. ఒక భక్తుడు భోగభాగ్యములు కోరును, ఒకభక్తుడు సద్వర్తనము కోరును. ఒకభక్తుడుముక్తిగోరును. కాని, గోపికలుకోరినది శ్రీకృష్ణుని యాదరము, శ్రీకృష్ణుని శృంగారరూప సర్వస్వము శ్రీకృష్ణుని హృదయము. ఆ భాగ్యము నేటికి లభించినది-

ఒకతె శ్రీకృష్ణుని కరములు తడిమిచూచును. ఒకతె దగ్గఱగఁజేరి నిలుచును. ఒకతె యాతని చేతులను తనచుట్టు చుట్టుకొనును. ఒకతె, కృష్ణా మేమనిన నీకింత ఉపేక్షయా యని తన చేతులతో కృష్ణుని కంఠమును చుట్టివేయును. వేఱొకతె కృష్ణునే చూచుచు తలపులన్నియు నా రూపమందే నిలిపి సమాధి స్థితినందును. మమ్మన్యాయముసేసి నీవెక్కడికో యేగుటయా, నీవు భగవానుడవు పరమాత్మవని యెఱుగుదుము. పరమాత్మ భక్తులను విడచి యరుగడనును వేదోపనిషత్తులు. సీవెట్లరిగితివి. గోపిక లీ ప్రశ్నల వర్షము గురిపించిరి. ఆ వాక్యములన్నియు నిరంతర శ్రీకృష్ణు చింతనోద్గతములు, పరిశుద్ధములు, నిర్మలభక్తి భావోద్దీపితములు, ప్రత్యుత్తరమీయవలసినస్థితి శ్రీకృష్ణున కేర్పడినది-

వినుడు నేను నానారూపుడనుగాను, సాకార స్వరూపుడనుగూడగాదు. కేవలము మానసబంధుడను. మీకు నాయెడ నిరంతరధ్యానమొసంగుటకే ఒకింత కనుమఱుగయితిని. పెన్నిధి దూరమందున్నప్పుడుగదా దానియందాశక్తి మెండగును వరిక్రైనను – మీరాడిన మాటలన్నియు వినుచుంటిని. నేను మీ హృదయములందే ఉన్నాను. మీ కన్నులకు కనుపించనంతమాత్రమున నేను దూరగుడనని భావింపకుఁడు అని యేమేమో చెప్పుచున్నాడు కృష్ణుడు. కృష్ణుడు ఒకవిచిత్రపురుషుఁడు. విలాసనంసక్తుఁడు గన్పుడు వేదాంతి, బ్రహ్మాదులచే సంస్తుతులందిన పరమ పురుషుఁడు.

శ్రీకృష్ణుని ఆ వేదాంతవాక్యములు గోపికలకు చాలవు. వారితృష్ణ వేరు. వారి ఆసక్తి వేరు. వారి అమృత భావన వేరు. గోపికలను కరగింపఁజాలిన కృష్ణుడు మురళీ మోహనుడు గాయకదేశికుడు నృత్యనిపుణుడు శృంగార రసాధిదేవత. ఈరూపము గోపికల హృదయములలో చెరగని ముద్ర అయినది. ఆరీతి కృష్ణభావసందీప్తహృదయలగు గోపికల నిపుడు కృష్ణుడు తృప్తి గావించవలయును. కృష్ణునిలో ప్రేమానురాగములు వెల్లిగొనినవి. కనులనుండి ప్రణయభావప్లావిత దృక్ప్రసారములు ప్రవహించినవి. మోము సుప్రసన్నకాంతులు వెదజల్లుచున్నది. కృష్ణుడు

గోపికలతో చేతులు కలిపినాఁడు. డెందము డెందములతో రాచినాఁడు. తనువు తనువునఁ జేర్చినాఁడు.

ఉ. ఆసమయంబునన్ విభుఁ డనంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను మండలభ్రమణశీల పరస్పరబద్ధబాహు కాం
తాసువిలాసమున్ బహువిధస్ఫురితాననహస్తపాదవి
న్యాసము రాసముం గృతవియచ్చరనేత్రమనోవికాసముల్

ఆ రాసలీలలో ప్రతి గోపికయు పాల్గొనినది. కృష్ణుడు ఒకపాదము ప్రక్కకెత్తి త్రిభంగిగ నిలుచుండెను. గోప లీలావతీకబరీసుగంధగంధిలములయిన కృష్ణుని అంగుళీయములు మురళి నాతని మధురాధరమ్మున గదించినవి. గానామృతము ఏరులై పారుచున్నవి. ఇద్దఱు గోపికలు ప్రక్కప్రక్కల వీణియలూని గానానందలహరుల ప్రవహింపఁజేయుచున్నారు. గోపసుందరులు చుట్టు మండలాకారమున జేరినారు. ఒక్కొక్క గోపిక కొక్కొక కృష్ణుడు. మధ్య కర్ణికాకృతిని మరల కృష్ణుడు. ఎవరు నిజమయిన కృష్ణుడు, ఎవరు కాదు. అందఱు సత్యకృష్ణులే. అందఱు గోపిక లారాధించిన గోపకృష్ణులే. ఒక పూరేకప్రక్క మరొక పూరేక ఒత్తుగా వికచమై సంఘుల్లమైన సురభిళ పుష్పమువలె ఆ రాసమండలము రాజిల్లినది. ఆ గానములు లయలు తాళములు లాస్యములు హస్తవిన్యాసములు శంఖ చక్ర వజ్ర కందుకాది రాసబంధములు తానకములు పాద

కరన్మభేదమ్ములు మంబుమంజీరశింజనమ్ములు రత్నకటకాభరణమ్ముల మెఱుంగులు దేవతాలోకమునకే నేత్రపర్వము లైనవి. ఒక్కొక గోపకాంతకు తనముందు తనతోనున్న ఆ గోపకృష్ణుడు తప్ప మఱొకరు గోచరించుటలేదు. అందఱు గోపికల కన్నికృష్ణులయి ఆ పరమాత్మ స్వరూపుడు ఆగోపిక లందఱితో రాసలీలల నెఱపిన సమయమది.

ఆ రాసలీలాకృష్ణుని చరణములు, యోగీంద్రమానసాభరణములు, నృత్యసంస్ఫురణమ్ములు, శ్రుతివధూసీమంతవీథికాలంకరణములు, కరములు భాగవతజనహృదయభావనాకరములు. నర్తనము మహాసింద్రతపోలబ్ధ్యనువర్తనము, మురళి ముముక్షు లోకచింతనాసరళి. గానము జీవాత్మ పరమాత్మైక్యసంధానము. యోగేశ్వరేశ్వరుడు శ్రీకృష్ణుడు, పరమయోగినులు గోపికలు. మధురహృదయలయిన గోపలీలావతులు ఆరాధించి అవలోకించి అనుభవించిన దాశ్యంగార కృష్ణవేషాభూషితమైన పరమాత్మ స్వరూపము.

ఇట్టి భావపరిణతి యెట్టివారికిని ఒకనాటితో లభించునదికాదు. నిష్ఠాగరిష్ఠులయిన మహాసింద్రులకే యెన్నోయేండ్లు చెల్లినగాని తపస్సిద్ధి సంప్రాప్తము కాదు. కృష్ణుని చిన్ననాటి చిలిపిచేష్టలకు స్పందించిన గోపికల హృదయములు క్రమక్రమముగ కృష్ణుని రాసలీలల నాటికి సంఫుల్లములై భాసమానములైనవి. గోపికలను జీవనగమ్యమైన

బ్రహ్మజ్ఞాన ధామమునకు తీసికొనిపోయిన లీలలవి. ఆ రాస లీలారహస్య మెట్టిది ?

కృష్ణుడు శ్రీమన్నారాయణుని అవతారము. లీలా మానుషవిగ్రహుఁడు. సాధుజనపరిత్రాణమునకై జనియించిన పరమపురుషుఁడు. భక్తజనులకు పరమపదసిద్ధి కల్పించుటయు శిష్టజనరక్షణమే. శ్రీకృష్ణుని జీవితమంతయు అత్యద్భుత ముగ ఆ నిర్ణయానుసారమే జరిగినది. తదనుకూలముగ స్వయంభగవానుఁడయిన శ్రీకృష్ణుఁ డద్వైతాచార్యుఁడై వెలసినాఁడు. గోపికలు కామినులుకారు. ఆదేశికుని ప్రబోధములో సాంగత్యములో గోపికల చింతనము తురీయస్థాన మునకు జేరి బ్రహ్మభావభాసితమైనది. గోపికల అన్వేషణ, శ్రీకృష్ణుని అధ్యాపకత్వము ఒక తెన్నునబోయిన దివ్య మార్గములు. ఆ మార్గములు శృంగారశోభితములు. ఈ విల క్షణమైన శృంగారమునకు స్థాయిభావము ఆధ్యాత్మిక జ్ఞాన నిరతి. గోపికల భావములు ఆరాధనావిధానములు ఎంత మధురములో శ్రీకృష్ణుని ప్రబోధము లంతకన్నను మధు రాతిమధురములు. గోపికల మధురభక్తికి ఫలము శ్రీకృ ష్ణుని మధురప్రేమ.

గోపికలయెడల ఒక యోగదర్శనమును ప్రసాదించిన విధ మాప్రేమపథము. గోపికల నాకర్షించుటకు శ్రీకృష్ణుడు మురళిని చేపట్టినాడు. అందుండి విశ్వమోహనములైన రాగలహరులు ప్రసరించినవి. శ్రీకృష్ణుఁడు బ్రహ్మపదా

ర్థము; అతనివాక్కే వేదము. ఆగానము వేదోపనిషత్సారము. మాధురీసంభరితము. ఆ గానశ్రవణానందమున వృక్షములు చిగురించి కుసుమించినవి, పక్షులు పరవశించినవి, గోవులు తలలూపినవి. చరాచరముల నిట్లు ప్రభావితము చేయగల ఆ గానమాధుర్యమునకు, ఆ నాదబ్రహ్మమునకు గోపికల చిత్తములు వికసించి ఉప్పొంగినవి. ఆ నాదము కేవల శ్రవణానందము కాదు. విశ్వాసము చిత్తశుద్ధి గల వారికి బ్రహ్మజ్ఞానానందప్రదము. ఆ గానరసము కణశః ఆస్వాదించిన గోపికల హృదయము లాపరమానందముతో నిండిపోయినవి. అది అనుభవైకవేద్యము- అనిర్వాచ్యము. ఆనందో బ్రహ్మేతి యనికదా ఆర్యోక్తి.

శ్రీకృష్ణచేతస్కలైన గోపికలు ఆ యానందభావావేశమున శ్రీకృష్ణునితో రాసకేళి సల్పిరి. వంశీనాదమున వారి కంఠములు కలిపి పాడిరి. కృష్ణుని కరముల వారికరములు కీలించి యాడిరి. పాదవిన్యాసము ననుసరించిరి. శ్రీకృష్ణపరబ్రహ్మతత్త్వము వారిలో ప్రసరించినది. వా రాతత్త్వమున క్రీడించిరి. ప్రతి గోపికయు ఆమె యొక్కతెయే శ్రీకృష్ణునితో కలిసి క్రీడించుచున్నట్లు భావించినది. అనన్యమెఱుగని, జీవబ్రహ్మైక్య మాభావము. కనులముం దొకేపరంజ్యోతీ రూపము. ఆరాసము దైహికవాంఛానిరాసము. మధురభక్తి యోగవిలాసము. బ్రహ్మానందక్షీరాబ్ధిలో ఓలలాడిన గోపికల హృదయస్పందనావిన్యాసము. ఈ అనుభవ మితమిత్థ

మని యెవరూహించగలరు. జీవాత్మపరమాత్మలు సారూప్య మందిన సంస్థితి యది.

గోపికల మేనులు, మనస్సులు, బుద్ధ్యహంకారములు ఆ బ్రహ్మానంద రాసలీలలలో లీనమై కరగిపోయినవి. గోపికా కృష్ణుల రూపము లొకటే ప్రవాహముగ గట్లొరసికొని పారినవి. కలిమిలేములు జననమృత్యువులు నామరూపవిభజనములు స్త్రీపుంసభావము లచటలేవు. సృష్టి యెటనుండి పొటమరించెనో ఆస్థానమది. ప్రణవమునుండి గాయత్రి వరకు పరంజ్యోతిరూపమైన కాంతిపుంజమది. శ్రీకృష్ణతత్వ విహారరసికారామము. శ్రీకృష్ణధ్యానాకర్ణన దర్శనోత్సుకులైన గోపలీలావతులు తాదాత్మ్యమంది శ్రీకృష్ణునితో అద్వైతభావ మందగలిగిన యోగసమాధిస్థితి యది. గోపికా హృదయ శ్రీకృష్ణచింతనకు ఫలమైన పరమావధి.

